# పోతన సాహిత్య గోష్ఠి

8, 9, 10 మార్చి 1983

సంకలనకర్త

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు






ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్నం – 530 003

# అక్షర నీరాజనము

సహస్రవసంత వికసితమైన, విలసితమైన తెనుగు సారస్వతనందనవనంలో 'మందారమకరంద మాధుర్యమున' రసప్రవాహానికి ఏతామెత్తిన పోతన సాహిత్య గోష్ఠి జరపాలన్న సంకల్పం, పోతన సంవత్సరంలోనే ఆంధ్రవిశ్వకళాపరిషత్ – తెలుగు శాఖకి కలిగింది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఆంధ్రశాఖ అభ్యుదయ పరంపరాభివృద్ధికి ఆకాంక్షించే, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు, ఆంధ్ర సాహిత్య కళామర్మజ్ఞులు శ్రీ అవుల సాంబశివరావు గారి ప్రోత్సాహంతో బల పడింది. అప్పుడే కార్యక్రమానికి అంకురార్పణ జరిగింది. కాని, విద్యార్థుల పరీక్షలూ, అధ్యాపకుల నిరీక్షలూ, అధికారుల సమీక్షలూ కారణంగా ఆలస్య మయింది. అయినా, మూడురోజులు మూడుపూటల మూడుపువ్వులూ ఆరు కాయలూ అన్నట్టు పోతన సాహిత్యగోష్ఠి కన్నులపండువుగా వీనులవిందుగా మాత్రమే గాక మెదడుకి మేతగా కూడా జరిగింది.

తెలుగుశాఖ అధ్యాపకులూ, పరిశోధకులూ, విద్యార్థులూ భాగస్వాములుగా, తెలుగు కీర్తిని తీర్చిదిద్దిన కవిపండితవిమర్శకులు కర్ణధారులుగా సాహిత్యగోష్ఠి సాగించాలని ఉపాధ్యక్షుల వారు ఉపదేశించిన ప్రకారం, పోతన సాహిత్యగోష్ఠి రసోల్బణంగా మహోజ్జ్వలంగా సాగాయి. కరుణశ్రీ, నవ్యకవితాలంకరణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు పోహళించిన పోతన కవితారీతులు ముత్యాల సరాలై, సమదర్శులు, సంస్కృతాంధ్రసారస్వత వాచస్పతులు రాంభట్ల లక్ష్మీ నారాయణశాస్త్రిగారు ప్రవచించిన పోతన అద్వైతతత్త్వాంశములు రత్నాలరాశులై సహృదయులు, సంస్కృతాంధ్ర సారస్వత చక్రధారులు నల్లాన్‌చక్రవర్తుల రఘునాథాచార్యులు గారు వివేచించిన పోతన విశిష్టాద్వైతచ్ఛాయలు మాణిక్యవీణలై ; సరసులు, సంస్కృతాంధ్ర తమిళ కర్ణాటవాఙ్మయకళానిధులు తీర్థము శ్రీధరమూర్తి గారు ప్రమాణీకరించిన పోతన ద్వైతసిద్ధాంతప్రమేయములు పగడాలతీగలై ప్రకాశించాయి.

ఇద్దరు అధ్యాపకులు తప్ప అందరు అధ్యాపకులూ, ఎనమండుగురు పరి శోధకులూ వ్యాసపఠనం చేశారు. పన్నెండుగురు విద్యార్థులు పద్యపఠనం చేశారు. అతిథులూ, ఆతిథేయులూ అక్షరమైన అక్షరరూపంలో అమూల్యమైన, అపూర్వమైన, అనన్యమైన వ్యాసాలు వ్రాశారు. అవి గ్రంథరూపంలో సహృదయులకి అందివ్వాలని ప్రయత్నం.

ఒక అతిథీ, ఇద్దరు అధ్యాపకులూ, ఇద్దరు పరిశోధకులూ కావలసినంత కాలవ్యవధానం ఇచ్చినా వ్యాసాలు సమర్పించలేదు. ముగ్గురు అతిథులూ, అయిదుగురు అధ్యాపకులూ, ఆరుగురు పరిశోధకులూ అడిగిన వెంటనే వ్యాసాలు సమర్పించారు. మొత్తం పధ్నాలుగు వ్యాసాల సంకలన మిది.

ఒకానొక దండయాత్రకి ఒదిగిపోయిన ఓరుగల్లుకోట పోతన భాగవతంలో పోతపోయబడిందనీ, ఏకశిలానగరాన్ని మాత్రమే గాక తెలంగాణం ప్రాంతాన్నే విడిచిపెట్టి పోవలసి వచ్చిన సర్వజ్ఞసింగమనాయకుని కుటుంబచరిత్ర కూడా పోతన భాగవతంలో స్ఫురితప్రసుప్తకల్పంగా వుందనీ, ఏకదైవభావప్రబోధమే పోతన ధ్యేయమనీ, ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాల్ని మాత్రమే గాకుండా బౌద్ధజైన సాంఖ్యయోగ మార్గాల్ని సహితం ఉపబృంహితం చేసిన భక్తితత్త్వం భాగవత తత్త్వమనీ, పోతన నిరసించిన అప్పటి మనుజేశ్వరాధములు కర్ణాట కిరాటకీచకులు – అంటే – విజయనగరరాజులు, బహమనీసుల్తానులు అనీ, ఆంధ్ర భాగవతావతరణానికి ఆద్యంతాల్లో అనాటిచరిత్ర ఆధారమనీ 'ఆంధ్రభాగ వతావతరణము – చారిత్రిక నైపథ్యము, అనే వ్యాసంలో నిరూపించబడింది.

అసలు సంస్కృత భాగవతం ఎలా అవతరించిందీ, అది తెనిగించడానికి పోతన ఆత్మీయత ఎలాంటిదీ, భాగవతకథల్లోని భక్తితత్పరతకి పోతన రచన ఎలా తోడ్పడిందీ, కాలాన్నిబట్టి ప్రమాణాలు ఎలా నిర్ణయింపబడతాయి, మొద లైన విషయాల సారం 'పోతన ఆత్మీయత' అనే వ్యాసంలో వివరించబడింది.

నారాయణశతకం పోతనకృతం కాదనీ, వీరభద్రవిజయం బమ్మెరపోతనా మాత్యుని పేరుపెట్టి ఎవరో వ్రాసివుంటారనీ, భోగినీదండకం పోతనకృతమే అనీ, దేశపరిస్థితులు క్లిష్టపరిస్థితుల్లో ఉన్న కారణంగా పోతనే తన భాగవతాన్ని పాతిపెట్టి వుంటాడనీ, పరిస్థితులు చక్కబడింతర్వాత శిథిలభాగాన్ని నారయాదులు పూరించి వుంటారనీ, పూర్వవాదాలన్నీ పరిశీలించినమీదట 'బమ్మెరపోతన కృతులు' అనే వ్యాసంలో విశదీకరించబడింది.

పోతన భాగవతానువాదంలోని మూలప్రపంచీకరణం, అన్యాంధ్రీకరణం, యథామూలానుసరణం మొదలైన విషయాలతీరు సమూలంగా 'పోతన – భాగవ తానువాదము' అనే వ్యాసంలో ప్రదర్శించబడింది.

పోతన రచనలోని కథాకథన శిల్పం, సంభాషణాశిల్పం, పాత్రచిత్రణా శిల్పం, అలంకారశిల్పం, రసశిల్పం, సన్నివేశశిల్పం, పద్యశిల్పం మొదలైన విశేషాల సౌరు సవ్యాఖ్యగా 'పోతన – రచనాశిల్పం' అనే వ్యాసంలో ప్రతిపాదించ బడింది.

భాగవతంలోని విదుర మైత్రేయ సంవాదం, కపిలదేవహూతి సంవాదం, పురంజనోపాఖ్యానం, గజేంద్రమోక్షం మొదలైన ఘట్టాల్లో వున్న అద్వైతతత్త్వం 'పోతన భాగవతం – అద్వైతము' అనే వ్యాసంలో నిర్ణయించబడింది.

భాగవత ప్రథమశ్లోకం, కృష్ణావతారం, భీష్మనిర్యాణం, శ్రుతిగీత మొదలైన ఘట్టాల్లో వున్న విశిష్టాద్వైతతత్త్వం 'పోతనభాగవతము – విశిష్టాద్వైతము' అనే వ్యాసంలో నిర్ధారించబడింది.

గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, కుంతీదేవి కృష్ణస్తుతి, అంబరీషోపాఖ్యానం మొదలైన ఘట్టాల్లో వున్న ద్వైతతత్త్వం 'ఆంధ్రభాగవతము – ద్వైత సిద్ధాంతము' అనే వ్యాసంలో నిశ్చయించబడింది.

పోతన కాలంలోని రాజకీయ పరిస్థితులు, మతం, ఆచారవ్యవహారాలు, వివాహాచారాలు, విద్యావిధానం, యుద్ధవిద్యలు, శిక్షలు, ఆటలు, కళలు మొదలైన విషయాల ప్రతిఫలనం 'ఆంధ్రభాగవతం – సాంఘికవిషయం' అనే వ్యాసంలో ప్రస్తరించబడింది.

అనుమానం, కల్యాణం, కళేబరం, బ్రహ్మాండం, మర్యాద మొదలైన శబ్దాలు అర్థం మారి ఎలా ప్రయోగించబడింది 'ఆంధ్రభాగవతం – అర్థవిపరిణామం' అనే వ్యాసంలో పరిశీలించబడింది.

భాగవత దశమస్కంధంలోని భక్తి ప్రధానంగా మధురభక్తి అనీ, గోపికల కామం మోక్షకామం అనీ 'భాగవతము – మధురభక్తి' అనే వ్యాసంలో అనుశీలించబడింది.

భాగవత సంబంధ గాథలు స్త్రీలపాటల్లో ఎలా విస్తరించిందీ 'భాగవతము – స్త్రీలపాటలు' అనే వ్యాసంలో ఆవిష్కరించబడింది.

పోతన భాగవత వీరభద్రవిజయాల్లో సతీదేవి పాత్ర ఎలా చిత్రించబడిందీ 'సతీదేవి పాత్రచిత్రణ' అనే వ్యాసంలో సమీక్షించబడింది.

భాగవతోపాఖ్యానాల్లోని భగవత్తత్త్వం, ధర్మపరాయణతా, నీతివిచక్షణతా 'ఆంధ్రభాగవతము – ఉపాఖ్యానములు' అనే వ్యాసంలో ఉగ్గడించబడింది.

ఇలా బహుముఖీనంగా భావగతమైన భాగవతం, ఆంధ్రవిశ్వకళాపరిషత్ తెలుగుశాఖ నిర్వహించిన పోతన సాహిత్యగోష్ఠికి అక్షరమైన అక్షరనీరాజనం.

— ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# కృతజ్ఞతలు

1983 మార్చి 8, 9, 10 తేదీలలో ఆంధ్రవిశ్వకళాపరిషత్ – తెలుగుశాఖ నిర్వహించిన పోతన సాహిత్యగోష్ఠికి అతిథులూ, ఆతిథేయులూ సమర్పించిన వ్యాసాలను సంపుటిగా ప్రకటించడానికి సమ్మతించిన ఆంధ్రవిశ్వకళాపరిషత్ – అధికారులకు ;

ముద్రణదోషాలు సవరించడంలో సహకరించిన సహవ్రతులు డాక్టర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రికి, డాక్టర్ కోలవెన్ను మలయవాసినికి ;

ముఖపత్రమును భావచిత్రముగ రూపొందించిన చిరంజీవులు అకొండి శ్రీరామచంద్రమూర్తి, రామచంద్‌లకు ;

ముచ్చటగ ముద్రించిన ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. మదన్‌రాజుగారికి, వారి సిబ్బందికి.

# విషయసూచిక

# ఆంధ్ర భాగవతావతరణము - చారిత్రిక నైపథ్యము

## ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

ఒక మహాకావ్యము అవతరించుటకు ఒకానొక చారిత్రిక హేతువును ఉండును. హేతువులేని కవిత్వకల్పనము సేతువులేని సముద్రలంఘనము. ఎంత మహాకవులైనను ఇంద్రులు, చంద్రులు కాఁగలరు కాని హనుమంతులు కాలేరు. కాలేదు. కవిత్రయమువారి భారతావతరణమునకు వలె పోతన గారి భాగవతావతరణమునకును చారిత్రిక నైపథ్యము కలదు. అది కాల జీమూతమును కదలించినచో సౌదామనీరేఖ వలె సాక్షాత్కరించును.

పోతన కొడుకు మల్లన. మల్లన కొడుకు ప్రౌఢసరస్వతి. ప్రౌఢసరస్వతి కొడుకులు కేసన, మల్లన అను జంటకవులు. వీరు దాక్షాయణీ వివాహ, విష్ణు భజనానందకృతికర్తలు.[1] వీరి తోఁబుట్టువు భర్త అజ్జరపు పేరయలింగము. పేరయలింగము ముత్తాత హరిమంత్రి. కేసన, మల్లన కవుల ముత్తాత పోతన కనుక హరిమంత్రి, పోతన ఒక తరములోనివారు. పోతన తాత ఎల్లన. హరి మంత్రి తాత కొండన. కనుక ఎల్లన, కొండన ఒక తరములోనివారు. కొండన గజపతిని మెప్పించి గౌతమీతటము నందలి అజ్జరమను గ్రామమును అగ్రహార ముగ పడసినట్లు, అజ్జరపు పేరయలింగము రచించిన ఒడయ నంబి విలాసము నందు కలదు.[2] అందలి 'గజరాట్సింహాసనాధ్యక్షుడు కపిలేంద్ర గజపతి అగును. 1448వ సంవత్సరము నాటి పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకా లోని పెనుగొండ శాసనము నందు గజపతి క్షోణీశుని పరిపాలనము సూచింపఁ బడినది.[3] 'పేన్గోణ్డాఖ్యపురోత్తమం గజపతి క్షోణీశ సందీపితమ్' కనుక గజపతిని మెప్పించి, అజ్జరమును కొండన అగ్రహారముగ పడసిన కాలము స్థూలముగ 1450వ సంవత్సరము కావలయును. అది కొండన తరము. అనగా పోతన

తాత ఎల్లన తరమును. వృద్ధుడైనతాత, యువకుడైన మనుమడు సమకాలికు లగుట సహజము. కనుక 1450 వ సంవత్సరము నాటికి పోతన యువకుడు.

పోతన మునిమనుమలు కేసన, మల్లన రచించిన దాక్షాయణీవివాహమునకు గురజాల చినమల్లన సోమయాజి కృతిభర్త. అతని మునిమనుమని కొడుకు పేరమంత్రి 1756వ సంవత్సరము నందు దాక్షాయణీ వివాహమునకు ప్రతివ్రాయించినట్లు కలదు.[4] పేరమంత్రికి, గురజాల చినమల్లన సోమయాజికి నడుమ మూడుతరములు కలవు. కనుక దాక్షాయణీ వివాహకృతి రచనా కాలము 1756–160(40×4) = 1596 వ సంవత్సరము కంటె పూర్వము కాఁజాలదు. 1596 వ సంవత్సరము కావచ్చును. దాక్షాయణీ వివాహ కృతికర్తలైన కేసన మల్లనలకు పోతనకు నడుమ రెండు తరములు కలవు. కనుక పోతన కనీసము భాగవత రచనకు ఉపక్రమించిన కాలము 1596–120(40×3)–1476 వ సంవత్సరము కంటె పూర్వము కాఁజాలదు. 1476వ సంవత్సరము కావచ్చును. పూర్తిచేసిన కాలము 1480వ సంవత్సరము కావచ్చును. 1450వ సంవత్సరము నాటికి యువకుడైన పోతన 1476వ సంవత్సరము నాటికి ప్రౌఢవయస్కుఁడు అగును. అది భాగవత రచనకు అనుకూలమైన వయస్సు. కనుక పోతన భాగవత రచనకు ఉపక్రమించిన కాలము స్థూలముగ 1476వ సంవత్సరము.

పోతన ఇంటిపేరు బమ్మెర. ఇంటి పేరులు సర్వసాధారణముగ స్వగ్రామ నామములు. కనుక పోతన జన్మస్థలము బమ్మెర కావచ్చును. కాని భాగవతము నందు పోతన, 'ఒక్కరాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి... మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధ బంధుజనానుజ్ఞాతుఁడయినట్లు కలదు.(15,23 వచ., 1 స్కం.) ఇందు పోతన ఎచటికి వచ్చినదియును కలదు.ఎచటి నుండి వెడలినదియును లేదు. ఎచటి నుండి వెడలెనో, అచటికే వచ్చుట సహజము. అంతేకాదు. ఏకశిలా నగరమునకు వచ్చి 'అందు గురువృద్ధ బుధ బంధుజనానుజ్ఞాతుఁ' డయ్యె ననగా, పోతన గురువులు, పెద్దలు, పండితులు, బంధువులు ఏకశిలానగరము నందు కలరని అర్థము. అనగా పోతన బాల్యము నుండి ఏకశిలానగరము నందు కలడని తాత్పర్యము. కనుక బమ్మెర జన్మస్థలమైనను, పోతన వాసస్థలము ఏకశిలానగరము.

'ఏకశిలానగరమోరుగల్లే'[5] ఇప్పటి వరంగల్.

ఏకశిలానగరము ప్రథమతః కాకతీయుల రాజధాని. కాకతీయ చక్రవర్తుల కాలమునందు, ఏకశిలానగరము నందు, అనేక దేవాలయములు నిర్మింపఁబడినవి. శిలాప్రాకారము లోపల శివాలయము, ఏకవీరాదేవ్యాలయము, భైరవా

లయము, చముడేశ్వరీ మహాశక్త్యాలయము, వీరభద్రేశ్వరాలయము, స్వయం భూదేవాలయము కలవని వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు కలదు. అవి వల్లభామాత్యుడు చూచినవి కావు. క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభి రామము రచించిన రావిపాటి త్రిపురాంతకుడు చూచినవి. ప్రేమాభిరామము రచనాకాలము స్థూలముగ 1380వ సంవత్సరము[6]. 1325వ సంవత్సరము నుండి 1368వ సంవత్సరము వరకును ఏకశిలానగరము ముసునూరి ప్రోలయ నాయకుని, అతని సోదరుడైన కాపయనాయకుని రాజధాని.[7] 1369వ సంవత్సరము నుండి 1425వ సంవత్సరము వరకును ఏకశిలానగరము నిరాటంకముగ రాచకొండ, దేవరకొండ వెలమనాయకుల ఏలుబడి యందు కలదు.[8] కనుక 1380వ సంవత్సరము ప్రాంతము నందు రావిపాటి త్రిపురాంతకుడు చూచిన ఏకశిలానగరములోని దేవాలయములకు 1425వ సంవత్సరము వరకు ప్రమా దము లేదు. 1425వ సంవత్సరము నందు బహమనీసుల్తాను అహ్మద్‌షా (1422–36) రాచకొండ, దేవరకొండ వెలమరాజుల మీద కక్షసాధింపు చర్యగ దండయాత్ర సాగించెను.[9] అతని సర్దారు ఖాన్–ఇ–అజామ్ అబ్దుల్ లతీఫ్ ఓరుగల్లును ముట్టడించెను. రాచకొండ వెలమరాజైన రెండవ అనపోత నాయకునికి, అబ్దుల్ లతీఫ్‌కు ఓరుగల్లు నందు యుద్ధము జరిగెను. ఆ యుద్ధమునందు ఏకశిలానగరములోని దేవాలయములకు ప్రమాదము కలదు. అంతేకాదు అహ్మద్‌షా అన్ని దండయాత్రల యందును దేవాలయములను కూలగొట్టించి, మసీదులు కట్టించినట్లు – సయ్యద్ అలీ తబతబ 1591వ సంవత్సరము నందు వ్రాసిన బర్హన్–ఇ–మాసిర్ అను గ్రంథము నందు కలదు.[10] కనుక ఏకశిలానగరములోని కొన్ని దేవాలయములు 1425వ సంవత్స రము నందు నేలసపాటము కావచ్చును.

1425వ సంవత్సరము నందు జరిగిన ఓరుగల్లు యుద్ధము నందు అనపోత నాయకుడు వీరస్వర్గమును అలంకరించుట వలన, అతని కొడుకు సర్వజ్ఞసింగమ నాయకుడు రాచకొండ రాజ్యాధిపతి అయ్యెను.[11] అతనికి 1433వ సంవత్సరము నందు అహ్మద్‌షా ఓరుగల్లు రాజ్యమును కప్పము గట్టునట్లు అప్పగించెను.[12] కాని, బహుశః 1450వ సంవత్సరమునందు అహ్మద్‌షా ప్రతినిధి సంజార్ ఖాన్, సర్వజ్ఞసింగమనాయకునితో యుద్ధము చేసి, రాచకొండ రాజ్యముతో పాటు ఓరుగల్లు రాజ్యమును స్వాధీనము చేసికొనెను.[13] అది 1460వ సంవ త్సరము నందు కపిలేంద్రగజపతి అధీనమైనది.[14] మఱల 1471వ సంవత్సరము తర్వాత బహమనీసుల్తాను మూడవ షమ్సుద్దీన్ మహమ్మద్‌షా (1463–82) వశమైనది.[15] ఓరుగల్లు రాజ్యముతోపాటు రాచకొండ, దేవరకొండ, కొండ వీడు, కొండపల్లి, రాజమండ్రి రాజ్యములును అతని వశమైనవి.[16] 1473–75 సంవత్సరముల నడుమ మహాక్షామము సంభవించినది.[17] బీజపూరు

క్షామమని దానిపేరు. "తెలంగాణము నందును రెండు సంవత్సరములు విత్తనములు చల్లుకొనుటకు దిక్కు లేకపోయినది. మూడవ సంవత్సరము నందు మాత్రము కొలదిగ వానలు కురిసి దుక్కుసాగినది" అని ఫెరిస్తా అందిచ్చిన సమాచారము.[18] అట్టి క్లిష్ట సమయము నందు రాచకొండ, దేవరకొండ, కొండవీడు, కొండపల్లి, రాజమండ్రి రాజప్రతినిధులు పురుషోత్తమ గజపతి సహాయము నంది మహమ్మద్‌షా మీద తిరుగుబాటు లేవదీసిరి.[19] ఆ తిరుగుబాటును అణచివేయుటకు మహమ్మద్‌షా దండయాత్ర సాగించెను.[20] ఓరుగల్లును స్వాధీనము చేసికొని అజీజ్‌ఖాన్‌ను ప్రతినిధిగ నియమించెను.[21] మహమ్మద్‌షా దండయాత్రలో మఱల ఏకశిలానగరము నందు మఱికొన్ని దేవాలయములు నేలసపాటములగు అవకాశము కలదు. అంతేకాదు. మహమ్మద్‌షా కాంచీనగరములోని దేవాలయములను నేలమట్టము చేసినట్లు బర్హాన్–ఇ–మాసిర్ అను గ్రంథము నందు కలదు.[22] కాంచీనగర దండయాత్రాకాలములందు కాంచీనగరములోని దేవాలయముల వలె ఏకశిలానగర దండయాత్రాకాలము నందు ఏకశిలానగరములోని దేవాలయములు నేలసపాటములగుట సహజము. కనుక ఏకశిలానగరములోని మఱికొన్ని దేవాలయములు 1475వ సంవత్సరము నందు నేలసపాటములు కాగలవు. 1323, 1425, 1475 సంవత్సరము లందు ఏకశిలానగరములోని అనేక దేవాలయములు నేలసపాటములగుటకు – అఖండ శిల్పకళా ఖండమైన స్వయంభూదేవాలయము ఖండఖండములై పడియుండుట ప్రత్యక్షనిదర్శనము.

అసలు దేవాలయములు ఆనాడు ఇహ పరసాధనములు. ఐహికముగ విద్యావినోదగోష్ఠులకు వితర్దికలు. పారమార్థికముగ మోక్షపదవీపీఠములకు నిశ్రేణికలు. స్వమత సౌభాగ్యమునకు దిక్సూచికలు. అవి నేలసపాటము లయినవి అనగా, విద్యావినోదములు అడుగంటిన వని, మోక్షపదవులు మూలపడిన వని, స్వమత సౌభాగ్యము సంచలించినదని అర్థము. అంతేకాదు. పరమత సౌభాగ్యము ప్రబలినదని తాత్పర్యము. అది 1323వ సంవత్సరము నందు బీజన్యాసము జరిగి, 1425 వ సంవత్సరమునందు బిందువికాసము కలిగి, 1475వ సంవత్సరము నందు పతాక స్థాయి నందినది. అంతేకాదు. స్వమతము నందు సంవాదములు సకృత్తు. వివాదములు సమృద్ధి. బ్రాహ్మణ బౌద్ధ జైన మతముల సంఘర్షణ సమసి పోయినను, శైవ వైష్ణవ మతముల వైరుధ్యము సడలిపోయినను, అద్వైత విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతముల త్రైరాజ్యము వదలిపోలేదు. ఉపరి, దేవుడు ఒక్కడైనను పెక్కుమంది 'దేవుళ్లు' వెలసిరి. 'ఏకంసత్ విప్రా బహుధావదన్తి' అని ఋగ్వేదవాణి ఉద్ఘోషించినను ఏకదైవ భావము కంటె బహుదైవ భావము ప్రబలమైనది. దైవమునకు సంబంధించినది మతము. మతమునకు జీవితమునకు ఆ కాలము నందు అవినాభావ సంబంధము

కలదు. అది ధీమాన్యులకు పరిమితము కాదు. సామాన్యులకును పర్యాప్తము. అనేకత్వములోని ఏకత్వము సామాన్యులకు అందని ఫలము. పరమతములోని ఏకదైవభావము ప్రలోభనీయము. బాహిరమైన బలప్రయోగమునకు సాయము, అంతరమైన విషాద యోగము. ఇది కనులారఁ గాంచిన మహాకవి మనసార మథన పడుట మానవ సహజము. మహాకవి మానసవీథిలోని సముద్రమథనమునకు ఫలము మహాకావ్యామృత కలశము.

బాల్యము నుండి ఏకశిలానగరము వాసస్థలమైన బమ్మెరపోతనకు 1425 వ సంవత్సరము నుండి 1450 వ సంవత్సరము వఱకు జరిగిన ఏకశిలానగరచరిత్ర వినుకలి. 1450 వ సంవత్సరము నుండి జరుగుచున్న ఏకశిలానగర చరిత్ర కనుకలి. ఆనాడు ఏకశిలానగర చరిత్ర ఆంధ్రదేశచరిత్రకు ఆయువు పట్టు. అది 1476 వ సంవత్సరము నందు భాగవత రచనకు ఉపక్రమించిన పోతనకు ఉద్దీపనభావము.

ఒకానొక దండయాత్రకు ఒదిగిపోయిన ఓరుగల్లు కోట పోతన భాగవతము నందు పోతపోయబడినది. అది కూడ దండయాత్రా సందర్భమే. అయినను సంస్కృత భాగవతము నందు లేని అనేక విశేషములు పోతన భాగవతము నందు కలవు. అది బలిచక్రవర్తి అమరావతీ దండయాత్ర !

అమరావతీ నగర వర్ణనము సంస్కృత భాగవతము నందు సరిగా పండ్రెండు శ్లోకము లందు కలదు (12–23 శ్లో॥లు, 15అ. ; 8 స్కం.) అది పోతన భాగవతము నందు అరవై శ్లోకముల పెట్టు. మూడున్నర పుటల సుదీర్ఘవచనము (447 వచ., 8 స్కం.) అందు ఏకశిలానగర వర్ణనము అంతర్లీనముగ కలదు. 'ముందట నెడపడక మొనమోసి యిగురుచు చిగురు తలిరాకు జొంపంబు నన మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెల కతంబుల ప్రేఁగు లాఁగలేక మూఁగి వీఁగి వ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకలకుఁ బేటలగు పెందోటలు' ఓరుగల్లు లోనివి. 'అమృతంబు గురియు కామధేనువులు' అమరావతీ నగరములోనివే కాని, 'పరాగంబుల సరాగంబులగు వాఁగు వ్రంతల చెంతల గుంపులు గొని గఱికిజొంపంబుల లంపులు దిని మంపులు గొని పెల్లు నెమర్లు పెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడవాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్లవాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారి కలగు' కామధేనువులు ఏకశిలా నగరములోని గ్రామధేనువులే. వానికి 'నిలువనీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు' తరువులే కల్ప తరువులు. 'చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుంజెచ్చెర నెదురుచని తూకొని తోకొనిపోవు రంభాదులు' ఆక్కడివారే గాని, 'తోరణస్తంభముల చేరువ నిలిచి చెఱకు

విలుతుం దొలు వెలికిన బెడిదములగు నవకంపు మెఱుఁగుం జిగురు టడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం గరచరణాది శాఖలుగల చంద్రరేఖల పోఁడిమిని వాహిని గల మోహినీ విద్యల గ్రద్దనఁ జూపుచుకుం దీవు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గల' వారు ఇక్కడివారే.

అమరావతి కోట అచ్చముగ ఓరుగల్లు కోట. ఓరుగల్లు కోట వర్తులా కారము. సప్తప్రాకార సంవలితము. చతుర్ద్వార సంకలితము. తోరణస్తంభ సంఘటితము. మఱి అమరావతి కోటలోను 'ఇభంబుల సరస నొరసికొని వరుసఁ బరుసదనము వెడలి సుకరములగు మకరతోరణస్తంభంబులును' కలవు. 'వారవనితా సుపూజిత విరాజిత దేహళీపాటవంబులగు గోపుర కనక కవాటంబులును గవాటవేదికాఘటిత మణిగణకిరణోదారంబులగు నింద్రనీలస్తంభ గంభీరతలును గంభీర విమల కమలరాగ పాలికామాలికావారంబులగు చతుర్ద్వారంబులును' కలవు. •మిగుల గరితయగు నగరిసిరి మీఱు నమరు మొగులు వొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడితెరల వలువల బెడంగునం దోరంబులగు, ప్రాకా రంబులును' కలవు. అంతేకాదు. అమరావతికోట 'కాంతాకుచంబునుంబోలె సువృత్తంబయి— కృతార్థంబయిన'ది. అమరావతి కోటలో చతుర్ద్వారముల 'ద్వారదేశంబుల బావిల్లం గావల్లుండి ప్రొద్దుపోక రక్కసుల వేల్పుల కయ్యం బుల నెయ్యంబులం జెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులు శూరులు నయిన మహాద్వారపాలక వీరులును' కలరట! వేల్పుల, రక్కసుల కయ్యములు నెయ్య ములు అమరావతిలోని చతుర్ద్వారపాలక మహావీరులు చెప్పికొనుట ఏమోగాని, స్వదేశ విదేశ రాజుల సంధిప్రయత్నములు, యుద్ధవిశేషములు ఓరుగల్లుకోట లోని చతుర్ద్వారద్వారపాలక మహావీరులు చెప్పికొనుట నిజము. అంతేకాదు అమరా వతి కోట ప్రాకారములకు 'ప్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహాఖర్వ గంధర్వవాహినీ పాలకంబులగు మరకతాట్టాలకంబులును' కలవట! అమరావతి లోని అట్టాలకము లందు గంధర్వసేన యుద్ధసన్నద్ధము కాదు గాని, ఓరుగల్లు కోట బురుజులందు మనుష్యసేన యుద్ధసన్నద్ధము. ఉపరి, 'హిమకరమండలంబు సిద్దంపు టద్దంబని మూఁగి తొంగి చూచుచు నలికఫలకంబునఁ గులకములు గొను నలకములం దరపి తిలకములం దెఱఁగుపఱుచుకొను సమయముల వెనుక నొదిఁగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితరసతుల రతుల కనుమతులని కనుకనిన్ మరలి నీడతలంగినం గలంగి చని కాంతులు వొలయ నలయు ముగు దలకు నేకాంతంబులై గగనసముత్సేధంబులైన రాజసౌధంబులు' నిస్సందేహ ముగ ఓరుగల్లు రాజసౌధములే. 'వైరికిం జీరికింగానక శంకలుడిగి అంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు....దిరుగు వీరభటకదంబంబులు, కదంబకర

వాల శూలాదుల మెఱుంగులు, నడమొగిళ్ల పెల్లున రథంబులగములు, తురంగంబుల నురంగంబులు, గానసాహిత్య నృత్యవిశేషములు' ఏకశిలానగర విశేషములు.

అన్నిటికంటె అగ్రేసరములైనవి 'పరభట ప్రాణవంచనంబులు సముదంచనంబులు నగు దంచనంబులు.' దంచనమన 'పెద్దఫిరంగి' అని శబ్దరత్నాకరము. 'కోటలు మున్నగునవి బ్రద్దలుకొట్టుట కుపయోగించు అయుధవిశేషము, శత్రువులు కోట నెక్కకుండ క్రిందికి త్రోయుటకు ఱాలను విసురు అయుధవిశేషము' అని సూర్యరాయాంధ్రనిఘంటువు. అది మహమ్మదీయుల ఆయుధ విశేషము. శిలాయంత్రాయుధ విశేషము. ఇప్పటికిని ఓరుగల్లు కోటలోని శంభుని గుడి ఆవరణము నందు ఇట్టి ఆయుధవిశేషములు రెండు కలవు. కనుక 'పరభట ప్రాణవంచనములైన దంచనములు, బలిచక్రవర్తి దండయాత్రాకాలము నందలి అమరావతీ నగరములోని ఆయుధ విశేషములు కావు గాని, బహమనీసుల్తాను దండయాత్రాకాలము నందలి ఏకశిలానగరములోని ఆయుధ విశేషములే, ఇట్లు ఏకశిలానగర వర్ణనము అంతర్లీనమైన పోతన అమరావతీనగర వర్ణనము. పోతన అంతశ్చేతనకు అచ్చపు మణిదర్పణము.

బలిచక్రవర్తి సమరశంఖము పూరించగానే. బృహస్పతి ఆదేశానుసారముగ ఇంద్రాదిదేవతలు కామరూపులై త్రివిష్టపమును విడిచిపెట్టి ఎటకో పోయిరి. బలిచక్రవర్తి స్వర్గాధిపతి అయ్యెను. అది దేవతల తల్లి అదితికి బాధ కలిగించెను. ఆమెభర్త కశ్యపబ్రహ్మ చిరకాలతపస్సమాధిని చాలించి స్వగృహమునకు వచ్చెను. రాగానే, దీనవదన యైన భార్యను చూచి. 'విప్రులకు, లోకమునకు, ధర్మమునకు అభద్రము లేదు కద ? అయోగులు కూడ ధర్మార్థకామముల ఫలములు పొందు గృహములలో కొంచెమైనను అకుశలము లేదు కద?' అని కుశలప్రశ్నలు వేసెను. ఆ ప్రశ్నలకు అదితి 'గోబ్రాహ్మణులకు, జనధర్మములకును భద్రమే. గృహములెల్ల ధర్మార్థకామ త్రివర్గములకు నిలయములే. అగ్నులు, అతిథులు, భృత్యులు, భిక్షువులు, క్షేమమే, అని సమాధాన మిచ్చినట్లు సంస్కృతభాగవతము నందు కలదు (11,12 శ్లో॥లు. 16 అ., 8 స్కం.). ఇది పోతన భాగవతము నందు లేదు. పోతన కాలము నందును గోబ్రాహ్మణులకు, ధర్మార్థకామములకు, అగ్న్యతిథిభృత్యభిక్షువులకు మాత్రమే కాదు; ఏకశిలా నగరవాసులు ఎవ్వరికిని క్షేమము లేదు. అంతేకాదు. 'బృహస్పతి వచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమ తమ పొందు పట్లకుం జనిరి, అని (458 వచ., 8 స్కం.) ముందు రచించిన పోతన, తర్వాత అమూలకముగ రచించిన పద్యమిది—

ఎండకన్నెఱుఁగని యిందృని యిల్లాలు
వలు పంచలను జాలిఁబడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁడడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబు బిడ్డలు జయంతాదులు
శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేడు

బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁడాహరించుచుఁ
గడఁగి సురల కొక్క కడియు నీఁడు—471 ప., 8 స్కం.

తమ పొందు పట్టునకు చనిన ఇంద్రుని ఇల్లాలు ఎండ కన్నెఱుగనిది, పలు పంచల జాలిఁబడినది కాదు. అకాలము నందు అసూర్యంపశ్య అయిన రాజవల్లభ పరులపంచల పాలైనది. దేవేంద్రుడు త్రిభువనసామ్రాజ్యవిభవమును కోల్పోయినను అడవులలో తిరుగలేదు. త్రిలింగ సామ్రాజ్యవిభవమును కోల్పోయిన రాజు అడవులలో తిరుగకపోలేదు. ఇంద్రుని కుమారులు జయంతాదులు శబరార్భకుల వెంట చనలేదు. రాజకుమారులు ఆటవికుల వెంటచనక పోలేదు. అమరావతి అసురులకు వలె, ఏకశిలానగరము విదేశీయులకు అట పట్టయినది. నాడుబలిచక్రవర్తియే కాదు ; నేడు – అనగా పోతనకాలమునాడు -- బహమనీసుల్తాను కూడ బలియుచున్నాడు. బలిచక్రవర్తిని ఇంద్రుడు గెలువలేడు, బహమనిసుల్తానును నరేంద్రుడు గెలువలేడు. బలిచక్రవర్తి యాగభాగములను ఆహరించుచు సురలకు ఒక్క 'కడియును' ఈయడట ! కడి అన ముద్ద, అన్నపు ముద్దబలిచక్రవర్తి దేవతలకు అన్నము పెట్టకుండ, యాగభాగములను ఆహరించుట ఏమోగాని, బహమనీసుల్తాను సామాన్య ప్రజలకు అన్నము దక్కకుండ భోగ భాగ్యములను అనుభవించుట చారిత్రిక సత్యము. ఇది పోతన భాగవతము లోని సమకాలిక స్థితిగతుల ప్రతిఫలనము. ఇందు – బహుశః 1450వ సంవత్సరము నందు – ఏకశిలానగరమును మాత్రమే గాక తెలంగాణమును విడిచిపెట్టిన సర్వజ్ఞసింగమ నాయకుని చరిత్ర స్ఫురిత ప్రసుప్త కల్పముగకలదు.

ఇంతకు సంస్కృత భాగవతము నందు సమస్యాపరిష్కార సాధనముగ కశ్యపబ్రహ్మ అదితికి పయోవ్రతమును ఉపదేశించెను. పయోవ్రతవిధానము సంస్కృతభాగవతము నందు ముప్పదియైదు శ్లోకము లందు కలదు (25–59

శ్లో॥లు, 16 అ., స్కం. 8.) అంతేకాదు. పయోవ్రతము సర్వయజ్ఞము సర్వవ్రతము తపస్సారము అని స్పష్టముగ కలదు.

అయంవై సర్వయజ్ఞాఖ్యః సర్వవ్రతమితి స్మృతమ్
తపస్సారం భద్రే దానంచేశ్వరతర్పణమ్
—60 శ్లో., 16 అ., 8 స్కం.

ఇందు పయోవ్రతము సర్వయజ్ఞము, సర్వవ్రతము, తపస్సారము అని ఇదమిత్థముగ కలదు. ఇటి పయోవ్రతోపదేశము పోతన భాగవతము నందును కలదు గాని (480 వచ., 8 స్కం.) పయోవ్రతవిధాన వివరము గాని, సర్వయజ్ఞము సర్వవ్రతము, తపస్సారము అను మాటలు గాని మచ్చునకైనను లేవు. యజ్ఞము కర్మమార్గ విషయము. తపస్సు జ్ఞానమార్గ విషయము. కర్మమార్గమునకు కర దీపిక, జ్ఞానమార్గమునకు జయపతాక అయిన పయోవ్రతవిధాన వివరమును పోతన విడిచిపెట్టుటకు హేతువు, పోతన కాలము నందు ప్రోది చేయవలసిన భక్తిమార్గము.

అసలు సంస్కృత భాగవతము అవతరించినది భక్తినిమిత్తము. వ్యాసుడు హరిభక్తియోగమైన భాగవత సంహితను రచించినట్లు సంస్కృతభాగవతము నందు కలదు (6 శ్లో., 7 అ. 1 స్కం.) భక్తివిశేషంబు జనించునట్టి భువన క్షేమంకరంబైన 'భాగవతామ్నాయము'ను రచించినట్లు పోతన భాగవతము నందు కలదు. (136 ప., 1 స్కం.) అయినను, సంస్కృత భాగవతమును అతిశయించిన పోతన భాగవతము ప్రత్యేకత రసప్రసారముతోపాటు భక్తిప్రబోధమే.

పోతన రామభక్తుడని ప్రసిద్ధి. కాని, భాగవతములోని పోతన ఇష్టదేవతాస్తుతి యందు రామస్తుతి లేదు. అంతేకాదు. పోతన తండ్రి 'శైవశాస్త్రముఁగనియె' (25 ప., 1 స్కం.) తల్లి 'సదాశివపాదయుగార్చనానుకంపానయ వాగ్భవాని' (26 ప., 1 స్కం.) అన్న 'ఈశ్వరసేవాకాముఁడు' (27 ప., 1 స్కం.) పోతన 'మాయమ్మ' అన్నది దుర్గను (10 ప., 1 స్కం.) ఆమె 'అమ్మలఁగన్నయమ్మ' అంతేకాదు 'ముగురమ్మల మూలపుటమ్మ' ఉపరి, 'చాలఁబెద్దమ్మ' అనగా మహాశక్తి. దుర్గామహాశక్తి. ఇంత శైవకుటుంబి పోతన భాగవత రచనకు శ్రీకారము చుట్టుచు, 'శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్' అన్నది 'మహానందాంగనాడింభకున్'( 1 ప., 1 స్కం.) అంతేకాదు 'వాలిన భక్తి మ్రొక్కెద' నన్నది 'బాలశశాంకమౌళిని (2 ప., 1 స్కం.) ఉపరి, 'అతతసేవఁ జేసెద' నన్నది 'భారతీహృదయసౌఖ్యవిధాత'ను (3 ప., 1 స్కం.) పోతన మహానందాంగడింభకుడు 'కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానాకంజాతభవాండ కుంభకుడు' (1 ప., 1 స్కం.) అనగా సృష్టికర్త. పోతన భారతీహృదయసౌఖ్య

విధాత 'సమస్తచరాచరభూతసృష్టి విజ్ఞాత' (3 ప., 1 స్కం,) అనగా సృష్టికర్తయే. ఇట్లు త్రిమూర్త్యభేదమును త్రికరణశుద్ధిగ 'నిఖిల భువనప్రధాన దేవతావందనంబుఁ జేసిన (4 వచ., 1 స్కం.) పోతన ప్రథమతః తలపోసిన విషయమిది.

చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁజేటు.

— 14 ప., 1 స్కం.

ఇందు శివపూజ, హరిభక్తి, దయ, సత్యము ప్రతి మానవునికిని ప్రాథమిక ధర్మములని ఇదమిత్థముగ కలదు. అనగా పరమధర్మములని ఆంతర్యము. దయ, సత్యము ఇహమునకు సంబంధించినవి. శివపూజ, హరిభక్తి పరమునకు సంబంధించినది. ఇహపరములు రెండును ఇందు కలవు. అనగా ఇహములేని పరము, పరములేని ఇహము పోతనకు ఇష్టముకాదని అవగాహన మగును. శివపూజ, హరిభక్తి పరమునకు వలె భూతదయ, సత్యవచనము ఇహమునకు ఆవశ్యకములని పోతన సిద్ధాంతము. ఇట్టి సిద్ధాంతముకల పోతన రచింపఁ దలచినది 'శ్రీమన్నారయణ కథాప్రపంచము' (15 వచ., 1 స్కం.) అందుకు పోతన ప్రథమతః ఆచరించినది 'గంగాస్నానము.' తదుపరి కావించినది 'మహేశ్వరధ్యానము' (15 వచ., 1 స్కం.) అందువలన దర్శన మొసగిన, రాజముఖ్యుడు, రాజశేఖరుడైన రామభద్రుడు (16 ప., 1 స్కం.) రాజశేఖరుడన రాజశ్రేష్ఠుడనియే గాక, మహేశ్వరుడని కూడ అర్థము. రాజశేఖరుడైన రామచంద్రుని అనతిని, హరి కరుణావిశేషమునను కృతార్థత్వము సిద్ధించెనని పోతన చిత్తము నందు రామచంద్రుని సన్నిధానము కల్పించుకొని (28 వచ., 1 స్కం.) రచించిన పద్యములు కృష్ణపరము. (29-32 ప॥లు.,1స్కం). కృష్ణపరమైన షష్ఠ్యంత పద్యములకు తొలిపలుకు 'హరి'. తుదిపలుకు 'శేషశాయి.' హరి అన మనోహరుడు. భక్తుల మనోహరుడు భగవంతుడు. శేషశాయి అన శ్రీమహావిష్ణువు. ఇట్లు షష్ఠ్యంత పద్యములు కృష్ణపరమైనను స్కంధాద్యంత పద్యములు రామపరము. అనగా శ్రీమన్నారాయణుడు, మహేశ్వరుడు, రాముడు, కృష్ణుడు ఒకడే. అని పోతన ఉపదేశము. అంతేకాదు. లోకరక్షైకారంభకుని గుఱించి చింతనము, బాలశశాంకమౌళికి భక్తి నమస్కారము, భారతీహృదయసౌఖ్యవిధాతకు సేవనము, భాగవత ప్రతిపాదితములైన నవవిధ భక్తులలోని అవాంతర భేదములు. నవవిధ ప్రభేదాత్మకమైన భక్తి ఒకటే, భగవంతుడును ఒకడే. ఇట్లు ఏకదైవభక్తి భావమును కావ్యముఖము నందే తిలకము దిద్దితీర్చినట్లు పోతన తీర్మానించుటకు హేతువు చారిత్రికావశ్యకము.

సంస్కృత భాగవతము నందు సూతుడు భాగవతమును వినిపించుటకు శౌనకాది మహామునులు కావించిన విజ్ఞప్తి యందు ఇట్లు కలదు —

ప్రాయేణాల్పాయుష ః సభ్య కలావస్మిన్యుగే జనాః
మన్దా ః సుమన్దమతయో మన్ద భాగ్యాహ్యుపద్రుతాః
భూరీణి భూరికర్మాణి శ్రోతవ్యాని విభాగశ ః
అతః సాధోఽత్ర యత్సారం సముద్ధృత్య మనీషయా
బ్రూహినః శ్రద్ధానానాం యేనాత్మా సంప్రసీదతి
— 10, 11 శ్లో॥లు., 1 అ., 1 స్కం.

ఇందు 'కలియుగము నందు జనులు ప్రాయికముగ అల్పాయుష్కులు, మందులు, మహామందమతులు, మందభాగ్యులు, ఉపద్రుతులు. అనేక కర్మములను వర్గీకరించిన యెడల విన(దగినవి పెక్కులు ఉండును. అన్నకు ప్రసన్నత కలిగించు అందలి సారమును ధీశక్తిని సముద్ధరించి శ్రద్ధాళువులమైన మాకు చెప్పుము' అని కలదు. ఇది పోతన తెనుగుసేతను ఇట్లు కలదు —

అలసులు మందబుద్ధిబలు లల్పతరాయువు లుగ్రరోగ సం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియు( జేయ(జాలరీ
కలియుగ మందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే
— 44 ప., 1 స్కం.

ఇందు 'సుకర్మము లెవ్వియు(జేయ(జాలరు' అను పోతన అమూలక వాణి అవశ్యగమనార్హమైన అంశము. సత్కర్మాచరణము చేయని స్థితి గాక, సత్కర్మాచరణము చేయ(జాలని స్థితి చెప్ప(బడినది. చేయని స్థితికి, చేయ(జాలని స్థితికి అంతరము కలదు. 1327 వ సంవత్సరము నాటి ప్రోలయనాయకుని విలస తామ్రశాసనము నందు 'త్యాజితకర్మబంధాః, అను విశేషణము కలదు[23]. తమంత తాము కర్మాచరణమును మానినవారు త్యక్తకర్మబంధులు. తమంత తాము గాక, మఱొకరి ప్రతిబంధకము వలన కర్మాచరణము మానినవారు త్యాజితకర్మబంధులు. 'సుకర్మము లెవ్వియు( జేయజాల'ని వారు కూడ త్యాజితకర్మబంధులే. 1323 వ సంవత్సరము నాటి స్థితి 1475వ సంవత్సరము నందును ఏకశిలానగరము నందు కలదు. అది మఱి అందఱికిని సౌఖ్యము లేని స్థితి. ఆత్మశాంతిలేని స్థితి 'సుకర్మము లెవ్వియున్' అనగా అనుష్ఠేయములైన కర్మములు మాత్రమే గాక, శ్రోతవ్యములైన కర్మములు కూడ. శౌనకాది మహామునులు శ్రోతవ్యములైన కర్మముల సారంశము, శ్రద్ధాళువులైన తమకు చెప్పుమని సూతుని అడిగినట్లు పోతన అంధ్రీకరింపలేదు. ఎయ్యది సర్వ

సౌఖ్యమై యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే, అని శౌనకాది మహామునులు అడిగినట్లు పోతన అన్యథాకరించెను. కారణము ? ఆనాటి సామాజికస్థితియే. ఆ స్థితిలో కర్మమార్గమునకు అవకాశము కల్గదు. జ్ఞానమార్గమునకు అధికారము చాలదు. 'సర్వసౌఖ్యమై యలవడు'నది భక్తి మార్గము. 'ఆత్మకు శాంతి' కలిగించినదియును భక్తిమార్గమే. అందుకు మఱల ఆలంబనయష్టి ఏకదైవభావమే.

సంస్కృతభాగవతమునందు శౌనకాదిమహామునులు కావించిన విజ్ఞప్తి యందే మఱొక శ్లోకము ఇట్లు కలదు—

తస్య కర్మాణ్యుదారాణి పరిగీతాని సూరిభిః
బ్రూహి నః శ్రద్దధానానాం లీలయా దధతః కలాః

—17 శ్లో., 1 అ., 1 స్కం.

ఇందు 'కలాః' అనగా 'బ్రహ్మరుద్రాది మూర్తీః' అని శ్రీధరటీక. 'బ్రహ్మమహేశ్వరుల మూర్తులను లీలగా ధరించు విష్ణువు యొక్క సూరిజన స్తుత్యములైన ఉదారకర్మములను మాకు చెప్పు' మని తాత్పర్యము. బ్రహ్మ మహేశ్వరుల కంటె విష్ణువు అధికుడని ఆంతర్యము. అది మఱల పరమదైవ భావము. ఇది పోతన తెనుగుసేతలో ఇట్లు కలదు—

హరినామకథనదావానలజ్వాలచేఁ
గాలవే ఘోరాఘకాననములు
వైకుంఠదర్శనవాయుసంఘంబుచేఁ
దొలఁగవే భవదుఃఖతోయదములు
కమలనాభధ్యానకంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తిఁ
దీఱవే షడ్వర్గతిమిరతతులు
నలిననయభక్తి నావచేఁగాక సం
సార జలధిదాఁటి చనఁగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత ధీసమేత

—50 ప., 1 స్కం.

ఇందు విష్ణుకథాకర్ణనము, విష్ణుదర్శనము, విష్ణుధ్యానము, విష్ణుస్మరణము, విష్ణుభక్తి, విష్ణుప్రభావము వినా విష్ణ్వాధిక్యము లేదు. అనేక స్థలములందు శ్రీధరీయ వ్యాఖ్యను అనుసరించిన పోతన, విష్ణ్వాధిక్యమును సూచించు

శ్రీధరీయ వ్యాఖ్యను ఇట అనుసరింపకపోవుట అవశ్యగమనార్హమైన విశేషము. అంతేకాదు. అపరిహార్యములైన కథాసందర్భము లందువినా, అమూలకముగ కాని, అన్యథామూలకముగ కాని పోతన విష్ణ్వాధిక్య ప్రతిపాదనము చేయలేదు, సరికదా విష్ణు శబ్దముతోపాటు ఈశ్వర శబ్దమును అనేక స్థలములందు పోతన అమూలకముగ ప్రయోగించెను. ఉపరి, అమూలకముగ పోతన బాలకృష్ణుని వర్ణించిన పద్యమిది ——

తనువున నంటిన ధరణీపరాగంబు
　　పూసిన నెఱిభూతి పూఁతగాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు
　　తొగల సంగడికాని తునుకగాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు
　　కాముని గెల్చిన కన్నుగాఁగఁ
గంఠమాలికలోని ఘననీల రత్నంబు
　　గమనీయమగు మెడకప్పుగాఁగ
హారవల్లు లురగహారవల్లులుగాఁగ
బాలలీలఁ బ్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు

—297 ప., 10 స్కం., పూ.భా.

ఇందు శివకేశవాభేదము ఇదమిత్థముగ కలదు. కావ్యముఖము నందు త్రిమూర్త్యభేదము తిలకాయమానము. కావ్యమధ్యము నందు హరిహరాభేదము మకుటాయమానము. కనుక పోతన హృదయము ఏకదైవభావమే.

ఇక సంస్కృత భాగవతమునకు అనేక వ్యాఖ్యానములు కలవు. అందు శ్రీధరీయ వ్యాఖ్య అద్వైతపరము. వీరరాఘవీయ వ్యాఖ్య, వేంకటకృష్ణాచార్య వ్యాఖ్య విశిష్టాద్వైత పరము. విజయధ్వజీయ వ్యాఖ్య ద్వైతపరము. మత త్రయ పరమైన వ్యాఖ్యలను పోతన అనుసరించిన సందర్భములు కలవు.

ఎనిమిదవశతాబ్ది నుండి ఏకచ్ఛత్రాదిపత్యము చేసినది అద్వైతము. పదకొండవ శతాబ్ది నుండి ప్రభుత్వము వహించినది విశిష్టాద్వైతము. పంద్రెడవశతాబ్ది నుండి పరిపాలనము సాగించినది ద్వైతము. అద్వైతమునకు విశిష్టాద్వైతమునకు చుక్కెదురు. అద్వైత విశిష్టాద్వైతములకు ద్వైతమునకు షష్ఠాష్టకము. ఎవరి సిద్ధాంతము వారిది. ఏకవాక్యతలేదు. అంతేకాదు. పరస్పరసహనమును లేదు. అట్టి ద్వైతాద్వైత విశిష్టాద్వైతపరములైన వ్యాఖ్యలను అనుసరించినను, ఆయా సిద్ధాంత రాద్ధాంతముల కంటె, అచ్ఛమైన భక్తియే పోతన ఆదర్శప్రబోధము.

యదఙ్ఘ్ర్యనుధ్యాన సమాధి ధౌతయా
ధియానుపశ్యన్తి హితత్త్వమాత్మనః
వదన్తి చైతత్త్వవయో యథారుచం
సమే ముకున్దో భగవాన్ ప్రసీదతామ్

— 21శ్లో., 4 అ., 2 స్కం.

ఇది శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భక్తిమార్గమే ముఖ్యమని తెలుపు ఘట్టములోని శ్లోకము. 'పండితులు ఎవరి పాదధ్యానసమాధిచేత పరిశుభ్ర మనస్కులై, ఆత్మతత్త్వ మును అరయుదురో, చక్కగ చెప్పెదరో, ఆ భగవంతుడు ముకుందుడు నాకు ప్రసన్నుడగుగాక' అని అర్థము. ఇది పోతన తెనుగు సేతను ఇట్లుకలదు—

అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యే విభుపాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వ వీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁబరమున్ సర్వాత్ము సేవించెదన్

— 66 ప., 2 స్కం.

ఇందు పండితులు అణువా? మహామహావిభవుడా? ఛిన్నుడా? అచ్ఛిన్నుడా? గుణియా? నిర్గుణియా?— అని తర్కించుచు తత్త్వాన్వేషణము కుంటుపడినవారయి, తర్వాత భక్తిమార్గమున తత్త్వదర్శనము కాంతురని కలదు. ఇట్లు సంస్కృత భాగవతము నందు లేదు. కనుక పోతన అమూలకవాణి, అధ్యాపకవాణి.

జీవేశ్వరులకు భేదము తెలుపునది ద్వైతము. అభేదము తెలుపునది అద్వైతము. అభేదభేదము తెలుపునది విశిష్టాద్వైతము. జీవుడు అణువని, ఈశ్వరుడు విభువని ద్వైత విశిష్టాద్వైతములందు కలదు. జీవేశ్వరులకు అభేదమైనచో, ఈశ్వరుడు అణువా ? విభువా ? అను సంశయమునకు అవకాశము కలుగును. జీవేశ్వరులకు అభేదము కలదను అద్వైతము నందు ఈశ్వరుడు అచ్ఛిన్నుడు. భేదము కలదను ద్వైతము నందు, అభేదభేదము కలదను విశిష్టాద్వైతమునందు ఈశ్వరుడు ఛిన్నుడు. కనుక ఈశ్వరుడు ఛిన్నుడా ? అచ్ఛిన్నుడా ? అను సందేహమునకు అవకాశము కలుగును. ఈశ్వరుడు ద్వైతవిశిష్టాద్వైతము లందు గుణి. అద్వైతము నందు నిర్గుణి. కనుక ఈశ్వరుడు గుణియా ? నిర్గుణియా ? అను విచికిత్సకు అవకాశము కలుగును. ఏవంవిధమైన సిద్ధాంతచర్చల వలన తత్త్వాన్వేషణము కుంఠీభూతమగునని పోతన స్పష్ట ప్రతిపాదనము. అంతేకాదు. భగవంతుని యెడల భక్తి పారవశ్యము వలన మాత్రమే తత్త్వదర్శనము కలుగునని కూడ పోతన ఇష్ట ప్రతిపాదనము. ఉపరి,

పోతన భాగవతము నందు పుష్కలముగ, రసపుష్కరముగ ఉన్నది తత్త్వదర్శన తత్పరమైన భక్తిపారవశ్యమే. ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములను మాత్రమేగాక, బౌద్ధజైన సాంఖ్యయోగ మార్గములను కూడ ఉపబృంహితము చేసిన భక్తితత్త్వము భాగవతతత్త్వము. అది స్వశ్రేయము కాదు. సర్వశ్రేయము. జగద్ధితము.

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చిపురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్

ఇది ముద్రిత గ్రంథము అందు మాత్రమే కాదు, తాళపత్ర గ్రంథము లందును కలదు.[24] కాని, ప్రకరణోచితముగ లేదు. పద్య మిది ప్రథమ పురుష యందు కలదు. ప్రకరణమెల్ల ఉత్తమపురుష యందు కలదు. అంతేకాదు. ఈ పద్యమునందు పోతన, భాగవతమును రచించినట్లు కలదు. తదుపరి పద్య గద్యములందు రచించునట్లు కలదు. కనుక ప్రక్షిప్తము కావలయును. భోగినీదండ కము చివఱ, 'పండితకీర్తనీయుఁడగు బమ్మెరపోతన....భోగినీ దండకమున్ రచించె' అని రచించినట్లు, భాగవతము చివఱ '... హరి కిచ్చి చెప్పె నీ బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్' అని పోతనయే రచించుట సంభవము. పద్యము పోతన పద్యమువలెనే కలదు. 'ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి' అను పోతన పద్యమునకు 'ఎమ్మెలు సెప్పనేల జగమెన్నఁగ' అను ఏర్చూరి సింగన పద్యమునకు హస్తిమశకాంతరము కలదు. అంతేకాదు

ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్వింబురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెద పునర్జన్మంబు లేకుండఁగన్

— 21 ప., 1 స్కం.

ఇది పోతన కంఠోక్తి. ఇందు భాగవతము తానే రచించి తరింతునని పోతన ఇదమిత్థముగ తెలిపిన సంగతి కలదు. ఇతరుల చేతను రచింపఁజేసి, తరింపఁ జేయుదునని లేదు. అనగా భాగవతములోని పండ్రెండు స్కంధములును బమ్మెర పోతనయే రచించెనని అవగాహన మగును. పోతన భాగవతము నందు పోయిన స్కంధములను పోతన తర్వాత ఇతరులు రచించుట సంగతము. పోతన ప్రియశిష్యుడు వెలిగందల నారయ, హరిభట్టు రచించిన ఏకాదశ, ద్వాదశ స్కంధములందు ఇంచుమించు సమాన పద్యములు కలవు[25] అవి పోతన

కృతములే అగును. అలతి భేదములు వెలిగందల నారయ, హరిభట్టు పూరించి నవి అగును. కనుక పోతన పండ్రెండు స్కంధములను రచించుట తథ్యము. పంచమ, షష్ఠ స్కంధములు పూర్తిగను; ఏకాదశ, ద్వాదశస్కంధములు చాలవఱకు శిథిలము లయినవి. చాలవఱకు శిథిలమైన పోతన ద్వాదశ స్కంధము చివఱ మిగిలిన 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' అను పద్యమును, పోతన ప్రియశిష్యుడైన వెలిగందల నారయ తన ద్వాదశస్కంధ కర్తృత్వమునకు బాధకము కాకుండ, అనుకూలమైన అన్యస్థలము నిరవకాశము కావున, ప్రతి కూలమైన పోతన అవతారిక యందు భద్రము చేయుట సంభవము. కనుక 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' అను పద్యము పోతన అవతారిక యందు ప్రక్షిప్తమైనను, పోతన భాగవతము నందు నిక్షిప్తము కావలయును. అయిన, 'ఇమ్మనుజేశ్వరాధములు' ఎవరు ?

'ఇమ్మనుజేశ్వరాధములు' అనగా ఈ మనుజేశ్వరాధములు. ఏ మనుజేశ్వరాధములు ? 'ఈ' అను నిర్దేశవాచక సర్వనామము నిరర్థకము కాదు. పోతన భాగవతము రచనాకాలము నందలి మనుజేశ్వరాధములని అర్థము, మనుజేశ్వరులెల్ల అధములని పోతన అంతర్యము కాదు.

యస్య రాష్ట్రే ప్రజాః సర్వా!స్త్రస్యన్తే సాధ్వ సాధుభిః
తస్య మత్తస్య నశ్యన్తి కీర్తిరాయుర్భగోగతిః
ఏషరాజ్ఞాం పరో ధర్మో హ్యార్తానా మార్తినిగ్రహః
అత ఏనం వధిష్యామి భూతద్రుహసత్తమమ్

— 10, 11 శ్లో॥లు, 17 అ., 1 స్కం.

అను సంస్కృత భాగవత శ్లోకములకు పోతన ఆంధ్రీకరణమిది —

సాధువులగు జంతువులకు
బాధగావించు ఖలుల భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ
దుష్టజననిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబుఁజేయఁగ నృపులన్
స్రష్ట విధించెఁ బురాణ
ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ

—423, 424 ప॥లు, 1 స్కం.

ఇది యథామూలకము కాదు. స్వతంత్రకల్పనము. ఇందు రాజులకు శిష్టరక్షణము, దుష్టశిక్షణము పరమ విధ్యుక్తధర్మ మని ; సాధువులగు

జంతువులకు బాధలు కలిగించు ఖలులను భంజింపని రాజులు రాజాధములని పోతన స్పష్టప్రతిపాదనము కలదు. జంతువులన పశువులని మాత్రమే అర్థము కాదు. మానవులని కూడ అర్థమే. జన్మించు ప్రాణులు జంతువులని వ్యుత్పత్త్యరము. కనుక సాధువులగు పశువులకు, మానవులకు బాధలు కలిగించు ఖలులను భంజింపని రాజులు రాజాధములు. రాజాధములే మనుజేశ్వరాధములు. వారెవరు ?

కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభరాజమర్దనుని గాదిలికోడల యో మదంబ యో
హాటక గర్భు రాణి నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ (త్రిశుద్ధిగ నమ్మ భారతీ

ఇది పోతన చాటు పద్యము. ఇందు 'సరస్వతిని అనగా భాగవతమును కొనిపోయి, అల్ల – కర్ణాటకిరీటకీచకులకు మనోవాక్కాయ కర్మల విక్రయింపను' అని కలదు. కర్ణాటకిరీటకీచకులు ఎవరు ? 'కొనిపోయి, అల్ల' అను మాటలను బట్టి స్థానికులు కారని అవగాహన మగును. కర్ణాటకిరాటపాలకులు కావలయును. అంతేకాదు. వారు కీచకులవంటి వారును కావలయును.

కీచకులు మహాభారతము నందు కలరు. కీచకాగ్రజుడైన సింహబలుడు కాముకుడు, మద్యపానమత్తుడు. కీచకావరజులైన ఉపకీచకులు చచ్చిన కీచకుని శవమునకు, బ్రతికియున్న ద్రౌపదిని కట్టివేసి అంత్యక్రియలకు బయలుదేరిన కర్కశహృదయులు. కనుక, కాముకులు మద్యపానమత్తులు కర్కశ హృదయులు అయినవారు కీచకులు అగుదురు.

కర్ణాటపాలకులు విజయనగర రాజులు. కిరాట పాలకులు బహమనీ సుల్తానులు, 'ద్వేతు కిరాటస్యాన్లేచ్ఛే వణిజిబాపి' అని నానార్థవ నిఘంటువు.[26] బహమనీసుల్తానులు మ్లేచ్ఛశబ్దవాచ్యులు. పోతన భాగవత రచనాకాలము నందు (1476–80) విజయనగర రాజు విరూపాక్షరాయలు.[27] (1465–78). అతడు కాముకుడు. మద్యపానమత్తుడు. అతని కొడుకు నాల్గవ ప్రౌఢదేవ రాయలు[28] (1478–85). అతడు తండ్రిని మించిన తనయుడు. కాముకుడు, మద్యపానమత్తుడు మాత్రమే గాక, రాజ్యాధికార మొసగిన అన్నగారిని చంపించిన కర్కశహృదయుడు. కనుక విరూపాక్షరాయలైనను, నాల్గవ ప్రౌఢదేవరాయలైనను కర్ణాట కీచకుడు కాఁగలడు. మఱి బహమనీసుల్తాను మూడవ (షమ్సుద్దీన్) మహ్మద్‌షా[29] (1463–82). అతడు బహమనీ రాజ్యము యొక్క బహుముఖాభివృద్ధికి కారకుడైన మంత్రి, మహావీరుడు మాత్రమే గాక, కవి, పండితుడు, సాధువు అయిన మహ్మద్‌గవాన్‌ను చంపించిన కర్కశహృదయుడు.

(2)

మద్యపానమత్తుడును. కనుక మూడవ (షమ్సుద్దీన్) మహ్మద్‌షా కిరాటకీచకుడు కాఁగలడు. ఆ 'కర్ణాట కిరాటకీచకు'లే 'ఇమ్మనుజేశ్వరాధములు.'

కాముకులు, మద్యపానమత్తులు, కర్కశహృదయులు అయిన కర్ణాట కిరాటపాలకులకు భాగవతమును అంకిత మిచ్చుట సరస్వతిని అమ్ముకొనుటయే అని పోతన ఆంతర్యము. ఇంత పవిత్రహృదయుడైన పోతన, ఎంత పరమ భాగవతోత్తముడైనను, అతడు రచించిన పండ్రెండు స్కంధముల భాగవతము శిథిలమైనది. అందుకు హేతువు దేవతార్చన పేటికలోని క్రిమికీటకాదికము కాదు. సర్వజ్ఞసింగభూపాలుని భూస్థాపనమును కాదు. సర్వజ్ఞసింగమనాయకుని రాచకొండ రాజ్యము, ఓరుగల్లు రాజ్యమును 1450 వ సంవత్సరము ప్రాంతము నందే పరాధీనమైనది.[30] సర్వజ్ఞసింగభూపాలుని శాసనము 1453 వ సంవత్సరము నందు బెల్లము కొండ యందు కలదు.[31] 1475 వ సంవత్సరము నందు తిరుపతి యందు కలదు.[32] తిరుపతి తీర్థయాత్రాస్థలము. బెల్లము కొండ దండయాత్రాస్థలము, బెల్లముకొండ దుర్గము 1453–54 వ సంవత్సరము నందే కపిలేంద్రగజపతి అధీనమైనది.[33] కపిలేంద్రగజపతి రాజ్యధుర్యుడైన పూసపాటి మూడవ తమ్మిరాజు 'త్రిభువనీరాయ బిరుదప్రదీప్తు రావు సింగన జయించెఁ బెదవీటి చెంత' అని పూసపాటి ఆరవ తమ్మిరాజు కృష్ణవిజయము నందు కలదు (117 ప., 1ఆ.). 'త్రిభువనీరాయ బిరుదప్రదీప్తుఁడైన రావు సింగని సంగరరంగ మందు దునిమెఁ బెదవీటి చెంత' అని పూసపాటి వేంకటపతిరాజు ఉషాభ్యుదయము నందు కలదు.[34] కనుక పూసపాటి మూడవ తమ్మిరాజు సర్వజ్ఞ సింగభూపాలుని సంహరించిన కాలము 1476వ సంవత్సరము కాఁగలదు. 1476వ సంవత్సరము నందు వీరస్వర్గమును అలంకరించిన సర్వజ్ఞసింగ భూపాలుడు 1480వ సంవత్సరము తర్వాత పోతన భాగవతమును భూస్థాపితము చేయుట అభూతకల్పన. 1486వ సంవత్సరము నందు ఏకశిలానగరము మరల రణరంగ మైనది.[35] రాజమండ్రి నుండి కొవమ్–ఉవ్–ముల్క్ దండెత్తి వచ్చి ఓరుగల్లును ముట్టడించి స్వాధీనము చేసికొనెను. వెంటనే బీదర్ నుండి బహమనీసుల్తాను నాల్గవ మహ్మద్‌షా (1482–1518), అతని ప్రధాని నిజామ్-ఉల్–ముల్క్ ముట్టడిదారును మట్టుపెట్టుటకు ఓరుగల్లుమీద దండయాత్ర సాగించిరి. కొవమ్–ఉల్–ముల్క్ పాఱిపోయెను. అది ఒక అంతర్యుద్ధమైనను యుద్ధమే. ఆ యుద్ధరాక్షసి కరాళదంష్ట్రలకు పోతన భాగవతము శిథిలము కావచ్చును.

పోతన భాగవతము ఒక్క తాళపత్రగ్రంథముకాదు. కొన్ని తాళపత్ర గ్రంథములు. ఒకటి 528 + 289 = 817 పద్య గద్యములు కల ప్రథమ ద్వితీయ స్కంధములు ; రెండు 1055 పద్య గద్యములు కల తృతీయ స్కం

ధము ; మూడు 976 పద్య గద్యములు కల చతుర్థ స్కంధము ; నాల్గు 800 + 500 = 1300 పద్య గద్యములు ఉండు పంచమ, షష్ఠ స్కంధములు ; అయిదు 482 + 749 = 1231 పద్య గద్యములు కల సప్తమాష్టమ స్కంధములు ; ఆరు 786 పద్య గద్యములు కల నవమ స్కంధము ; ఏడు 1790 పద్య గద్యములు కల దశమ స్కంధము పూర్వభాగము ; ఎనిమిది 1342 పద్య గద్యములు కల దశమ స్కంధము ఉత్తరభాగము ; తొమ్మిది 700 + 300 = 1000 పద్య గద్యములు ఉండు ఏకాదశ ద్వాదశ స్కందములు మొత్తము తొమ్మిది తాళపత్ర గ్రంథములు కావచ్చును. అందు పంచమ, షష్ఠస్కంధ ములు కల నాల్గవ తాళపత్ర గ్రంథము పూర్తిగను ; ఏకాదశ, ద్వాదశ స్కంధములు కల తొమ్మిదవ తాళపత్ర గ్రంథము చాలవరకును శిథిలము కావచ్చును. మిగిలిన తాళపత్ర గ్రంథములు శిథిలము కాకపోవచ్చును. పంచమ స్కంధ మును బొప్పరాజు గంగన; షష్ఠస్కంధమును ఏర్చూరి సింగన ; ఏకాదశ ద్వాదశ స్కంధములను వెలిగందల నారయ మఊల రచింపవచ్చును.

ఇట్లు ఆంధ్రభాగవతావతరణమునకు ఆద్యంతము లందును ఆనాటి చరిత్ర ఆధారభూమి.

**సూచికలు :**

1. ఆంధ్రకవుల చరిత్ర, ప్రథమ భాగము, ద్వితీయ ముద్రణము, పు. 558
2. ఆంధ్రకవితరంగిణి, ఆరవ సంపుటము, పు. 190
3. History of Reddi Kingdoms, p. 193
4. ఒకటి వలె
5. లక్ష్మణరాయ వ్యాసావళి, పు॥లు 70–121
6. ఒకటి వలె, పు. 402
7. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పు॥లు 281, 284
8. అదే, పు. 295
9. The Bahmanis of the Deccan, pp. 201–2
10. Ibid, pp. 219–20, N. 47
11. Velugoti Vari Vamsavali, Introduction, pp. 43–4
12. As 9, p. 209
13. As 11, p. 44
14. The Suryavamsi Gajapatis of Orissa, p. 54

15. Mediaeval History of the Deccan, pp. 63–5 & 99–109

16. ఏడు వలె, పు. 365

17. As 15, p. 113

18. Ibid

19. Idid

20. Ibid

21. Ibid. pp. 3–114

22. Ibid, p. 114, F.N. 2

23. A Forgotten chapter of Andhra History, Appendix I, pp. 100–10

24. శ్రీ మహాభాగవతము, అకాడమీ ప్రచురణ, మొదటి సంపుటము, పు. 3

25. శ్రీ మదాంధ్ర భాగవతము, వావిళ్ల ప్రచురణ, ఆంధ్రభాగవత విమర్శము, పు. 73

26. సూర్యరాయాంధ్రనిఘంటువు

27. ఏడు వలె, పు. 383

28. అదే

29. As 15, pp. 176–82

30. As 11, p. 44

31. Ibid, F.N. 75 a

32. ఏడు వలె, పు. 304

33. As 14, pp. 43–3

34. Further Sources of Vijayanagara Empire, Vol. II, p. 67

35. As 15, p.67.

# పోతన్న ఆత్మీయత

డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి

**భాగవత అవతరణ :**

వ్యాసుల వారు భాగవతాన్ని రచించారు. ఇది సంప్రదాయవాదుల నమ్మిక. వ్యాసుల వారు భాగవతాన్ని రచించారా లేదా అన్నది వేరే ప్రశ్న. భాగవత ప్రతిపాదిత విషయంమీద విశ్వాసం గలవారిని ఈ పశ్న ఎక్కువగా బాధించదు. బోపదేవుణ్ణో, అతను కాకపోతే అతనికంటె మరొక పూర్వుణ్ణో శ్రీమద్భాగవతకర్త అని పరిశోధకులు నిర్ణయించినా, ఆ రచయిత వ్యాసుని అవతారం అని, విశ్వాసం గలవారు సమన్వయించు కొంటారు; సమర్థించు కొంటారు; సంతృప్తి పొందుతారు. వేదాలను విశ్లేషించినా, బ్రహ్మసూత్రాలు ఘటించినా, పంచమ వేదం అయిన భారతం రచించినా, వారి మనస్సుకు సమాధానం దొరకలేదట. ఒక విషయాన్ని మేధాగతంగా తెలుసుకోవడం వేరు ; దానితో సమరసస్థితిని పొందడం వేరు (intellectual understanding is different from emotional satisfaction)· చింతాగ్రస్తులైన వ్యాసుల వారిని నారదుల వారు కలుసుకొని, భగవంతుని లీలలు వర్ణిస్తే మనస్సుకు సమాధానం దొరుకుతుంది, ఆపని చెయ్యి అని సెలవిస్తారు. అప్పుడు భాగవత రచనకు అంకురార్పణ జరిగింది (ఇది భాగవతస్థమైన విషయం; ఇది సంప్రదాయం. ఇక్కడ మరొక్క విషయం కూడా ముఖ్యం; పోతన్న భాగవతాన్ని గురించి ఏమనుకొని ఉంటాడు అనేది అసలు అంశం).

పరీక్షిత్తు స్వతహాగా మంచివాడు. కాని పొరపాటువల్ల రాజసం పొంగింది ; అది తమస్సుగా మారింది. అపచారం కావించాడు. ఫలితంగా శాపోపహతుడయ్యాడు. మృత్యుగహ్వరంలో ప్రవేశించబోతూ, సంస్కారం పెల్లుబికి మోక్షార్థియై, భగవదున్ముఖమైన మనస్సు గలిగినవాడై, పవిత్రమైన గంగ మడువున నిలిచి ఉన్నాడు.

అట్టి స్థితిలో శ్రీమద్భాగవతం వినిపించినవాడు శుకబ్రహ్మ; అతడు పరమ నిర్లిప్తుడైన మహాభక్తుడు; అవధూత.

ఈ భాగవత మాలతీలత నారద, వ్యాస, శుక, పరీక్షిత్తులు ఆలంబనంగా ప్రాకి భక్తిపూలను విరియించింది; ముక్తి సౌరభాన్ని విరజిమ్మింది.

భాగవతంలో శ్రీమన్మహావిష్ణువు యొక్క పది అవతారాలు మాత్రమే గాక, వీటంతటి ప్రాధాన్యంలేని యితర అవతారాలూ వర్ణితమయ్యాయి. అయితే శ్రీకృష్ణావతారం అధికంగా వర్ణితం అయింది.

కృష్ణావతారం గురించి కొందరికి కొన్ని శంకలు ఉన్నాయి. కనుక అటువంటి వారి దృష్టిలో భాగవతం అసద్గ్రంథం.

అయితే భాగవతం దిగి వచ్చింది (అవతరణ) ఎటువంటి స్థితిలోనో గుర్తుకు తెచ్చుకొంటే చిక్కు విడుతుంది.

సమస్తలోకహితైకదృక్కు, పరమ భాగవతోత్తముడు, భక్తిసూత్ర నిర్మాత, దేవర్షిశ్రేష్ఠుడూ అయిన నారదుని ప్రేరణ వల్ల వ్రాసిన గ్రంథం ఇది. వేదవిభాగ కర్త, బ్రహ్మసూత్ర నిర్మాత, మహాభారత రచయిత అయిన వ్యాసుని స్వాంతసుఖం కోసం దీని రచన జరిగింది. పరతత్త్వంతో సమరసస్థితిని పొందిన శ్రీ శుకుడు వక్త. భగవదున్ముఖమైన మనస్సు గలిగిన పరీక్షిత్తు శ్రోత. ఈ సమీకరణంలో ఈ సంపుటిలో, ఈ సన్నివేశంలో వెలువడిన గ్రంథం ఒక జారుని యొక్కగాని, ఒక చోరునియొక్క గాని కథను ప్రపంచించి వ్రాసిన గ్రంథం కాదు. అది పవిత్రభావ ప్రేరకమే అవుతుంది; అది అధ్యాత్మభావసుందరమే అవుతుంది. మన పెద్దలు ఈ రకంగానే నమ్ముతూ వచ్చారు.

కాని ఆ నలుగురు పెద్దలూ, వారితోబాటుగా నేటివరకూ మన పెద్దలందరూ పొరవడకూడదా అని వాదము లేవదీయవచ్చు. అయితే ఆధ్యాత్మిక విషయ నిష్ణాతులైన నారదమహర్షీ, వ్యాసభగవానుడూ, శుకయోగీ, పరీక్షిన్మహారాజూ కూడా పొరవడ్డం కంటె, ఇల్లాంటి విషయాల్లో మిక్కిలి ప్రాథమికులమైన మనమే పొరవడ్డామేమో అని పరిశీలించుకోవడం అవసరం. నిర్ధారణకు ముందు నిదానించడం జిజ్ఞాసువుల లక్షణం; సరియైన నిర్ణయం చేసుకోవడం వివేకుల లక్షణం.

పోతన్న తమ యొక్క, మన యొక్క పెద్దలతో ఏకీభవించి, భాగవతాన్ని తెలుగులోకి తేవాలని సంకల్పించాడు.

**పోతన్న ఆత్మీయత – ఐతిహ్యాలు* :**

పోతన్నను గురించి కొన్ని ఐతిహ్యాలు లోకంలో వ్యాపించి ఉన్నాయి. అతడు పరమ సాత్త్వికుడు; అతను సిరిసంపదల్నీ, రాజులనూ రోసి, రైతుగానే కాలం గడిపినవాడు; ఇట్లా —

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమల కందమూల గౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై
ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక, సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపో[illegible]రా జాకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్

ఈ పద్యాల్లో మొదటిది పోతన్న పద్యం కాదని పరిశోధకులు కొందరు అంటున్నారు. రెండవదీ పోతన్న పద్యం కాదని అనుకొంటున్నారు, అయినా, పోతన్న మనస్సునుబట్టియిచ్చే పద్యాలుగా వీటిని భావించుకోవచ్చును.

పోతన్న మనస్తత్త్వం ఇదీ అనేది ఈ ఐతిహ్యాలను బట్టే తెలుస్తుంది. పోతన్న తత్త్వం ఇది కాదు. మరేదో ఉంది అనడానికి తగిన ఆధారం లేనప్పుడు, అతని మనస్సును ప్రతిబింబించే కథలలోని పరమార్థాన్ని, కథలను యథాతథంగా నమ్మడం కాదు - విశ్వసించకపోవడానికి తగిన కారణం కనబడదు· పైగా భాగవత రచనకు అనుగుణమైన పారమార్థికదృష్టి అది. అట్టి దృష్టి ఉన్నప్పుడే స్వాంతానికి సుఖం ఏర్పడుతుంది (something like job satisfaction). అయితే పోతన్న చేసిన కృషినిబట్టి అతని మనస్తత్వం ఇదనీ, అతని మనస్తత్త్వాన్నిబట్టి ఇల్లాంటి భాగవతం రచించడానికి అతను పూనుకొన్నాడనీ అనడంవల్ల, పరస్పరాశ్రయ దోషం ఏర్పడదా అని వాదించవచ్చు. పోతన్న మనస్తత్త్వం సాత్త్వికం. భక్తియుక్తం కాదని నిర్ణయించడానికి ఆధారాలు లేనప్పుడు. భాగవత రచననుబటి ఐతిహ్యాలనుబట్టి అది స్వాత్త్వికం, భక్తియుక్తం అని నమ్మడంవల్ల పాఠకుని మనస్సుకు ఒక దీప్తి, ఒక తృప్తి ఏర్పాడుతాయి గనుక, పరస్పరాశ్రయ దోషం ఏర్పడుతోంది అనుకొనేదాని కంటే, రచనా మనస్తత్త్వాలు పరస్పర ప్రేరకాలూ, పరస్పర పూరకాలూ

*ఈ వ్యాసంలో పోతన్న ఆత్మీయతకు సంబంధించిన కొన్ని అంశాలు గురించి మాత్రమే చర్చ జరిగింది. ఇదీ అతని ఆత్మీయత అనేదానికంటె, ఆత్మీయతకు కారణాలు చూపడానికి మాత్రమే ఎక్కువ ప్రయత్నం జరిగింది.

అవుతున్నాయని భావించడం సమంజసం, అట్టి స్థితి పాఠకునికి మేలు కలుగు జేస్తుంది. పోతన్నను మనం ఉద్ధరించనక్కరలేదు.

**నాటి పరిస్థితులు :**

పోతన్న భాగవత రచనను ఎందుకు చేపట్టాడు ? అనాటి మత సాంఘిక రాజకీయ పరిస్థితులు అతణ్ణి ప్రోత్సహించి ఉండవచ్చు. విలసతామ్రశాసనం అనాటి ధర్మగ్లానిని వివరంగానే వర్ణించింది.

ఇట్టి పరిస్థితుల్లో ప్రజలను ఆదుకోవలసింది రాజు. 'దుర్బలస్య బలం రాజా' కాని ముసునూరి నాయకుల వంటి ఏ కొద్దిమందినో మినహాయిస్తే పోతన్నకు కనపడింది 'మనుజేశ్వరాధముడు' అనే బిరుదుకు తగినవారే (ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి — ఈ పద్యం పోతన్నది కాకపోవడానికి కూడా అవకాశం కలదని సూచనగా మనవి చెయ్యడం జరిగింది). శ్రీరామచంద్రుడి వంటి రాజు కావాలి. తన విలాసాల్లో మునిగితేలేవాడు గాక, ఎట్టి పరిస్థితుల్లో నూ ప్రజలకు బాసటగా నిలబడే నాథుడు కావాలి. ఇక్కడ గజేంద్ర మోక్షంలోని అమూలకమైన పద్యత్రయాన్ని అనుసంధించుకొంటే, పోతన్న ఆశయం అవగత మవుతుంది.

అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యనఁగుయ్యాలించి సంరంభియై
సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు ; వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై
తనవెంటం సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుః కౌమోదకీ శంఖచ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

అన్న పద్యాల్లో రాజు తానెన్ని వ్యక్తిగతమైన సరదాల్లోనూ, సరసాల్లోనూ మునిగితేలుతూ ఉన్న వాటన్నింటినీ కాదని హుటాహుటిని ఆర్త రక్షణార్థం బయలు దేరాలి అనీ, పురుషోత్తముడు సిద్ధంగా ఉంటే సాధన సంపత్తి దానంతటదే సమకూరుతుందనీ సూచనలు ఈ పద్యాల్లో భాసిస్తాయి (create a Man with capital M and money and munitions follow him automatically),

నాడు నేడు కూడా మానవుణ్ణి విస్మరించి, మిగిలిన సాధన సంపత్తిని గురించి ప్రాకు లాడ్డం పరిపాటి అయింది. అయితే అది ఈనాడు పరాకాష్ఠకు చెందింది.

సంభవామి యుగే యుగే :

ఇల్లాంటి పరిస్థితుల్లో (రాజులు ప్రజారక్షణకార్యాన్ని విస్మరించిన సమయం లో) పోతన్నకు భగవద్గీతాశ్లోకాలు తప్పక గుర్తువస్తాయి.

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతిభారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే !

భగవద్భక్తుడైన పోతన్నకు, గీతాచార్యుడి మాటంటే విశ్వాసం కదా ! కనుక భక్తత్రాణపరాయణు డైన శ్రీమన్నారాయణుని కథలు గల శ్రీమద్భాగ వతాన్ని అనువాదం చేద్దామని తలంపు రావడం అత్యంత సహజం. దిక్కులేని వారికి దేవుడే దిక్కు (యావద్భారత దేశంలోనూ భక్తి ఉద్యమం ఈ పరిస్థితుల్లోనే ప్రారంభం అయింది). మహోత్పాతాలు సంభవించినప్పుడు జ్ఞానం కంటే భక్తే ఎక్కువగా మానవుల్ని ఆకట్టుకొంటుంది. జ్ఞానం మేధాజన్యం ; భక్తి హృదయ స్పర్శి. సహజపాండిత్యుడైన పోతన్నను భక్తే ఆకర్షించింది. అతను నారాయణ కథా ప్రపంచకథ కుతూహలుడయ్యాడు.

ఏకం సద్విప్రా బహుధా వదన్తి :

లీలా శుకులు, తిక్కన్న ఎఱ్ఱన్నల మాదిరిగానే పోతన్న కూడా శివభక్తుడే (మహేశ్వర ధ్యానంబు సేయుచు, మొదలైనవి దీనికి జ్ఞాపకాలు). వారందరూ ఎల్లా విష్ణుకథాగానం కావించారో అల్లాగే తానూ విష్ణుకథాగానం కావించాడు. ఇక్కడ మరొక్క విషయం అనుసంధించుకోవాలి. చంద్రగ్రహణ సందర్భంలో మహేశ్వరుణ్ణి ధ్యానిస్తూ ఉండగా శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమయ్యాడు. ఎందుకు ఇల్లా అయి ఉంటుంది ; అతని జపం విశేషించి ఈశ్వరుణ్ణి గురించి అయినా కొలది నాళ్ళుగా మనస్సులో మొదలుతూ ఉండేది విష్ణువే : అతని కథలే.

ఈ సన్నివేశంలో పోతన్నను గురించిన రెండు అంశాలు సుస్పష్టమయ్యాయి. తన మనస్సులో శివకేశవు లిరువురూ వేర్వేరు కాదు ; వారి వారి స్వరూపాల్లోనూ విహిత కృత్యాల్లోనూ తేడాలే గాని స్వభావాల్లో తేడా లేదు.

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివశ్చ హృదయం విష్ణుః విష్ణోశ్చహృదయం శివః

యథా శివమయో విష్ణుః ఏవం విష్ణుమయశ్శివః
యథాంతరం నపశ్యామి తథామే స్వస్తిరాయుషి

అన్న శ్లోకాలను నిత్యం చిత్తశుద్ధితో పఠిస్తున్నవాడు గనుక పోతన్నకు శ్రీరామ చంద్రుడు ప్రత్యక్షం కావడం వల్ల, అతని మనస్సులో మెదలిన శివకేశవాభేదం రూపుకట్టుకొని ఋజువు పడింది అనుకోవాలి. ఇది మొదటి అంశం.

రెండవ అంశం: కృతిభర్త శ్రీరామచంద్రుడు. అయినా కృత్యాది సమస్క్రియ గాని, షష్ఠ్యంతాలు గాని శ్రీ కృష్ణపరంగా ఉన్నాయి. ఈ రెండూ కూడా కృతిభర్త పరంగా ఉండడం పరిపాటి. శ్రీరామ శ్రీకృష్ణుల్లో ఎవరు గొప్పవారు అని ఈనాటికీ వాదం వేసుకొనేవారు ఉన్నారు. యుగధర్మాన్ని బట్టీ, తాను నిర్వహించవలసిన కార్యస్వరూపాన్నిబట్టీ (తాను జయించవలసిన రాక్షసుని తీరుతెన్నులనుబట్టీ) ఒకే విష్ణుతత్వం వివిధరూపాలను తాలుస్తుంది. అది అవతార లక్షణం; ఒకే విష్ణుతత్త్వం అనుగుణమైన మార్పులను పొంది ధర్మసంస్థాపన చేస్తుంది. ఈ పరమార్థాన్ని ఆకళించుకొన్న పోతన్న శివకేశవు లకు భేదం లేదని, రామావతార కృష్ణావతారాల పరమార్థం ఒక్కటే అనీ కవితామార్గంలో వెలిపుచ్చారు. ఇట్టి సమన్వయ ధోరణి భారతీయ సంస్కృతిలో అంతర్భాగం. పోతన్న కాలంతో అది మిక్కిలి అవసరం కూడా.

**సాక్షీభూతుఁడు :**

ఒకానొక అంతఃప్రేరణవల్ల భాగవత రచన జరిగిందేగాని ఇతరుల ప్రోత్సాహం వల్లగాని ప్రమేయంవల్లగాని కాదని పోతన్న వాక్కు. ఆత్మప్రబోధాన్ని ఆత్మారామ ప్రబోధంగా భావించుకోవడం మన పెద్దల పద్ధతి. దాన్ని ఆచరణలో పెట్టగలిగిన మహాపురుషులో పోతన్న ఒకడు.

పలికెడిది భాగవత మఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నే
పలికిన భవహర మగునఁట
పలికెద వేరొకండు గాథ పలుకఁగనేలా ?

ఈ ముచ్చటైన పద్యం పోతన్న మానసిక స్థితిని పట్టియిస్తుంది. భాగవత మఁట రామభద్రుండఁట, భవహర మగు నఁట -- అన్నవాటిల్లో అఁట శబ్దం సాక్షీభూతత్వానికి సంకేతం. కలలో జరిగిన సన్నివేశాల్ని ఏకరువు పెట్టేటప్పుడు — నేను వెళ్లుతున్నానట, అప్పుడొక ఏనుగు ఎదురైందట – ఇల్లా చెప్పడం పరిపాటి. ఒక దివ్యమైన దృశ్యాన్ని భావితాంతఃకరుణుడైన పోతన్న చూచినట్లు — ఇక్కడి అఁట శబ్దాల ఉనికి చెప్పుతోంది. ఆ స్థితి నుంచి వెలువడి తన సిరసంకల్పాన్ని లౌకిక కార్యాచరణాన్ని తెలియపర్చే వాక్యం చివరి పాదం.

పలికెడిది భాగవతము, అట పలికించు విభుండు రామభద్రుండు, అట నేపలికిన భవహర మగును, అట పలికెద, వేఱొండు గాథ పలుకఁగనేలా ? అని ఖండబిందు విరహితమైన అట శబ్దసహితమైన విరుపును పెద్దలొకరు సూచించారు. ఈ విరుపును గూడా, ఒక దివ్యావస్థను సూచించేదిగా భావించుకో వచ్చును. అయితే ఈ పద్యం పాల్కురికి సోమనాథుని ద్విపదలకు ప్రసిద్ధమైన అనుకరణ అని జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

బసవలింగము కృతిపతి యట్టె కృతియు
రసికతఁబండితారాధ్యచరిత్ర
మటె పాల్కురికి సోమనారాధ్యుఁడు కవి
యటె కథా శ్రోత సూరామాత్యుఁ డటె

అని సోమన్న పలుకులు.

**అణకువా, ఆత్మవిశ్వాసమూ :**

అయితే భాగవతం యొక్క సారం తెలుసుకోవడం దుస్సాధ్యమైనది. ఇది పెద్ద పెద్దలకీ కొరుకుడు పడదు.

భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు

ఇందులో పోతన్న రెండు విషయాలను ప్రస్తావించాడు: 1. తెలియడం, 2. పలకడం తెలియకుండానే బ్రహ్మ పదార్థాన్ని గురించి చిలుకపలుకులు పలికే పెద్దలు లేరా ? తెలిసికూడా పలుకలేనివా రెంతమంది లేరు. కనుక అవగాహన చేసుకొనే శక్తీ, దాన్ని విశదపర్చే శక్తి వేర్వేరు. లోకంలో చూస్తూ ఉంటాం, కొందరికివిషయం బోధపడవచ్చు. కాని వారు దాన్ని వివరించడానికి ప్రయత్నించేటప్పుడు, వారి కేది వ్యక్తం అయిందో అది మనకు అగమ్యగోచరంగా ఉంటుంది. అది మూగ కనిన కల, ఇది చెవిటివాని గోల. అది కడకు మూగ చెవిటి వారి ముచ్చటగును.

పోతన్న తనకున్న పరిమితులను మనవి చేసుకొన్నాడు. శూలీ, తమ్మిచూలీ కూడా ఈవిషయంలో పడే అవస్థ తెలియపర్చాడు. అట్టి పనికి తాను పూనుకొన్నాడు (పరమేశ్వరానుగ్రహం వల్ల తన సంకల్పం బలపడింది).

విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు

అని నమ్రతతో చెప్పుకొన్నాఁడు. పండితప్రకాండుల దయవల్లా, దేవతల అనుగ్రహం వల్లా (విబుధశబ్దం గమనార్హం), శ్రుతివల్లా, లోకకావ్యాద్యవేక్షణవల్లా (విన్నంత, కన్నంతలు గమనార్హం), తన మనస్సులో భాసిస్తున్నవి తాను ఎంతవరకు తెలుసుకొన్నాననుకొంటున్నాడో ఆమేరకు, ఆయా విషయాలను అవిషయ పరిజ్ఞానం అత్యల్పమే కావచ్చును – తేటపరుస్తాను, స్పష్టం చేస్తాను అని మనవి చేశాడు. ఈ విషయంలో పోతన్న ఆత్మవిశ్వాసం వ్యక్తం అవుతుంది. పులిమి పుచ్చను, సంగిరిబింగిరి మాటలు మాట్లాడను అని అహంకారంతో గాక, ఆత్మవిశ్వాసంతో పలికినాడు (అహంకారానికి, ఆత్మవిశ్వాసానికి మధ్య గల అంతరం చాలా తక్కువ. ఒక సన్నని పొర మధ్యలో ఉంటుంది. అదీ ఊహాజనితమే).

ఇంతేకాదు : ఈ ఆత్మవిశ్వాసధోరణి భాషాపరంగానూ వెలువడింది.

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు ; రెండుం
గొందఱకు గుణములగు ; నే
నందఱ మెప్పింతుఁగృతుల నయ్యై యెడలన్

అన్న పద్యంలో పోతన్నకు తన సామర్ధ్యం విషయంలో ఉన్న విశ్వాసమూ, అతని ప్రతిభా సుస్పష్టం అయ్యాయి. పోతన్న రచనలో అటు సంస్కృత పద ప్రయోగ ప్రౌఢిగాని, తేట తెలుగుల తేనెసోనలుగాని అలరిస్తాయి. అణకువ, ఆత్మ హైన్య భావనకు దారితీయకూడదు. ఆత్మవిశ్వాసం అహంకారానికి దారితీయకూడదు. అణకువా, ఆత్మవిశ్వాసమూ మధుర సమన్వయం పొందిన మూర్తిగా పోతన్న గోచరిస్తాడు (శ్రీనాథ యుగంలో శ్రీనాథునితోబాటు కావ్యభాషను గురించి వివికిత్స చేసినవారు పలువురు కనపడతారు—ఇతర యుగాలతో పోల్చి చూస్తే).

**మధుమయ ఫణితులు :**

ఆయా భావాలను వెలువరించే సమర్థమైన పదజాలం ఎంపిక చేసుకోవడంతో బాటుగా, అత్యంత రమణీయమైన పద్యరచనారీతుల్ని గూడా పోతన్న అలవరుచుకొన్నాడు. కేవలం శబ్దాలంకారాల్ని వాడాడు అని ఈసడించేవారు లేకపోలేదు. అనుప్రాసలు చాలామంది కవుల కంటె పోతన్న ఎక్కువ వాడాడు ; అది సత్యమే. కాని అతని రచన మొత్తంలో అనుప్రాసలు మిగిలిన శబ్దార్థాలంకారాల కంటె తక్కువ సంఖ్యలో ఉన్నాయి. అతనిది ధారాళమైన శైలి. ఇక అంత్యానుప్రాసల విషయానికి వస్తే భక్తి కవిత్వంలో అర్థాలంకారాలతోబాటుగా, శబ్దాలంకారాలు కూడా చోటుచేసుకొంటాయి. ఓం ఓం ఓం – విశ్వాయనమః

ఓం, విష్ణవే నమః ఓం, వషట్కారాయ నమః ఓం మొదలైనవి సహస్ర నామార్చనల్లో వినవస్తూ ఉంటాయి. వాటిల్లో అనుప్రాసల లక్షణమే ఉంది. షష్ఠ్యంతాల్లో గూడా ఈ పద్ధతే నెలకొని ఉంది. ఉబుసుపోకకు గాక, కావ్య రచనను ఒక ఆరాధనా విశేషం క్రింద భావించుకొన్న పెద్దల్లో పోతన్న ఒకడు ఈ శబ్దాలంకార ప్రచురమైన రచనావిధానం అభ్యాసపూర్వకంగా అలవడిందో, లేక సులువుగా చేపడిందో నిర్ణయించడం కష్టం. భక్తిపారవశ్యంలేని తావుల్లో గూడా శబ్దాలంకార ప్రాచుర్యం గలిగిన పద్యాలు నడిచాయి ; అయితే అవి లెక్కకు దక్కి మాత్రం లేవు. మొత్తంమీద ఈరకం పద్యాలు భాగవతం వంటి గ్రంథానికి బరువుచేటు అని తొందరపడి అనలేం. అసలు తెలుగునాట భాగవతానికి ఉన్న అనన్యసామాన్య ప్రచారానికి, భాగవతకథల్లోని భక్తితత్పరతకు పోతన్న రచనావిధానం కూడా తోడ్పడింది అని చెప్పవలసి ఉంటుంది.

శృంగారం :

భాగవతంలో శృంగారంపాలు ఎక్కువగా ఉంది అని తప్పుపట్టే పెద్దలు లేకపోలేదు. ఇంకొక మాట కూడా అంటారు. శ్రీనాథుడు మహాభక్తుడు ; ఈశ్వరార్చనకళాశీలుడు ; నైషధీయ చరితంలోని ఎన్నో అశ్లీలాలను తొలగించాడు ; లేదా, కొంతవరకు తగ్గించాడు ; అట్లాంటి వాడికి స్త్రీలోలుడు అనేవాదు వచ్చింది ; మూలంలో ఉన్నదానికంటె అతిశయించి శృంగారాన్ని వర్ణించిన పోతన పరమ భాగవతుడు అనే కీర్తి వచ్చేసింది అని బాధపడిపోయేవారూ కొందరు కనపడతారు.

ఇక్కడ ఒకటిరెండు విషయాలు గమనించవలసి ఉంటుంది. భక్తుడయినవాడు ఇతర స్త్రీ పరాఙ్ముఖుడు కావాలని కోరుకొంటాం. ప్రహ్లాదుని వంటి సజ్జనుడు అయితీరాలని వాంఛిస్తాం. మరి, భక్తిపారవశ్యంలో రావణుడు ప్రహ్లాదుడికి తీసిపోకపోవచ్చు. అంతమాత్రంచేత రావణాసురుడికి సర్వవిషయాల్లోను యోగ్యతాపత్రం ఇవ్వగలమా ? ఈ రెండు గుణాలు వేర్వేరు. ఈ రెండు సద్గుణాలూ ఒకేవ్యక్తిలో ఉండాలి అని కోరుకోవడం సమంజసమే కాని, ఉండితీరుతాయి అని వాదించడం అవాస్తవికం. ఇక శ్రీనాథుడు సౌందర్యదిదృక్షువూ, పరిహాస రసికుడూ, మహాభక్తుడూ కూడాను. సందేహం లేదు. అతను స్త్రీలోలుడు కాకపోవచ్చును కూడా. దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ, అమరపురి కేగిన కవిసార్వభౌమునికి మనం సౌశీల్యానికి యోగ్యతాపత్రం ఇవ్వక్కరలేదు.

పోలుస్తున్నారు కనుక చెప్పవలసి వస్తుంది. శ్రీనాథుని వ్యక్తిగతమైన మంచిచెడుల్ని గురించి ఎక్కువగా చర్చించకుండా, కావ్యాల ప్రసక్తి తెస్తే, శ్రీనాథుని కావ్యాల్లో గాని, పోతన్న కావ్యాల్లో గాని నేటి పెద్దలు అనేకులు అంతగా

హర్షించని పాళ్లలో శృంగారం ఉంది అని అంగీకరించాలి. దానినిబట్టి వారి వారి నిజ జీవితాల్లోని శృంగారాలను అంచనా కట్టవలసివస్తే వ్యాసుడికంటె పోతన్న ఎక్కువ శృంగారి అనవలసి వస్తుంది. శ్రీనాథునికంటె శ్రీహర్షుడు ఎక్కువ శృంగారి అనవలసి వస్తుంది. వ్యాసుడూ పోతన్నల విషయంలో ఇదమిత్థం అని తేల్చలేకపోయినా, శ్రీనాథుడికంటె శ్రీహర్షుడు ఎక్కువ శృంగారి అని ఇంతవరకు ఎవ్వరూ స్థాపించి నట్లు లేదు.

కాలాన్నిబట్టి పాళ్లు, ప్రమాణాలూ :

ఇక – శ్రీనాథుడి రచనలోకంటే పోతన్న రచనలో శృంగారం ఎక్కువ పాళ్లలో ఉంది అని చెప్పడం కష్టం. శ్రీనాథుడు మూలంలోని, మరీ వ్రీడా కరమైన వాటిని తగ్గించాడని కదా మనంఅనుకొనేది. అటువంటప్పుడు శృంగారనైషధంలోని శృంగారం ప్రమాదకరమైన పాళ్లలో లేదని శ్రీనాథుడు. అనుకొన్నాడు అనేగదా మనం భావించాలి. అది అతని ప్రమాణం. అది మోతాదును మించింది అని మనం అనుకొంటున్నాం. శ్రీహర్షుడిది ప్రమాద కరమైన శృంగారం అనీ, తనది ప్రమోదకరమైనదనీ శ్రీనాథుడు అనుకొన్నా డనాలి. మన కాలానికి ఈ రెండూ విశృంఖలాలే అనిపిస్తున్నాయి. అంటే కాలాన్నిబట్టి ముఖ్యంగా ఆయా ప్రమాణాలు నిర్ణయం అవుతాయి (అసలు ఏకాలము యొక్క ప్రమాణాల్ని బట్టి అయినా, శృంగారం ఎబ్బెట్టుగాలేనివి, ఉత్తరరామ చరిత నాటకం వంటిది మన సాహిత్యంలో ఎన్ని ఉన్నాయి గనుక ఈ విచికిత్స చెయ్యగలం). కాలాన్నిబట్టి, వాటి వాటి ప్రభావాల్నిబట్టి తమ తమ కృతు ల్లోని పాళ్లను ప్రమాణాలను కవులు నిర్ణయించుకోవడం సహజం. శ్రీనాథుడూ పోతన్నా అపనే చేశారు. అది కాలప్రభావమే గాని హెచ్చుతగ్గుల్ని నిర్ణయిం చేది మాత్రం కాదని మనవి.

స్త్రీపురుష వర్ణనలు :

ఇక్కడ ఒకవిషయం అనుసంధానం చేసుకోవాలి. మన పూర్వకవుల్లో నఖశిఖపర్యంతం, నాయికను వర్ణించినవారే ఎక్కువ. అయా కవులు పురుషుణ్ణి, కూడా అంత ఎక్కువగానే (ఇది పరిమాణాన్నిబట్టి) (not quantitative but qualitative measure) వర్ణించారని పురుషప్రాధాన్యం గల మన పండిత విమర్శకలోకం సర్వసాధారణంగా గుర్తించదు (కవనం చేసినవారిలో పురుషు లెక్కువ కావడం ఈ రాశికి కారణం కావచ్చు). స్త్రీవర్ణన పురుషుణ్ణీ, పురుష వర్ణన స్త్రీనీ సమంగానే ప్రభావితం చేస్తాయి కదా ! తప్పయితే రెండూ తప్పే. అసలు ఈ వర్ణనలకు మూలం ఏమిటి ?

**కావ్యరచన, ఒక ఆరాధనావిశేషం :**

కావ్యరచనను ఆరాధనావిశేషంగా భావించిన కవులు ఎందరో ఉన్నారు. దేవీదేవతల అంగ ప్రత్యంగ వర్ణన సంప్రదాయ సిద్ధం. ఎన్నో స్తోత్రాల్లో అటువంటి వర్ణన కనబడుతుంది. అట్టి వర్ణన చెయ్యకపోవడం మంత్రశాస్త్రం ప్రకారం దోషం అని కూడా పెద్దల వలన వినికిడి. శంకరభగవత్పాదులు సౌందర్యలహరిలో జగన్మాత సర్వావయవ వర్ణన చేశారు. దీన్నిబట్టి శంకరుల వారు నిజ జీవితంలో శృంగారి అని అనడం అనుచితం ; అంతమాత్రమే గాదు అపచారం. ఆ దేవీదేవతల వర్ణనలే సాధారణ కావ్యనాయికా నాయకుల వర్ణనలకు కూడా కొనసాగింది ; దిగజారింది. ఇది సమంజసం కాదనిపిస్తుంది.

పోతన్నతోబాటుగా మరి కొందరు కూడా భాగవత రచనలలో పాలు పంచుకొన్నారు. కాని వారెవరూ పోతన్నతో తులతూగేవారు కారు.

ఒక రకంగా చూస్తే పోతన్న కోసం భాగవతం, భాగవతం కోసం పోతన్నా పుట్టారా అనిపిస్తుంది. అంతటి ఆత్మీయత ఆ కవికీ, ఆ కృతికీ చూపట్టుతున్నాయి. విశ్వనాథ అన్నట్టు నిజంగానే పోతన్న తెలుగుల పుణ్యపేటి.

(గమనిక : ఈ వ్యాసంలోని ఉద్ధరణలకు ఆకరాలు చూపలేదు. అన్నీ సుప్రసిద్ధాలు గదా !)

# బమ్మెర పోతన కృతులు

## డా॥ లకంసాని చక్రధరరావు

బమ్మెర పోతనామాత్యుడు 'నారాయణ శతకము, వీరభద్ర విజయము, భోగినీ దండకము, శ్రీమహాభాగవతము' అనే గ్రంథాల్ని రచించినట్లుగా ప్రసిద్ధి ఉంది. వీటి కర్తృత్వాకర్తృత్వాల్ని నిర్ణయించటమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

**నారాయణ శతకము :**

ఈ శతక కర్తృత్వ విషయంలో పలు వాదోపవాదాలు జరిగాయి. శతకాంతంలో కవి పేరును పేర్కొంటూ సాధారణంగా కన్పించే పద్యం కాకుండా ఇందులో 'ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన నారాయణ శతకము సంపూర్ణము' అని 'శ్రీ మహాభాగవతము' లోని గద్య వంటి గద్య కన్పిస్తోంది. ఈ గద్య కూడా అన్ని ప్రతులలో లేకపోవటం వల్ల శతకాంతంలో గద్య వ్రాయటం క్వాచిత్కమైన కారణంగాను ఈ గద్యను పరిగణించకుండా కర్తృత్వ నిర్ణయం చేయవలసి ఉంది.

అపరాధంబులు నిన్ను నమ్మి వినుమే నాజన్మ పర్యంతమున్
వివరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవే దిక్కు నాలోనికిన్
గపటం బింతయులేక దండధరుకుం గట్టీక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడనయ్యధర్మపురి లక్ష్మీనాథ ! నారాయణా !
– 98

అనే పద్యాన్నిబట్టి తెలంగాణాలోని కరీంనగరం జిల్లాలో గోదావరీ తీర ప్రాంతాన ఉన్న ధర్మపురిలో ఉండే లక్ష్మీనారాయణస్వామి మీద ఎవరో చెప్పిన శతకమే ఈ శతకం కావచ్చు.

నీమూర్తుల్ గననీకథల్ వినఁ మదిన్ నీపాద నిర్మాల్య ని
ష్ఠామోదంబు నెఱుంగనీచరణ తోయం బాడ నైవేద్యముల్
నీమంబొప్ప భజింపనీజపము వర్ణింపం గృపం జేయవే
శ్రీమించన్ బహుజన్మ జన్మములకున్ శ్రీయాదినారాయణా ! – 105

అనే పద్యాన్ని 'నా జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండ గన్' (భాగ. 1-19) అని భావించిన పోతన గారు రచించి ఉంటారని మనం ఊహించలేం కదా.

'ప్రథమకబళే మక్షికాపాతః' అన్నట్లు నారాయణ శతకం మొట్టమొదటి పద్యమే విరుద విచిత్రప్రయోగయుక్తమై క్లిష్టాన్వయంతో కూడి ఉంది.

శ్రీరామామణి పాణిపంకజ మృదు శ్రీతద్జ్ఞ పాదాబ్జ శృం
గారాకార శరీర ! చారు కరుణా గంభీర ! సద్భక్త మం
దారాంభోరుహపత్రలోచన ! కళాధారోరు సంపత్సుధా
పారావార విహార ! నా దురితముల్ భంజింపు నారాయణా ! - 1

ఈ పద్యంలో 'సద్భక్తమందార ! అంభోరుహపత్రలోచన !' అనటం సరళాన్వయం. సద్భక్తమందారుడ వైన పద్మపత్రాక్ష ! అనటం క్లిష్టాన్వయం. 'కళాధార ! ఉరు సంపత్సుధాపారావార విహార !' అనటం సరళాన్వయం. కళాధారుడవైన గొప్ప సంపదలనే సముద్రంలో విహరించేవాడా ! అని అన్వయం చేయటం క్లిష్టా న్వయం.

'ఇరువైయొక్కటిమారు (16) తగిలుండు (తగిలి + ఉండు) (31), నిరసించేరికి (నిరసించి + ఏరికి) (70), తెల్సి (72)' మొదలైన వ్యాకరణశాస్త్ర విరుద్ధ ప్రయోగా లుండటమే కాకుండా —

సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యంబునున్ శీలము
న్నతి శాంతత్వము చిత్తశుద్ధికరమున్న ధ్యాత్మమున్ ధ్యానమున్
ధృతియుం ధర్మము సర్వజీవహితముందూరంబుఁగాకుండ స
మ్మతికిం జేరువమీ నివాస సుఖమున్ మానాథ ! నారాయణా !—86

అనే పద్యంలోని మూడోపాదంలో యతి పోయింది.

శ్రీ చాగంటి శేషయ్య గారు డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి గారు ఆరుద్ర గారు 'నారాయణ శతకము' పోతన కర్తృకం కాదని భావించగా శ్రీ వంగూరి సుబ్బారావు గారు మాత్రం దీన్ని పోతన కర్తృకంగా ప్రతిపాదించారు. "వీరభద్ర విజయము రచించిన వెనుక పోతన నారాయణ శతకమును రచించెను" అని కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు గారు తమ 'పోతన' లో భావించటం చింత్యం.

వీరభద్ర విజయము :

పోతన శ్రీమహాభాగవత రచనలో దక్షాధ్వరధ్వంస రచన సందర్భంగా శైవనింద చేసి తద్దోషపరిహారార్థంగా వీరభద్రవిజయ గ్రంథాన్ని రచించాడు అని తెలిపే —

భాగవత ప్రబంధమతి భాసురతన్ రచియించి దక్షు దు
ర్యాగకథా ప్రసంగమున నల్పవచస్కుఁడనైతిఁ దన్నిమి
త్తాగత వక్త, దోష పరిహారముకై యజనైక శైవ శా
స్త్రాగమ వీరభద్రవిజయంబు రచించెద వేడ్క నామదిన్
1-41

అనే పద్యం వీరభద్ర విజయంలో ఉంది. పాత్ర ముఖంగా చేసిన నింద నింద కాదు. ఇంతాచేసి వీరభద్ర విజయంలో దక్షుడు దాక్షాయణితో శివుని గూర్చి పల్కిన పల్కులు భాగవతంలోని శివనిందను మించి ఉన్నాయి.

కట్టంగ దిక్కులేకాని కోకలు లేవు
    పూయ గంధములేదు విభూతిగాని
కాలకూటమె కాని కంఠమాలికలేదు
    ఫణిగాని తొడుగంగ మణులు లేవు
నలి నాకసమె కాని తల వెంట్రుకలు లేవు
    తలకుఁ బువ్వులు లేవు నెలయ కాని
కుడువఁ గంచము లేదు వెడదపున్కయకాని
    యెక్క గుఱ్ఱములేదు నెద్దుగాని

మూఁడుమూర్తులందు మొగి నెవ్వఁడును గాఁడు
జాతిలేదు పుట్టు జాడలేదు
పరముఁ డొంటిగాఁడు బ్రహ్మాదు లెఱుఁగరు
తిరుగు జోగిఁ దగునె దేవుఁ డనఁగ
—వీర. వి. 1-137

ఇవ్వటూరి సోమనాథుడు పోతనను రప్పించి—

చిన్నవాఁడ ననియుఁ జెక్కు సంస్కృతులను
విననివాఁడ ననియు వెఱపు మాను
మత్ప్రసాదవిద్య మహిమచే నెంతైన
కవిత చెప్ప లావు గలదు నీకు
— వీర. వి. 1-21

అని చెప్పినట్టు గ్రంథంలో ఉండటాన్నిబట్టి వీరభద్ర రచన బాల్య రచన ఔతుంది. ఈ రెండు పద్యాలలో ఏదో ఒక పద్యం ప్రక్షిప్తం కాకతప్పదు. అసందర్భంగా అనుచితంగా ఉన్న 'భాగవత ప్రబంధ మతి భాసురతన్ ....' అనే పద్యాన్ని ప్రక్షిప్తంగా భావించటం సమంజసం.

ఇక భాగవత గద్యకు వీరభద్రవిజయ గద్యకు భేదం ఉంది. 'ఇది శ్రీమన్మహేశ్వర యివటూరి సోమనారాధ్య దివ్య శ్రీపాద పద్మారాధక కేసనామాత్య పుత్త్ర పోతయ నామధేయ ప్రణీతంబైన శ్రీ వీరభద్రవిజయంబను మహాపురాణ కథ' అని వీరభద్రవిజయ గద్య ఉండగా 'ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రి పుత్త్ర, సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబు' అని భాగవత గద్య ఉంది. వీరభద్రవిజయంలో గ్రంథకర్త తాను 'యివటూరి సోమనారాధ్యు'ని అనుగ్రహం వల్ల కవితావ్యాప్తిని పొందినట్లు నుడువగా భాగవతంలో పరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధ మని తెలుప బడింది. భాగవతంలోని గద్యలోని 'సహజ పాండిత్య' శబ్దం వీరభద్రవిజయంలో లేదు. ఈ రెండు దృఢ కారణాలచేత ఈ రెండు గ్రంథాలు భిన్న కర్తృకాలని చెప్పవచ్చు.

దక్షుడు సతీదేవితో 'చెలువా! పిలువకముందర వలసరి మా యింటికేల వచ్చితి చెపుమా పిలువని పేరంటము పనిగలవారును బోలె సిగ్గుగాదే ? రాఁగన్' (వీర. వి. 1-141) అని అంటాడు. పుట్టింటికి కూతురు వచ్చినప్పుడు కోపముంటె కూతురిమీద ఆకోపం చూపించటమా ? అత్తమీద కోపం దుత్తమీద చూపట మంటే ఇదే కాబోలు. నోరు నొక్కుకొని కూతురితో మాట్లాడకపోవటం ఈ సందర్భంలో ఏ తండ్రికైనా సహజం. ఈ లోక స్వభావాన్ని పోతన తన భాగవత గ్రంథంలో ప్రదర్శించాడు. సతీదేవి యజ్ఞశాలలో ప్రవేశించగానే –

చనుదెంచిన యమ్మగువను జననియు సోదరులు దక్కఁ సభఁగల
జను లెల్లను దక్షువలని భయమున నయము నపుడాదరింప
రైరి మహాత్మా! మఱి తల్లియుఁ బినతల్లులు పరిరంభణ
మాచరింపఁ బరితోషాశ్రుల్ దొరఁగఁగ డగ్గుత్తికతో సరసిజ
ముఖి సేమ మరయ సతి దానంతన్
జనకుం డవమానించుటయును సోదరు లర్థిఁ దనకు సుచితక్రియఁ జే
సిన పూజల నందక శోభన మరసిన మఱుమాటఁ బలుకక యుండెన్

ఇట్లు తండ్రిచేత నాదరింపఁబడినిదై ........... (భాగ. 4-84, 85, 86, 87) కోపించెనని భాగవతంలో చెప్పబడింది. 'పలుకకుంట తిరస్కారకలన ముద్ర' అన్నరీతి బట్టి దక్షుడు ఆదరంగా మాట్లాడకపోవడమే సతీదేవి అవమానంగా భావించిందని మనం తలచవచ్చు.

అప్పుడు 'అమ్మహాదేవి కోపవివశయై యయ్యాగమ మండపంబున సుఖాసీనులైయున్న సభాపతుల నవలోకించి యిట్లనియె –

నిగమములార ! ధర్మపద నిర్ణయులార ! మునీంద్రులార ! యో
నిగమ మహాత్ములార ! మన నిర్ణయులార ! దిగింద్రులార ! భూ
గగన చరాదులార ! భవఖండనులార ! యతీంద్రులార ! యే
నిగమము లందుఁ జెప్పె శివనింద యెఱింగితిరేని జెప్పరే
–వీర. వి. 1–142, 143

నిగమాలు సభలో కూర్చోవటం అసందర్భం. ఒకవేళ ఆకృతి ధరించి సభాస్థితిలో కూర్చున్నా 'ఏ నిగమము లందుఁ జెప్పె శివనింద యెఱింగితిరేనిఁ జెప్పరే' అని ఎవరినో అడిగే వెంగళ ఉంటారా ? 'గగనచరాదులారా !' అనే సమాసంలోని ఆది శబ్దం గణపూరణ ప్రయోజనమాత్రకం. ఇట్టి రచన భాగవత కర్త శైశవావస్థలో నైనా కలలో కూడ చేయజాలదు కదా.

ఏరా దక్ష ! యదక్ష మానస! వృథా యీ దూషణం బేలరా
యోరీ పాపములెల్లఁ బోవిడువరా యుగ్రాక్షుఁ జేపట్టరా
వైరం బొప్పదురా శివుం దలఁపరా వర్ణింపరా రాజితో
త్కారాత్ముండగు నీలకంఠుఁ దెగడంగా రాదురా దుర్మతీ !
– వీర. వి. 1– 146

అని సతీదేవి తండ్రిని తెగనాడిందని వీరభద్రవిజయ కర్త వ్రాసి తండ్రి కూతుళ్ల సంబంధాన్ని అవమానించాడు. భాగవత గ్రంథకర్త పితృ నింద చేయకుండా శివమాహాత్మ్యాన్ని తండ్రికి స్పష్టీకరించి శివనింద చేసిన దక్షుని పుత్రిగా తాను జీవింపజాలదని పలికి సతీదేవి యోగాగ్ని దగ్ధదేహ ఐంది.

సతీదేవి మరణించగా 'అంతఁ దత్ప్రకారంబు వీక్షించి దక్ష మఖమండపంబున సుఖాసీనులై యున్న బ్రహ్మ విష్ణు సూర్య చంద్ర దేవేంద్ర దండధర వరుణ కుబేరాది దేవజనంబులు మహాభీతచిత్తులైరి. మూర్తిమంతంబులైన మంత్రంబులు తంత్రంబులు చాలించి పాపకర్ముండగు దక్షుని నిందించి బ్రహ్మ తన లోకంబునకుం బోయె మఱియుం దక్కిన వార లందఱు తమతమ నివాసంబులకుఁ జనిరి' (వీర. వి. 1–162) అనే ఘట్టాన్నిబట్టి యజ్ఞవాటికలో ఒక శవం ఉంది కాబట్టి ఋత్విజులంతా అశుచి కారణంగా 'మూర్తిమంతంబులైన మంత్రంబులు తంత్రంబులు చాలింపగా మిగిలినవారు తమతమనెలవులకు వెళ్లారని లోక ధర్మాన్ని బట్టి కేవల లౌకికజ్ఞానంతో సామాన్యునివలె భావించి వీరభద్ర విజయ కర్త రచించాడేకాని యజ్ఞాదులు జరిగేటప్పుడు యజమానికి ఋత్విక్కులకూ దీక్షా మధ్యస్థులైన కారణంగా అవభృథాంతం వరకూ జాతాశౌచమృతాశౌచాదులు పట్టవనీ ప్రారంభించిన యజ్ఞాన్ని మధ్యలో వదిలివేసి చిత్తం వచ్చినట్లు పోగూడదనే విధి ఉందనీ ఏతత్కర్తకు తెలియదు. ఇక భాగవతంలో శివుని జటాజూటోద్భూతు

డైన వీరభద్రుడు శివాజ్ఞచే యజ్ఞంతోపాటుగా దక్షుణ్ణి వధించినట్లుగా పోతన చక్కగా రచించాడు.

చిన్నకవులు కూడా చేయని అనేక దోషాలు ఈ వీరభద్రవిజయంలో కన్పిస్తున్నాయి.

సిరియును వాణి గౌరియును జెన్నగు కన్యకు మేను వాక్కుఁబె
న్నురమును నుంకు విచ్చి ముదమొప్ప వరించి జగంబులన్నియుం
దిరములుసేయఁ బ్రోవఁదుడిఁ దీర్పఁగఁ ద్రష్ట యుగేక్షణుండునై
హరి విధి శంభుమూర్తి యగు నాథ్యుడు మాకు బ్రసన్నుఁడయ్యెడున్
– వీర.వి. 1–2

అనే పద్యంలో క్రమాలంకారం అపక్రమమైంది.

తార తుషారహార హిమధామ సితాంబుజ శారదాభ్రమం
దార నిభోజ్జ్వలం బగుచుఁ దద్దయు వేగ మరాళవాహుఁడై
భూరిగుణాకరుం డమృత భుక్పతివంద్యుఁడు ధాత వచ్చె వి
స్ఫారుఁడు భారతీవిభుఁడు పార్వతినాథునిఁ గొల్వ భక్తితోన్
– వీర.వి.– 1– 57

అనే పద్యంలో 'తార తుషార .... నిభోజ్జ్వలం బగుచు, అనేది మరాళానికి విశేషణమే కాని బ్రహ్మకు కాదు. కాని అన్వయంలో ఈ రీతి పొసగదు.

నా నాథుండు మహేంద్ర దేవముని రాణ్ణాగేంద్ర దిగ్రాజవాక్
శ్రీనాథాగ్ర కిరీట కూట విలసచ్ఛృంగార దివ్యప్రభా
నానారత్న నికాయసంతత లసన్నవ్యస్ఫురత్పాదుకే
శానాలంకృతుఁ డీశుఁ డాతనికి నిల్లాలన్ శివా సుందరిన్
– వీర. 1–170

అనే పద్యంలోని నాలుగో పాదంలో యతిభంగం.

నాకుం గూఁతురవైతివీవు తరుణీ నా భోక్త దానెంతయో
నాకుల్ మెచ్చఁగ నింత దేవరకుఁ గళ్యాణిన్ సమర్పించి యా
శ్రీకంఠాంకున కిట్లు మామయగునే శీతాచలుం డంచు ము
ల్లోకంబుల్ వినుతింపఁగంటి నిపుడో లోలాక్షి నీసత్కృపన్
– వీర.వి. 1–176

అనే పద్యంలోని రెండోపాదంలో యతి పోయింది. '... తెలిఁగులరసి పువ్వుఁ చేనెఁ గందెన వెట్టి గండు రాజకీరములఁగట్టి .... 'లనే సీసపద్యంలోని అటవెలఁది (వీర.వి. 2–94) లో గణభంగమైంది.

కనియెంగాముఁడు మూతులుంగ కదళీ ఖర్జూర పున్నాగ చం
దన జంబీరకదంబ రంభఫలినీ దాడీమ మందార కాం
చన నాగార్జున బింబకంటకఫలానంత ప్రవాళావళీ
వన సంరంభము శీతవంతమును శర్వాణీ ప్రియోపాంతమున్
వీర.వి. 2-97

అనే పద్యంలోని మూడో పాదంలో యతిభంగం కన్పిస్తోంది.

'మృగనాభి జలములు ముంగిళ్లఁ జల్లిరి'
– వీర.వి. 3-115

'మృడునకుఁ గేలెత్తి మొక్కువారు'
– వీర.వి. 3-164

'బృందారక బృందమెల్లఁ బొరిఁబొరి వణఁకెన్'
– వీర.వి. 4-162

'బృందారకావలిఁ బొలియించెఁ గులవధూ'
వీర.వి. 4-168.

పై పద్య పాదాలన్నిటితో యతులు తప్పినట్లుగా భావించాలి. లేదా మృగనాభి, మృడ, బృందారకా శబ్దాలను కవి మ్రుగనాభి, మ్రుడ, బ్రుందారక శబ్దాలుగా కవి తలచాడని అనుకోవాలి. ఏవిధంగా చూచినా వీరభద్రవిజయ కర్తకు ఈ పద్యపాదాలు కీర్త్యాపాదకాలు కావు.

'ఋతుసంవత్సర మాసపక్ష జనితారూఢాయ నానాధ్వర
వ్రత రూపాయ ... ... ... ... ,
– 3-239

'భుజంగ భృంగ సంకాశమై' అనేచోట గణభంగమైంది.

'భుజంగభ్రుంగసంకాశమై' అన్నచో గుణభంగం లేదు. కాని భృంగ శబ్దమే కాని భ్రుంగశబ్దం లేదు కదా. ఋకారానికి రూకు యతిమైత్రి లేదు కదా. ఋతు శబ్దాన్ని రుతు శబ్దంగా భావిస్తే యతిమైత్రి సరిపోతుంది. కాని రుతు శబ్దం కేవలం వ్యావహారికరూపం కదా.

ఇక ఏరీతిగానూ సమర్థించటానికి వీలుకాని కొన్ని యతిభంగాలు –

'చొప్పున నెన్నఁడైన మిముఁ జెందిన యాపదఁబాపి కాచెదన్'
– వీర. వి. 3--247

'అన్ని జగంబులకుఁ దండ్రి యెవ్వఁడు చెపుమా'
– వీర. వి. 4-28

'తాము పాలించునట్టి లోకముల విడిచి'

—వీర. వి. 4–47

' ... ... ... ... ' యా

గమ్ము హరించి రమ్మనుచు నానతి యిచ్చిన వీరుఁ డిట్లనున్'

— వీర. వి. 4–62

'శైలకన్నియ (వీర. వి. 2–102), శంకరజోగి 2–144), భద్ర దంతావళతోలు (2–290), భోగరాయఁడు (3–79), మహామూకలు, మహాలెంకలు' (3–107) మొదలైన వైరి సమాసాలు ఈ గ్రంథంలో ప్రయోగించబడ్డాయి. కేవల సంస్కృతశబ్దం వికృతశబ్దంతో సమసించదు కదా. కన్ను శబ్దానికి బహువచన రూపాన్ని సామ్యంచేత కండ్లు (2–81) గా కవి ప్రయోగించాడు. 'సన్నిధై' (సన్నిధి + ఐ) (3–4), 'నారఁట' (నారీ + అఁట) (4–34) అని ఏతద్గ్రంథ కర్త తత్సమ శబ్దాలకు సంధి చేశాడు. 'మృగనేత్రి' (2–221) శబ్దాన్ని పాణినీయ విరుద్ధంగా యతి స్థానంలో కవి ప్రయోగించాడు. 'పుర జిత్తుండును' (3–47) అని ఆంధ్రవ్యాకరణశాస్త్ర విరుద్ధంగా వీరభద్రవిజయ కర్త ప్రయోగించాడు. అలంకరించి అనటానికి మారుగా 'అలంకారించి' (3–167) అనే క్రియను కవి ప్రయోగించాడు. 'బ్రహ్మ విష్ణుమహేశ్వరులన' (3-241) అని బ్రహ్మ శబ్దాన్ని ఆకారాంతంగా ప్రయోగించాడీ కవి. 'కన్యకామణులు గొందరు డగ్గర నేఁగి యిట్లనున్' (2–183),'తపసులు పెద్దలు ధరణిగూలె' (4–168) అనే వాక్యాల్లో మహతీ బహువచనానికి మహద్బహువచనానికీ అమహత్క్రియను ఈ గ్రంథకర్త ప్రయోగించాడు. 'వారుగోపతీవాహులు' (4–75) అనే చోట పతి శబ్దం ఈకారాంతంగా విచిత్రంగా ప్రయోగించబడింది. అల్లానే కర్తారుడనటం పరిపాటి. కర్తారుఁడుండుఁ దుర్కలమసీదు' అని క్రీడాభిరామ ప్రయోగం. శివుణ్ణి కర్తారు డనటం ఈ గ్రంథంలో రెండుచోట్ల (4-102, 222) కన్పిస్తోంది. ఈ పదం శివపరంగా హిందూదేవతాపరంగా 15 వ శతాబ్దంలో ప్రయోగించబడలేదు. 'కూతు' శబ్దాన్ని ద్వితీయైకవచనంలో 'కూఁతురన్' (1–188) అని కవి ప్రయోగించాఁడు.

అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోప పనిషత్పరా

అని ఆనందవర్ధనులు తమ ధ్వన్యాలోక గ్రంథంలో తృతీయోద్యోతంలో పరికర శ్లోకాన్ని రచించారు. అనౌచిత్యం కంటె రసభంగ కారణంవేరే ఏమీ లేదని ప్రసిద్ధౌచిత్యబంధమే రస పరమరహస్య మనీ ఆనంద వర్ధనుని అభిప్రాయం. ఇటువంటి ఔచిత్యం ఈ వీరభద్ర విజయ గ్రంథంలో లేదు. సప్తర్షులు పార్వతీ

సౌందర్యాన్ని పరమశివునికి తెలిపే సందర్భంలో వారి మాటలు వెగటును కలిగిస్తాయి.

ఆ కన్నులు నా చన్నులు
నా కురులా ముద్దుమోము నా నెఱులార
మ్యాకారము నామధ్యము
నేకాంతలయందు నెఱుఁగమిభచర్మధరా!

– వీర. వి. 3-62

తరుణి చన్నులు భద్రదంతి కుంభములన్న
దంతి కుంభములకుఁ గాంతిలేదు
కొమరాలి కుచములు కోకద్వయములన్నఁ
గోకంబు లొకచోటఁ గూడకుండు
కన్నియ చనుదోయి కనక కుంభములన్నఁ
గనక కుంభములవి కరఁగఁబడును
కంజాక్షి పాలిండ్లు ఘనమైన గిరులన్న
గిరులకు నునుపైన మెరుపులేదు

కానఁ బోల్పఁదగదు కాంత పయోధర
యుగళమునకు నింక జగములోన
నేమి పోల్పవచ్చు నీశాన చెప్పవే
పణతిఁ బొగడవశమె? బ్రహ్మకైన

– వీర. వి. 3-71

పార్వతీ స్తన సంస్తవాన్ని సప్తర్షులు వేలంవెర్రిగా అనౌచిత్యజుష్టంగా చేయటం మనం గమనించాం. శివు డేవిధంగా సహించాడో అనూహ్యం.

శివభక్తుడైన కవి ఎవడో 'వీరభద్ర విజయము' ను రచించి ఈ గ్రంథానికి విశేష ప్రశస్తి ప్రాచుర్యాలు రావాలనే కోరికతో బమ్మెరపోతనామాత్యుని పేరు పెట్టి ఉంటాడు. ఈ శివకవి కాలానికి పోతన కీర్తి దిగంతవిశ్రాంతమై ఉండి శ్రీ మహాభాగవత కృతి ద్వారా భక్తుడుగా పోతన ప్రసిద్ధి పొంది ఉంటాడు. శైవ పారమ్య ప్రబోధగ్రంథమైన ఈ వీరభద్ర విజయాన్ని పోతన కర్తృకంగా శివకవి ఐనవాడు రాయటంలో వైచిత్ర్యం ఏమీలేదు. 'శ్రీమన్మహామహేశ్వర యివటూరి సోమనారాధ్య దివ్య శ్రీపాద పద్మారాధకుడు' గా పోతన పేర్కొబడటం, శివకేశవాభేదం దక్ష యజ్ఞ ఘట్టంలో భాగవతంలో పోతనచే ప్రతిపాదించబడగా ఈ వీరభద్రవిజయంలో సమదృష్టి విడనాడబడి కేవల శివభక్తికే ప్రాధాన్యం ఇవ్వబడటం జరిగింది. ఈ అన్ని కారణాల వల్ల వీరభద్రవిజయ గ్రంథకర్త పోతన కాడని ఒక అజ్ఞాత శివకవి అని మనం నిర్ధరించవచ్చు. శ్రీ

గురుజాడ శ్రీరామమూర్తి తమ 'కవిజీవితములు' గ్రంథంలో ఇటువంటి అభిప్రాయాన్నే వెల్లడించారు. వీరభద్రవిజయ సమగ్ర పఠనాభావం వల్ల మిగిలిన సాహితీవిమర్శకులు పోతన బాల్యకృతిగా దీన్ని భావించారు.

**భోగినీ దండకము :**

ఈ గ్రంథాన్ని బమ్మెర పోతన రావుసింగభూపాలుని ప్రీత్యర్థం రచించాడని –

పండిత కీర్తనీయుఁడగు బమ్మెరపోతన యా సుధాంశు మా
ర్తాండ కులా చలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావు సింగభూ
మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్

అనే పద్యాన్ని బట్టి మనకు అవగత మవుతుంది. రాచకొండ సామ్రాజ్యాన్ని ముగ్గురు సింగభూపాలురు భిన్నభిన్న కాలాలలో పరిపాలించారు. (అశీతివరాల) సింగమనీని (1291–1361) మొదటి సింగభూపాలునిగ చారిత్రకులు నిర్ణయించారు (పద్మనాయక చరిత్ర పుటలు 58–60). రసార్ణవ సుధాకర కర్త ఐన రెండో సింగభూపాలుడు (1350–1405) సంవత్సరాలకు చెందినవాడు. మూడో సింగభూపాలుడు (1405–75) సంవత్సరాలకు చెందిన వాడు. ఈ మూడో సింగభూపాలునికి పోతన సమకాలికుడు. ఇతడు 1425 సంవత్సరంలో యౌవరాజ్య పట్టాభిషిక్తు డయ్యాడు. ఇతడు 'వసంతావనీ నాథ సంసేవితాం చత్పదాంభోజుడ'నీ ఇతని పేరు 'సింగభూపాలుడ'నీ 'కుమారాన్నపోతావనీ నాథు సూనుడ'నీ 'సర్వజ్ఞసింగక్షమాపాలుడ'నీ పోచమాంబా లసద్గర్భసంజాతుడనీ'రావు సింగక్షమానాథ ప్రౌఢుడనీ 'రేచర్లగోత్రాంబు సంజాత మిత్రుడ'నీ 'సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షుడ'నీ 'రావు సింగభూమండలభర్త' అనీ పేర్కొనబడ్డాడు. శ్రీనాథుడు సందర్శించిన సర్వజ్ఞసింగభూపాలుడు కూడా ఇతడే (శ్రీనాథుడు – పు. 273).

'భోగినీదండకము' పోతనకృతం కాదనేవాదం ఉంది. పోతన గారు శృంగారాన్ని వర్ణిస్తారా అని వీరి ఆశంక. పోతన యువకుడుగా ఉన్నప్పుడీ దండకాన్ని రచించి ఉంటాడు. భోగినీ సౌందర్య సమాకృష్ట చేతస్కుడై దురుద్దేశపూర్వకంగా కాక కేవలం కవితా దృష్టితో భోగినిని చూసి పోతన వర్ణించి ఉంటాడు. ఆనాడు భోగినులకు సంఘంలోగౌరవస్థానం ఉంది. భోగిని ఏహ్యమైన కవితా బాహ్యవస్తువు కాదు. సౌందర్యాన్ని ఆరాధించవచ్చు. అనుభవించాలనుకోవటమే పొరపాటు. తమకున్న దురుద్దేశాల్ని పోతనకు అంటగట్టటం అనుచితం. గ్రంథంలోని పాత్రల స్వరూపస్వభావాల్ని కవికి ఆపాదించటం హాస్యాస్పదం. ఈ అభిప్రాయాన్నే కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ వెంపరాల సూర్య

నారాయణశాస్త్రి గారీ విధంగా తెలిపారు – '(దండకాంత పద్యం వల్ల) పోతన కృతమని (భోగినీదండకము) స్పష్టముగాఁ గనఁబడుచుండ – 'కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమాల్యద' యని యేడు పద్యము లేడాశ్వాసాంతము లందు నుండ – నది కృష్ణరాయ కృతము కాదనుటకు నెన్నియో బొటువులను మూటగట్టి చూపుట వంటిదగును. పరమభాగవతోత్తముఁ డగు పోతన యిట్టి వేశ్యావిరహరూప మగు తుచ్ఛ శృంగారము వర్ణింపఁబూనునా యని పెద్దలకు కొందఱకు సందేహము కలుగ వచ్చును. కాని 'వ్యాసాంబరీష శుక శౌనకభీష్మ దాల్భ్యాన్ .... పరమ భాగవతాన్ స్మరామి' అని ప్రాతఃస్మరణీయులలో నొకఁడగు వ్యాసమహర్షి పురాణము లందు కథానుసారముగా నెన్నివిధములగు శృంగారమును వర్ణించలేదు. మహర్షి యగు వ్యాసు నంతటివాఁ డిట్లు వర్ణింపఁడు కావునఁ బురాణములు వ్యాసుఁడు గాక యెవ్వరో వ్యాసుని పేరు పెట్టి రచించి యుందురని యెవ్వరైన నందురా ?' (పోతన, పు. 12),

'శ్రీమహాభాగవతము' నకు 'భోగినీదండకము' నకు పలు పోలికలు కన్పి స్తున్నాయి,

'తల్లికిన్ లొంగి కామానలజ్వాలలన్ వేగి చింతాభరక్రాంతయై క్రాఁగి చింతించు నింథిం బరీక్షించి బుద్ధిన్ విచక్షించి... ' (భో. దం., పు. 24) అనే దానికి శ్రీమహాభాగవతములోని' మీ సత్కథాసార చంచత్సుధాసార పూరంబు లుంగ్రోలి సౌఖ్యోన్నతిన్ సోలి ధీయుక్తులై వ్రాలి తాపంబులం దోలి మోదంబు లందేలి సంపన్నులైమన్న నిత్యప్రసన్నుల్ మహాత్మ్యంతతం చేర్చి ...' (3 స్కం., 203) 'మఱం గొందఱారూఢ కర్మంబులం ద్రుంచి. సంసారముం ద్రెంచి, సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండవంచున్' (10స్కం., పూర్వ. 1232) అనేవాటికి పోలిక లున్నాయి,

'భోగినీదండకము' లోని 'సింగభూపాలుపై వ్రాలి నావిత్తమున్మత్తమై సోలి కామానలాయత్తమైరాదు ; తేరాదు ; నేనా మరుండైన గౌరీవరుండైన వాణీ ధరుండైన లక్ష్మీవిభుండైన దేవప్రభుండైన నన్యున్ మదిం గోరఁగా నొల్లనే ; యుల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబు నందంబునం గ్రోలు మత్తాళిదుత్తూరముం గ్రోలునే ? హేమరాజీవ రాజీరజోరాజితాకాశ గంగానదీ లోల కల్లోల డోలాచల ద్రాజహంసంబు శైవాల జంబాల గండూపదీ భేక భేకీ ఢులీసంకులాసార కాసారముం జేరునే ? మండితాఖండలానీత జీమూత నిర్యత్ప యోధారలం ద్రావు సారంగి కుంభాంతరాంభః ప్రపూరంబులం ద్రావునే ; మాధవోజ్జాత చూతాంకుర స్వాదలీలాలసత్కోకిలేంద్రంబు ఝుల్లీరవక్రూరభల్లాతకీ శాఖకుం బోవునే ?' (పు॥లు 44, 46) అనే వాక్యాలకు 'శ్రీమహాభాగవతము' లోని –

మందార మకరంద మాధుర్యమునఁదేలు
　　మధుపంబు వోవునే ? మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
　　రాయంచ సనునే ? తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియైచొక్కు
　　కోయిల సేరునే ? కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరక
　　మరుగునే ? సాంద్ర నీహారములకు

నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పానవిశేష మత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల ! మాటలు వేయునేల ?

– 7 స్కం., 150

అనే పద్యానికి స్పష్టమైన పోలిక లున్నాయి.

'పండిత కీర్తనీయుఁడగు... విమత మానవనాథ మదాపహర్తకున్' (భో.దం., పు.50) అనే పద్యానికి 'శ్రీమహాభాగవతము'లోని –

స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింప భర్తకు నుదార పదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీ గళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్

– 8 స్కం., 545

అనే పద్యానికి పోలిక లున్నాయి.

'శ్రీమన్మహామంగళాకారు, నాకార లక్ష్మీకుమారుం, గుమారీ మనోరాము, రామాంబరీషాది రాజన్య రాజద్యశఃకాము ... సింగభూపాలు భూపాల గోపాల గోపాలికా కృష్ణగోపాలు, గోపాలదేవోత్సవ క్రీడలో' (భో.దం., పు.22) అనే చోట ముక్తపదగ్రస్తాలంకారం ఉంది. 'వారయోషాతనూజాత, విద్యావయోరూప సౌందర్య చాతుర్య విఖ్యాత, చంచద్గుణోపేత, భృంగాంగనాలబ్ధ కంజాత సంకాశ, తూణీనిరుద్ధప్రసూనేషు సూనేషు నీకాశ' (భో.దం., పు.లు 22, 24) అనేచోట అంత్యానుప్రాస వెలుగొందుతోంది. భోగినీదండక శ్రీమహాభాగవత గ్రంథాల శైలినిబట్టి భాషనుబట్టి పరిశీలిస్తే 'భోగినీదండకము' శ్రీమహాభాగవత గ్రంథానికి బీజప్రాయమైనదని తోచక పోదు. 'భోగినీదండకము' దండకవాఙ్మయంలో మొట్ట మొదటిది మరిన్నీ స్తుతిరూపకం కాకుండా ఇతివృత్తప్రధానమైనది.

శ్రీమహాభాగవతము :

'శ్రీమహాభాగవతము'ను పోతన పూర్తిగా రచించగా అందులో కొన్ని భాగాలు ఉత్పన్నంకాగా గంగన, సింగన, వెలిగందల నారయలు పూరించారని పలువురు భావిస్తుండగా తొలి నాలుగు స్కంధాల్ని ఆ తర్వాత భక్తిరస ప్రధానాలైన సప్తమాష్టమనవమదశమ స్కంధాల్ని పోతన రచించాడని శిథిలపూరణవాదం మిథ్యావాదమని కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు గారు భావించారు (పోతన, పు.లు 54–63). సర్వజ్ఞరావు సింగభూపాలుడు (1405–75) తన కంకిత మివ్వలేదనే కోపంతో పోతనకృత భాగవతాన్ని పాతిపెట్టించాడని దాన్ని కొంత కాలము తర్వాత పైకి తీయించగా శిథిలస్థితిలో ఉండగా కనుగొని వెలిగందల నారయాదులు పూరించారని కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి తన 'లక్షణసారసంగ్రహము'లో పేర్కొన్నాడు.

'కాకునూరి యప్పకవి యహోబలపతి ముద్దరాజు రామముఖ్యులెల్ల' పోతరాజు కబ్బమున ఱాలు రేఫలు గదిసె నంచుఁ బలికిరది హుళక్కి, (3–340) అని తిమ్మకవి పోతన గారు శకట రేఫ సాంకర్య మొనర్చలేదని ఇక భాగవతములోని పోతన రచిత భాగాలలో రేఫ శకటరేఫ సాంకర్యానికి శిథిలపూరణమే కారణమని వివరించాడు.

ఘనుఁడు పోతన మంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞసింగయక్ష్మావరుం డది దన
కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యా పుస్తకంబవనిఁ బాతించినఁ
జివికి యందొక కొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పిరా గ్రంథముల యందె తప్పులాదవెఁ
గాని పోతకవీంద్రుని కవిత యందు
లక్షణం బెందుఁ దప్పదు దక్షహరణ !

పోతరాజు చెప్పినవి ప్రథమ స్కంధమును ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధములఁ గొంతయు షష్ఠ సప్తమాష్టమ నవమ స్కంధములును, దశమ స్కంధము పూర్వభాగము కొంత యున్నది. అందులో రేఫ ఱకార సాంకర్యము లేకుండుటకు 'వారయుమన్నాము' (లక్షణ, 3–344, 345) తిమ్మకవి ఈ అభిప్రాయాన్ని ఆమోదించేవాడు.

కాటుక కంటినీరు చనుఁగట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభ దైత్యమర్దనుని గాదిలి కోడల ! యోమదంబ ! యో
హాటకగర్భు రాణి ! నిను నాకటికిం గొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ త్రిశుద్ధిగ నమ్ము భారతీ

అనే పోతన చాటు పద్యాన్ని ఉదహరిస్తున్నారు. 'చారిత్రకులు కాని సారస్వత పండితులు సర్వజ్ఞసింగ భూపాలుడికి అపప్రథను అంటగట్టా' (భో. దం., పు. 19) రనే బుచ్చి నాయన గారి మాట యథార్థం. పద్యంలోని 'కర్ణాట కిరాట కీచకుల' విజయనగరపాలకు లనేది స్పష్టం. భాగవతరచనానంతరం తెలంగాణా ప్రాంతం బహమనీ సుల్తానుల దాడుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. దేశపరిస్థితులు క్లిష్టపరిస్థితుల్లో ఉన్న కారణంగా పోతన తన భాగవత గ్రంథాన్ని పాతిపెట్టి ఉంటాడు. పరిస్థితులు చక్కబడిం తర్వాత వీరి రచనలోని శిథిల భాగాల్ని నారయాదులు పూరించి ఉంటారు.

పోతన గారే దాచి దాచి తమ అవసానదశలో వెలికితీసి కుమారుల కిచ్చేటప్పటికి దానిలో కొంతభాగం ఉత్పన్నం కాగా నారపరాజాదులు పూరించారనే ప్రవాదం వేరొకటి ఉంది. పోతన గారు తమ గ్రంథం శిథిలమైపోతుందో లేదో కూడా చూడకుండా తమ దగ్గర ఉంచుకుంటారా అని కొందరి కుశంక. ఆనాటి పరిస్థితి లట్టివి. మహమ్మదీయ విజృంభణ భయంకరంగా ఉన్న రోజులవి. పోతన గారు మొత్తం భాగవతాన్ని రచించారని నేను భావించడం లేదు. వీరు మొదటి నాల్గు స్కంధాల్ని, ఏడు ఎనిమిది తొమ్మిది పది స్కంధాల్ని రచించి ఉంటారు. ఈ భాగాలు భక్తిభావభరితాలు కావటమే ఇందుకు కారణం. 5, 6, 11, 12 స్కంధాల్ని వీరు అసలు రచించి ఉండరు. వీటి రచనా భారాన్ని తమ సహచరులైన గంగన సింగనలకు శిష్యుడైన నారయకు పోతన గారు అవసానకాలంలో అప్పగించి ఉంటారు. పోతనగారు రచించిన భాగవతంలోని ద్వితీయ తృతీయ చతుర్థ దశమ స్కంధోత్తర భాగాలలో కొంతభాగం శిథిలం కాగా ఈ శిథిలభాగాలను వెలిగందల నారయ పూరించాడని జనశ్రుతి ఉంది. ద్వితీయ స్కంధంలో 93వ పద్యం తర్వాత 'వెలిగందల నారయ కవిత్వ ప్రారంభము, అని కొన్ని ప్రతులలో కన్పిస్తోంది. 'మఱియును బోతన గారు సీసములను, గీతములను, నాట వెలఁదులను యతులతోనే వ్రాయవలయునన్న కఠోర నియమము గలవాఁడు. ఈ నియమము ప్రథమ సప్తమాష్టమ నవమ స్కంధము లందు, దశమ స్కంధ పూర్వభాగమునను గొలఁది స్థలము లందుఁ దప్ప నిర్బాధముగాఁ బ్రవర్తించు చున్నది. ద్వితీయ స్కంధము నందు నూటముప్పదిమూఁడు పద్యముల వఱకు, దశమోత్తరము నందు రెండువందల ముప్పదినాల్గవ పద్యము వఱకీ నియమము

బాధితమై కన్పట్టుచున్నది' (శ్రీమద్భాగవతానుశీలనము, పు.58) అని డాక్టరు ధూళిపాళ శ్రీరామమూర్తిగారు నిర్ణయించారు. ఇంతేకాక వెలిగందల నారయ శిథిల భాగాల్ని పూరించిన కారణంగానే ద్వితీయ తృతీయ చతుర్థ దశమ స్కంధాలలో విశిష్టాద్వైత సిద్ధాంతాలు ప్రతిపాదించబడ్డాయి. పంచమ షష్ఠైకాదశద్వాదశ స్కంధాలలో ఏకొద్దిభాగం కూడా లభించకపోవటంచేత అవి భక్తి భావనిర్భరాలు కాక పోవటంచేత వాటిని పోతన అసలు రచించలేదని భావించవచ్చు. భాగవత పంచమ స్కంధాన్ని బొప్పనామాత్యపుత్త్రుడైన గంగనార్యుడు రచించగా షష్ఠ స్కంధాన్ని ఏర్చూరి సింగనామాత్యుడు రచించాడు. వెలిగందల నారయ ద్వితీయ స్కంధంలో 94వ పద్యం నుంచి స్కంధాంతం వరకు, తృతీయ చతుర్థ స్కంధాల్లో కొన్ని భాగాల్ని 'కాటుక నెరయంగఁ గన్నీరు వఱదలై కుచ కుంభ యుగళ కుంకుమము తడియ.... '(భాగ., 10, ఉ.237) అనే పద్యం లోని 'మారుతాహతిఁదూలు మహిత కల్పకవల్లి వడువున మేన్ వడవడ వణంక ....' అనే పద్యపాదం నుంచి స్కంధాంతం వరకు, ఏకాదశద్వాదశ స్కంధాల్ని విశిష్టాద్వైతపరంగా వెలయించాడు.

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్

అనే పద్యం భాగవతంలో అస్థానపతితంగా ఉంది. ఉత్తమపురుష నుంచి ప్రథమ పురుషకు మారటం అసహజంగా కన్పిస్తోంది. ఈ పద్యాన్ని ఎవరో రచించి గ్రంథంలో ఇరికించారు.

అంబ ! నవాంబుజోజ్జ్వల కరాంబుజ ! శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ! ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ ! శ్రుతి సూక్తి వివిక్త నిజప్రభావ ; భా
వాంబరవీధి విశ్రుత విహారిణి ! నన్ గృపఁజూడు భారతీ !

అనే పద్యం భారతంలో (అరణ్య, 4–216) ఎఱ్ఱాప్రెగడచే రచితమై ఉండగా పోతన గారు గౌరవంతో దీన్ని స్వీకరించారు. ఇట్టి స్వీకరణ పూర్వ కవులపైని పోతనకు గల భక్తిని తెలియజేస్తుంది.

'భోగినీదండకము' ను రచించినందుకు సింగభూపతి సంకోచింపగా —

'రసికులైనవారు రమణుల కొకవేళ వంగుటెల్ల ధర్మవర్తనంబు
ఈ రసమున విల్లు నారికి వంగదా చిత్తజాతరూప సింగభూప !'

అని పోతన సమర్థించుకొన్నట్లు జనశ్రుతి ఉంది. 'తల్లీ నిన్నుదలంచి .. పూర్ణేందు బింబాననా' అనే పద్యాన్ని పోతన గారు రచించలేదు.

'శ్రీమహాభాగవతాన్ని ' నరాంకితం చేయకుండా పోతన భగవదంకితం కావించాడు. నరాంకితం కావిస్తే ధన కనక వస్తు వాహనాలు లభిస్తాయి. కాని నిస్పృహుడై –

బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుగూడు భుజించుటకంటె మేలు గా
హాలికులైన నేమి ? గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైననేమి ? నిజ దార సుతోదర పోషణార్థమై.

అని పోతన భావించి జీవిత చరమదశలో శ్రీకైవల్యపదానికై చింతించాడు. శ్రీ మహాభాగవత రచన ద్వారా చిరకీర్తి నార్జించి ఆత్మోద్ధరణతోపాటు ఆంధ్రావళి ఆధ్యాత్మ చింతనకు తోడ్పడిన మహాకవి బమ్మెర పోతనామాత్యుడు ప్రాతః స్మరణీయుడు.

ఉపజీవికా గ్రంథములు :

ఆంధ్రకవితరంగిణి (6వ సంపు.) – శ్రీ చాగంటి శేషయ్య, హిందూ ధర్మ శాస్త్ర గ్రంథ నిలయం, కపిలేశ్వరపురం. తూ.గో., 1961.

కవిజీవితములు – గురజాడ శ్రీరామమూర్తి, వావిళ్ల రామస్వామి అండ్ సన్స్. 1913.

నారాయణ శతకము.

పద్మనాయక చరిత్ర – శ్రీ బుచ్చి నాయన, అప్పరాయ గ్రంథమాల, ఆంపాపురం, కృ.జి., 1981.

పోతన – కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు, నేషనల్ బుక్ ట్రస్టు ప్రచురణ.

పోతన – శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1975.

భోగినీ దండకము (భో.దం.) – బమ్మెర పోతనామాత్యుఁడు, అప్పరాయ గ్రంథమాల. నూజివీడు, కృ.జి., 1980.

లక్షణ సార సంగ్రహము – కూచిమంచి తిమ్మ కవి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1971.

వీరభద్రవిజయము – వావిళ్ల రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మద్రాసు, 1952.

శ్రీనాథుడు – డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, రీడర్, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు, 1971.

శ్రీమద్భాగవతానుశీలనము – డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి, మారుతి నగర్, విజయవాడ, పరీధావి. ఫాల్గుణ.

శ్రీ మహాభాగవతము – బమ్మెర పోతనామాత్యు(డు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు. 1968.

# పోతన - భాగవతానువాదము

డా॥ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

'విద్యావతాం భాగవతే పరీక్షా' అని ప్రసిద్ధి కెక్కిన వ్యాస భాగవతము అష్టాదశ పురాణములలో అత్యంత విశిష్టమైనది. గాయత్రి యాధారముగ ధర్మ ప్రబోధము గలది, వృత్రాసుర వధోపేతము, 18 వేల శ్లోకనిబద్ధము అయినది, భాగవత మని మత్స్యపురాణము వివరించుచున్నది.[1] పదునెన్మిదివేల శ్లోకము లతోఁ గూడి పంద్రెండు స్కంధములు గలిగి హయగ్రీవ బ్రహ్మవిద్యోపేతమై గాయత్రీ నిరూపణసహితమైనది భాగవత మని స్కాంద పురాణము భాగవతము నభివర్ణించు చున్నది.[2] అట్టి మహాభాగవతమును మహాకవి పోతన ఆంధ్రీకరించి నాఁడు.

భారతాంధ్రీకరణానంతరము ఆంధ్ర సాహిత్యమున అంతటి విశిష్ట స్థానము నలంకరించినది భాగవతాంధ్రీకరణము. భాగవత పరమార్థావిష్కరణమునకా కవితల్లజుఁడు పొందిన యుత్కంఠ యనుపమము. నన్నయ తిక్కనాదులు భాగవతమును దెనిఁగింపకుండుట తన పూర్వజన్మ సుకృత విశేష మని యిట్లు వాకొనినాఁడు –

ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్; దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్
– పీఠిక, 21 ప.

శ్రీమహాభాగవతము నాంధ్రీకరించి పునర్జన్మము లేకుండునట్లుగఁ దన జననము సఫల మొనరించుకొనుటయేగాక పాఠకలోకజననమును గూడ పోతన సార్థక మొనరించినాఁడు. సంసారబంధ విచ్ఛేదము గోరువాఁడు భాగవతము చదువవలె నను పద్మపురాణోక్తి[3] సారమును పోతన గ్రహించి తదనుగుణముగ నాంధ్రీకరించినాఁడు. ఆంధ్రభాగవతావతారికలోని తొట్టతొలి పద్యమును 'శ్రీకై

వల్యపదంబుఁ జేరుకుటకునై చింతించెదన్' అని యారంభించుటయు పోతన అను వాద కృతి లక్ష్యమెట్టిదో విశదపఱుచుచున్నది.

భగవంతుని చరితము భాగవతము. 'భగవతః చరితం భాగవతమ్' అని భాగవతశబ్ద వ్యుత్పత్తి. ప్రపంచోత్పత్తి, ప్రళయము భూతముల అగమనగమనములు, విద్యావిద్యలు ఎవ్వనికిఁ దెలియునో యతఁడు భగవంతుఁడని ప్రాచీన పండిత సంప్రదాయ మిట్లు వివరించుచున్నది –

ఉత్పత్తిం నిధనంచైవ భూతానా మాగతిం గతిం
వేత్తి విద్యా మవిద్యాంచ స వాచ్యో భగవాన్నితి

నిర్గుణ సగుణాత్మకమైన ఆత్మస్వరూపనిరూపణము భాగవత మని సంగ్రహముగా నిర్ణయింపవచ్చును. సంస్కృత భాగవతమునఁ బెక్కుచోట్ల నిర్గుణాత్మకమైన ఆత్మస్వరూప స్వభావములు, దానితోపాటు సగుణమునకుఁ జెందు విష్ణుని బహువిధావతార విశేషములు నిరూపింపఁబడినవి. ఆంధ్ర భాగవత కర్తయగు పోతన వాని నన్నింటిని తన భాగవత రచనమున మనోహరముగ ననువదించినాఁడు.

వ్యాసభాగవత మందు ఆత్మతత్త్వమునుపదేశించుచు మొదటి శ్లోక మిట్లు రచింపఁబడినది –

జన్మాద్యస్య యతో న్వయా దితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ అదికవయే ముహ్యన్తి యత్సూరయః
తేజోవారిమృదాం యథా వినిమయః యత్ర త్రిసర్గోమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి

ఈ జగత్తునకు జన్మస్థితిలయాదులు ఎవని నుండి కల్గుచున్నవో అన్వయ వ్యతిరేకములచే సర్వ వస్తువులందుఁ గనబడువాఁ డెవ్వఁడో, స్వయం ప్రకాశకుఁడైనవాఁ డెవ్వఁడో ఏ ఈశ్వరుఁడు బ్రహ్మకు మనస్సుచే వేదము నుపదేశించెనో, ఎవనిని గూర్చి (శబ్దబ్రహ్మము) పండితులు మోహము పొందుచున్నారో, ఎండమావు లందు నీరు, కాచాదులం దన్యత్వము వలె నెవ్వని యందు భ్రాంతిగల్గుచున్నదో, ఎవ్వని యందు సత్త్వరజస్తమోగుణములు (అ) సత్యమగు చున్నవో తన మహస్సుచేఁ గపటమును బోగొట్టుచున్నవాఁ డెవఁడో, త్రికాలా బాధితమైన ఆ పరమాత్మను ధ్యానింతునని శ్లోక భావము. శ్రీధరాచార్యవర్యులు భావార్థదీపికా వ్యాఖ్యలో బహుశ్రుతివాక్యపూర్వకముగా శారీరక మీమాంసామతానుసారముగ నీ శ్లోకమును వివరించినవిధము సుమనోమనోహరము. భాగవతమును గూర్చిగరుడ పురాణమున 'అర్థోయం బ్రహ్మసూత్రాణామ్' అని పేర్కొనిన వాక్యమునకీ తొలిశ్లోకము ప్రథమలక్ష్యము.

పోతన ఈ ఆత్మతత్త్వోపదేశిక మగు శ్లోకమును కథాదిని ఈరీతి నాంధ్రీకరించినాఁడు –

విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని
వలన నేర్పడు నను వర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై
తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి

వేదంబులజునకు విదితముల్ గావించె
నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీటఁ గాచాదుల
నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

త్రిగుణ సృష్టియెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁడతనిఁ గోరి చింతించెద
ననఘు సత్యుఁ బరుని ననుదినంబు

– 34 ప.

మూలమందలి 'జన్మాద్యస్యయతః' అను భాగము 'విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని వలనఁ గలుగు' అని యనువదింపఁబడినది. 'అన్వయాదితరతః' అను భాగము 'అనువర్తనమున, వ్యావర నమున' అని తెనిఁగింపఁబడినది. 'అర్థేష్వభిజ్ఞ' అనునది 'కార్యములందభిజ్ఞుఁడై' అనియు' 'స్వరాట్' అనునది 'తాన రాజగుచు' అనియు 'తేనే బ్రహ్మహృదాయ ఆదికవియే' అనునది 'చిత్తమునఁజేసి వేదంబులజునకు విదితముల్ గావించె నెవ్వండు' అనియు నాంధ్రీకరింపబడినది. 'ముహ్యంతి యత్సూరయః, తేజోవారిమృదాం యథా వినిమయః, యత్రత్రిసర్గో మృషా' అనునది 'బుధులు మోహింతు రెవ్వరికి, ఎండమావుల నీళ్లఁగాచాదుల నన్యోన్యబుద్ధిఁ దొడరునట్లు, త్రిగుణసృష్టియెందు దీపించి సత్యముభంగిఁదోఁచు' అని యనువదింపఁబడినవి. 'ధామ్నా స్వేన సదానిరస్త కుహకం' అను భాగము 'స్వప్రభానిరస్తకుహకుఁ డెవ్వఁడు' అనియు 'సత్యం పరం ధీమహి' అనునది 'అతని గోరి చింతించెద ననఘు సత్యుఁబరుని ననుదినంబు' అనియుఁ బోతనచే ననువదింపఁబడెను. 'జన్మద్యస్య యతః శాస్త్రయోనిత్వాత్ ఈక్షతేర్నాశబ్దమ్' అను శారీరక మీమాంసా సూత్రములు గల్గి గాయత్రీ మంత్రరూపమున నున్నదగుటచే పోతన ఈ శ్లోకమును విడువక తెనిఁగించినాఁడు. మూల శ్లోకములోని తత్త్వసారమును దెనిఁగించుటయేగాక ప్రతిపదార్థరూపమున యనువదించుట పరమశ్లాఘ్య రమణీయముగా నున్నది. సంస్కృత భాగవత మందలి ఆత్మతత్త్వ నిరూపకములగు ఘట్టములను దెనుఁగుఁ జేయుచు వ్యాసపరమార్థము నావిష్కరించుట పోతన

భాగవతానువాద మందలి ప్రధాన ప్రయోజన మనుటకీ యనువాద పద్యము నికషోపల ప్రాయము.

ఆంధ్రకవులలో ననువాదకు లెల్లరకుఁ గవిత్రయమువా రాదర్శమూర్తులు. సంస్కృత పురాణము లందలి ఏయే ఘట్టములను ఎట్లెట్లు ప్రపంచీకరింపవలయునో ఏయేరీతుల కుంచింపవలయునో ఏయే విధముల నన్యథాకరింపవలయునో ఆ మహాకవులు మహాభారతాంధ్రీకరణమున ప్రదర్శించిన మార్గము అనంతరానువాదకు లందరకు ననుసరణీయమైనది. పోతన యెట్లు నిర్వహించినాడో యనుశీలించుట అత్యంతావశ్యకము.

ఆంధ్రమహాభాగవతము పోతన కర్తృకముగా లోకవిశ్రుతి నందినను వెలిగందల నారయ, గంగన, సింగయ యను మువ్వురు గూడఁ గొన్ని భాగములకుఁ గర్తలని యంతస్సాక్ష్యములఁబట్టి కొందరు విమర్శకులు నిర్ణయించిరి. నిస్సందేహముగ పోతనయే రచించినాఁడనఁదగిన భాగములఁబట్టి అతని అనువాద విధానమీ వ్యాసమున స్థాలీపులాక న్యాయమున నిరూపింపఁబడును.

పోతన భాగవతానువాదము నందు మూలప్రపంచీకరణము ప్రాధాన్యము వహించును. అనేక సన్నివేశములందు వ్యాసభాగవత ఘట్టములను విపులీకరించి పోతన రచించినాఁ డను విషయము బహు పండితామోదము నొందినది.

ఆంధ్రభాగవతమందలి తృతీయ స్కంధమున నున్న విదుర మైత్రేయ సంవాదము, వరాహావతారాభివర్ణనము మూలము కంటె విస్తృతముగా పోతనార్యునిచే రచింపఁబడినవి. సప్తమ స్కంధమందలి సుప్రసిద్ధమగు ప్రహ్లాద చరిత్రమునను బోతన గావించిన ప్రపంచీకరణము ప్రస్ఫుటముగా గోచరించును. హిరణ్యకశిపు ప్రహ్లాద సంవాద ఘట్టమున మూలాధికత యధికము. అష్టమ స్కంధమందలి గజేంద్రమోక్షఘట్టము పోతన మూలము నెట్లు పెంచి రచించునో చెప్పుటకు పరమోదాహరణము కాఁగలదు. దాదాపు మూఁడు నాల్గురెట్లు మూలము కంటె నధికముగఁ బెంచి రచింపఁబడినది. అట్లే ఆ స్కంధ మందలి క్షీర సాగర మథనమునను ప్రపంచీకరణము గోచరించుచున్నది. అందును గొల్లవారి బ్రదుకు గొప్ప లెట్టివో పోతన సమర్థనపూర్వకముగాఁ జెప్పిన –

గొల్లవారి బ్రదుకుఁ గొఱఁతన వచ్చునే
గొల్లరీతిఁ బాల కుప్పిఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు ; గొల్లయ్యె విష్ణుండు
సేటులేనిమందు సిరియుఁ గనిరి

– 8 స్కం., 207.

అను పద్యమమూలకము, పరమ రమణీయమునై యున్నది. అష్టమ స్కంధ మందలి ఆంధ్రలోకమున బహుళ ప్రచారమొందిన వామనావతార ఘట్టమునను మూలప్రపంచీకరణము మిక్కుటముగాఁ గాననగును. బలి స్వర్గము పై దండెత్తుటలో సంస్కృతభాగవతమున స్వర్గ వర్ణనము 12 శ్లోకములలో నుండఁగా పోతన విస్తృతముగఁ బెంచి సుదీర్ఘ వచనమున శబ్దార్థాలంకారికమైన రీతిలో ననువదించినాఁడు. అదితి గర్భమును ధరించినదని మూలమున నుండఁగా గర్భ వర్ణనమును బోతన సొంతముగా రచించినాఁడు. వామనుని బాల్యోచిత భాషణము, క్రీడలు వానికి అదితి ఆనంద పారవశ్యముతో ఆడిన మాటలు, చేసిన చేష్టలు పోతన పెంపుదలకు పరమ లక్ష్యములు. బలి యాగవాటికఁ జేరి వామనుఁ డొనరించిన వినోదములు, వింత చేష్టలు, బలి నాశీర్వదించుట, ఎవ్వరివాఁడవు ఏమి కావలయునని బలి యడుగఁగా వ్యంగారపూరితముగా వామనుఁ డొసంగిన సమాధానము మున్నగునవన్నియుఁ బోతన గావించిన పెంపుదలయే.

9వ స్కంధ మందలి గంగావతరణోదంతమునను మూలప్రపంచీకరణము విస్పష్టము. మూలములోని –

తథేతిరా జ్ఞాభిహితః సర్వలోకహితశ్శివః
దధారావహితో గంగాం పాదపూత జలాంహరేః
భగీరథోఽథ రాజర్షిః నిన్యే భువనపావనీం
యత్ర స్వపితౄణాం దేహాః భస్మీభూతాశ్చ శేరతే
– 9 స్కం., 9 అ., 10–11 శ్లో॥లు

అను రెండు శ్లోకములు 'ఇట్లమ్మహానదీప్రవాహంబు పురారాతి జటాజూట రంధ్రంబు వలన వెలువడి... యవాఙ్మనస గోచరంబై' అను కాదంబరీ శైలిని బోలిన సుదీర్ఘ వచనమున ననువదింపఁబడి –

జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిన్ దాఁటి త
త్సగరక్ష్మాపకుమార భస్మములమీఁదన్ ముంచి పాఱన్ మరు
న్నగరావాసము వారు వొందిరి నవీన శ్రీలతో, గంగ నీ
రు గతింగాక మహా దురంత సుజనద్రోహానలం బాఱునే
– 9 స్కం., 231 ప.

అను పద్యముతో ముగిసినది.

దశమ స్కంధమందలి రుక్మిణీకల్యాణ ఘట్ట మందలి రుక్మిణి బాల్యయౌవన వర్ణనము, బ్రాహ్మణుఁడు కృష్ణునకుఁ దెలిపిన రుక్మిణీరూపసౌష్ఠవ వర్ణనము, పోతన స్వతంత్రముగాఁ బెంచి రచించినాఁడు. సంస్కృత భాగవతమున బుద్ధిలక్షణౌదార్య రూపశీలగుణసంపన్న యగు రుక్మిణి తనకుఁ దగిన భార్యయని వివాహమాడవలె నని కృష్ణుఁడు మనస్సులో భావించెనని మాత్రమే యిట్లుగలదు –

తాం బుద్ధిలక్షణౌదార్యరూపశీలగుణాశ్రయాం
కృష్ణస్స్వసదృశీం భార్యాం సముద్వోఢుం మనోదధే
– 10 స్కం., 25 స., 24 శ్లో.

అనువాదమున ఆమె బాల్యయౌవనము లిట్లు వర్ణింపఁబడినది –

వేర్వేరబొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబు లందు
గుజ్జెనగూళ్లను గొమరారప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ
రమణీయ మందిరారామదేశంబులఁ
బువ్వుఁదీగెలకును బ్రోదివెట్టు
సదమల మణిమయ సౌధభాగంబుల
లీలతో భర్మడోలికల నూగు

బాలికలతోడఁ జెలరేగి బంతులాడు
శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు
బర్హసంఘములకు మురిపములు గఱపు
మద మరాళంబులకుఁ జూపు మందగతులు

దేవకీసుతుకోర్కి తీఁగెలు వీడంగ
వెలఁదికి మైఁదీగె వీడఁదొడఁగెఁ
గమలనాభుని చిత్త కమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖకమలమొప్పె
మధువిరోధికిలోన మదనాగ్ని పొడసూపెఁ
బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె

హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధికమగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనంబు నిండియుండె
– 10 స్కం., పూ.భా., 1693, 94 ప.

అగ్నిద్యోతనుండను బ్రాహ్మణుడు హరికి వర్ణించి చెప్పిన రుక్మిణి సౌందర్యమును వివరించు ఈ పద్యము గూడ పోతన స్వతంత్రముగ రచించినదే.

పల్లవ వైభవాస్పదములు పదములు
కనక రంభాతిరస్కారు లూరు
లరుణ ప్రభావ మనోహరములు కరములు
కంబు సౌందర్య మంగళము గళము
మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధుకరశ్రేణి వేణి

భావజాశుగముల ప్రావులు చూపులు
కుసుమ శరుని వింటి కొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు
జలజనయన ముఖము చంద్రసఖము

– 10 స్కం. – పూ.భా., 1715 ప.

పోతన యనువాదము నందలి ప్రపంచీకరణమునకుఁ గల కారణములలో వర్ణనాత్మకత ప్రథమగణ్యము. మూలము కథాకథన సమర్థకముగా నుండఁగా పోతన సందర్భసముచితముగ వర్ణనాసుందరముగ దీర్చిదిద్దుటలోఁ బెంపుదల నొందినది. గజేంద్రమోక్ష ఘట్టమునఁ బిపాసాయత్త చిత్తముతో మత్తేభము గాంచిన కాసార మిట్లు పోతనచే వర్ణింపఁబడినది –

అటఁగాంచెం గరిణీవిభుండు నవపుల్లాంభోజ కల్హారమున్
నటదిందీవరవారముం గమఠ మీనగ్రాహ దుర్వారమున్
వట హింతాల రసాలసాల సుమనోవల్లీ కుటీతీరమున్
జటులోద్ధూత మరాళచక్ర బక సంచారంబుఁ గాసారమున్

– 8–42 ప.

ఈ సుందర సరోవర సౌభాగ్యవర్ణన మంతయుఁ బోతన స్వీయోపజ్ఞకమే. అట్లే కూర్మావతార కథా ప్రారంభమున విష్ణువు మహాకూర్మమైన విధమును పోతన మహాకవి యిట్లు వర్ణించినాఁడు.

సవరనై లక్షయోజనముల వెడలుపై
కడు కఠోరమునైన కర్పరమును
నదనైన బ్రహ్మాండమైన నాహారించు
ఘనతరంబగు ముఖ గహ్వరంబు

సకల చరాచర జంతురాశుల నెల్ల
బ్రమింగిలోఁగొనునట్టి మేటికడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబుపైఁబడ్డ
నాఁగినఁగదలని యట్టి కాళ్లు

వెలికి లోనికిఁ జనుదెంచు విస్ఫులతుండ
మంబుజంబులఁ బోలెడు నక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి సెలువొంద నొక మహాకూర్మమయ్యె

– 8 స్కం., 202 ప.

ఈ వర్ణన మంతయు సమూలకమే. పోతన మూలాధికముగాఁ గావించిన రచనమే. ఇట్లు కథాగతిలో వర్ణనలకుఁ బ్రాధాన్య మొసంగుటచేఁ బోతన రచనలో మూలప్రపంచీకరణము సంభవించినది.

భాగవతము భక్తిరసబంధురమైన మహాపురాణము. 'భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యాన టీకయా' అని లోక ప్రసిద్ధి. పాండిత్యముచేఁగాని వ్యాఖ్యానముచేఁగాని భాగవతము తెలియఁదగినది గాదనియు. భక్తిచేతఁ తెలియఁ దగినదని భావము. అట్టి భక్తి ప్రధానమగు భాగవతమును 'పలికెడిది భాగవత మఁట పలికించెడువాడు రామభద్రుండఁట' అని భక్తిరసావిశిష్టుఁ డగు పోతన ఆంధ్రీకరించుటలో పెక్కు సందర్భము లందుఁ బెంపుదల ప్రస్ఫుట మగుచున్నది. ఆసందర్భములలో పోతన పాత్రలతో తాదాత్మ్యము పొందినట్లు భాసించు చుండును. ఆత్మాశ్రయ కవితాచ్ఛాయలును గోచరించును.

సప్తమస్కంద మందలి హిరణ్యకశిపు . ప్రహ్లాదుల సంభాషణమందు మూల మునలేని భగవద్భక్తి ప్రబోధాత్మకములైన పద్యము లెన్నియో ఆంధ్రీకరణమునఁ గనుపించుచున్నవి. 'మందార మకరంద మాధుర్యమునఁ దేలు',4 'కమలాక్షు నర్చించుఁ గరములు కరములు,..'5; 'కంజాక్షునకుఁ గాన కాయంబు కాయమే...'6, 'సంసార జీమూత సంఘంబు విచ్చునే...'7, అష్టమస్కంధ మందలి గజేంద్రమోక్షణోదంతము నందలి 'కలఁడందురు దీనుల యెడ...8' 'కలుఁగఁడే నాపాలి...'9, లావొక్కింతయులేదు...'10, అను పద్యము లన్నియు సమూలకములే. అట్లే ఆ స్కంధ మందలి వామనావతారఘట్ట మందలి 'ఇంతింతై వటుఁ డింతయై...'11, 'రవిబింబంబుపమింప....'12, అను పద్యములు గూడఁ బోతనచే సమూలకముగఁ బెంచి రచింపఁబడినవే. ఈ రెండు పద్యములలో ఆధునికమైన 'Photo enlargement' కి సంబంధించిన లక్షణము గానిపించు చున్నది. ఈ దశమ స్కంధ మందలి రుక్మిణీ కల్యాణ ఘట్ట మందలి 'ప్ర

నీగుణములు కర్ణేంద్రియముసోక....'[13], 'ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని ...'[14], అనునవియు సమూలకములే.

వ్యాసభాగవతమునకు శ్రీధరపండితులు అద్వైతపరముగ రచించిన భావార్థ దీపికా వ్యాఖ్యానము బహుళవ్యాప్తి నొందినది. పోతన సంస్కృత భాగవత మాంధ్రీకరించుచు సమయోచితముగ శ్రీధర పండితుల వ్యాఖ్యాన విషయములను గూడఁ బెక్కు సందర్భముల ననువదించుటయును అతని అనువాద ప్రపంచీ కరణమునకు ప్రబలహేతువు కాఁగలదు. అతని శ్రీధర వ్యాఖ్యానువాద నిరూప ణకు రెండు లక్ష్యములు –

1. వెంటఁబడి వేగముగ సమీపించుచున్న అర్జునునకు వెఱచి అశ్వత్థామ పరువెత్తి పోయెనను నపుడు –

తమాపతంతం సవిలక్ష్యదూరా
త్కుమారహోద్విగ్నమనా రథేన
పరాద్రవత్ప్రాణ పరీప్సురుర్వ్యాం
యావద్గమం రుద్రభయాద్యథాకః – 1–7–18 శ్లో.

అను సంస్కృత భాగవత శ్లోకమునకు శ్రీధరులు 'కం బ్రహ్మ మృగో భూత్వా సుతాం యద్బుముద్యతస్సన్ రుద్రస్య భయాద్యథా పలాయతేస్మ' అని వ్యాఖ్యానింపఁ బోతన ఆ పంక్తుల నిట్లనువదించెను –

తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి తద్ద్రోణి యా
పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా
సన్నుండౌ హరిఁజూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్
– 1–108 ప.

2. శుకమహర్షి పరీక్షిత్తునకు విరాట్స్వరూపము దెలిపు నపుడు –

అండకోశే శరీరేఽస్మిన్ సప్తావరణ సంయుతే
వైరాజః పురుషోయోఽసౌ భగవాన్ ధారణాశ్రయః
– 2–1–25 శ్లో.

అను వ్యాసభాగవత శ్లోకమునకు శ్రీధరులు వ్యాఖ్యానించుచు 'సప్తావరణ సంయుతే సప్తభిర్మహదహంకార సహితైః పృథివ్యాది పంచభూతాత్మకైః అవరణై రంతావరణైః' అని వివరింపఁ బోతన 'ధరణీసలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడు సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబు నందు ధారణాశ్రయంబుయిన వైరాజపురుషుండు దేజరిల్లు' (2–16) అని తెనిఁగించెను.

పోతన అనువాద మందలి ప్రపంచీకరణమునకుఁ గల హేతువులలోఁ బేర్కొనఁ దగినది అన్య గ్రంథముల నుండి ఎన్నియో విషయములను గ్రహించి తన యనువాదమున సమయోచితముగఁ బ్రవేశ పెట్టుట. ప్రహ్లాద చరిత్ర రచన సందర్భమున ఎఱ్ఱన నృసింహపురాణము నుండి కొన్ని భాగములు గ్రహించినాఁడు. అట్లే నరకాసురవధ రచనాసమయమున విష్ణుపురాణ హరివంశముల నుండి కథాభాగము గ్రహించినాఁడు. సంస్కృతభాగవతమునలేని విపులమగు సత్యభామా యుద్ధమునకు విష్ణుపురాణ హరివంశములు ఉత్తర హరివంశము కూడ నాధారములై యున్నవి.

పోతన మూలమును యథాతథముగ ననువదించిన సందర్భములును బెక్కు గలవు. పరీక్షిన్మహారాజునకు శుకమహర్షి పురుషోత్తముని గుణ విశేషములు వివరించుచున్న సందర్భమున, మూలమున –

> శ్రియఃపతిర్యజ్ఞపతిః ప్రజాపతిర్ధియాంపతిర్లోకపతిర్ధరాపతిః
> పతిర్గతిశ్చాంధకవృష్ణి సాంత్వతాం ప్రసీదతాం మే భగవాన్
> సతాంగతిః
> – 2–4–20 శ్లో.

అను శ్లోకము గలదు. పోతన దానినిట్లనువదించెను –

> తియు యజ్ఞపతియుఁ బ్ర
> జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్
> భూపతియు యాదవశ్రే
> ణీపతియున్ గతియునైన నిపుణు భజింతున్
> – 2–65 ప.

ప్రహ్లాదుఁడు తండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి –

> యథాభ్రామ్యత్యయో బ్రహ్మన్ స్వయమాకర్ష సన్నిధౌ
> తథామే భిద్యతే చేత శ్చక్రపాణేర్యదృచ్ఛయా
> – 7 స్కం. 5 వ., 14 శ్లో.

అని పల్కినట్లు మూలము. దాని యనువాద మిట్లున్నది –

> ఇనుమయస్కాంత సన్నిధి నెట్ల భ్రాంత
> మగు హృషీకేశుసన్నిధి నావిధమున
> కరుగుచున్నది దైవయోగమునఁ జేసి
> బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు
> – 7 స్కం. 149 ప.

శుకమహర్షి పరీక్షితునకు అంబరీషుని స్వభావమును వివరించుచు ఆతని విష్ణుభక్తితత్పరత్వము నిట్లు నివేదించినటు మూలమునఁ గలదు –

సవై మనః కృష్ణపదారవిందయోః
వచాంసి వైకుంఠ గుణానువర్ణనే
కరౌ హరేర్మందిర మార్జనాదిషు
శ్రుతీచకారాచ్యుత సత్కథోదయే

ముకుందలింగాలయదర్శనే దృశౌ
తద్భృత్యగాత్రస్పర్శేంగ సంగమం
ఘ్రాణంచ తత్పాదసరోజసౌరభే
శ్రీమత్తులస్యా రసనాం తదర్పితే

పాదౌహరేః క్షేత్రపదానుసర్పణే
శిరో హృషీకేశ పదాభివందనే
కామంతు దాస్యే నతుకామకామ్యయా
యథోత్తమశ్లోక జనాశ్రయా రతిః

9 స్క. 21–23

ఈ మూఁడు శ్లోకములను పోతన పరమ రమణీయముగ నిట్లనువదించినాఁడు –

చిత్తంబు మధురిపు శ్రీ పాదముల యందు
పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిర మార్జనములంద
శ్రవములు మాధవశ్రవణమంద
చూపులు గోవింద రూపవీక్షణ మంద
శిరము కేశవ నమస్కృతుల యంద
పదము లీశ్వరగేహ పరిసర్పణము లంద
కామంబు చక్రి కైంకర్య మంద
సంగమచ్యుత జనతను సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రి కమలమంద
రసన తులసీదళములంద రతులు పుణ్య
సంగతుల యంద యా రాజచంద్రమునకు

– 9–86 ప.

మూలములోని భక్తిబంధురములగు భావములను మంజులముగను, విశదముగను యథాతథముగను బోతన యనువదించినవిధము మిక్కిలి ప్రశస్త్యము. మూలమందలి 'కృష్ణపదారవిందయోః' అనుటను 'మధురిపుశ్రీపాద

ముల యందు' అనియు, 'ముకుందలింగాలయ' అనుటను 'గోవిందరూప' అనియు, 'తత్పాదసరోరజ' అనుటను 'అసురారి భక్తాంఘ్రి' అనియు ననువదించుట లోని యౌచిత్య మనుపమము. వ్యాఖ్యాన సాపేక్షికము.

మూలములోని కొన్ని పదములను గ్రహించి సందర్భోచితముగ వానిని విపులీకరించి తన అనన్యసామాన్యమైన ప్రతిభను పోతన ప్రదర్శించిన ఘట్టము లనేకములు గలవు. పరీక్షిజ్జన్మోదంత కథన సందర్భమున ఆవిర్భవించిన విష్ణురూపము మూలమున నిట్లువర్ణింపబడెను —

> అంగుష్ఠమాత్ర మమలం స్ఫురత్పురటమౌళినం
> అపీచ్యదర్శనం శ్యామం తటిద్వాసన మచ్యుతమ్
> శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం తప్తకాంచనకుండలం
> క్షతజాక్షం గదాపాణి మాత్మనస్సర్వతోదిశమ్
>
> — 1 స్కం. 12 స., 8, 9శ్లో॥లు

పోతన దీనినిట్లనువదించినాడు —

> మేఘంబుమీది క్రొమ్మెఱుగు కైవడి మేని
> పైనున్న పచ్చని పటము వాఁడు
> గండభాగంబులఁ గాంచనమణిమయ
> మకరకుండలకాంతి మలయువాఁడు
> శరవహ్నినడఁగించు సంరంభమునఁజేసి
> కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు
> బాలార్కమండల ప్రతిమానరత్నహా
> టక విరాజిత కిరీటంబువాఁడు
>
> కంకణాంగద వనమాలికా విరాజ
> మానుఁ డనమానుఁ డంగుష్ఠమాత్ర దేహుఁ
> డొక్కగదఁజేతఁదాల్చి నేత్రోత్సవముగ
> విష్ణుఁడావిర్భవించె నవ్వేళ యందు
>
> — 1 స్కం., 248 ప.

'శ్యామంతటిద్వాసనం' అనుదాని వివరణము సీసపద్య తొలిపాదము. 'తప్తకాంచన కుండలం' అనునది 'గండభాగంబుల ....' అను రెండవపాదమైనది. 'క్షతజాక్షం' అనునది 'శరవహ్ని నడఁగించు ....' అను మూఁడవపాదమైనది. 'స్ఫురత్పురటమౌళిం' అనునది 'బాలార్కమండల....' అను నాల్గవపాదముగా వివరింపఁబడినది.

మూలములోని లేశమాత్రముగనున్న భావములను గ్రహించి మధురములగు భావములతో పెంచి పాత్రల స్వరూపస్వభావములు కన్నులకుఁ గట్టినట్లు అనువదించుట పోతన అనువాదములోని మఱియొక విశేషము. గోపకులు చల్దు లారగించు సందర్భమున మూలములో –

సర్వేమిథో దర్శయంతః స్వాంస్వాం భోజ్యరుచిం పృథక్
హసంతో హాసయంతశ్చాభ్యవజహ్రు స్సహేశ్వరాః
– 10 స్కం. – 13 ప. 9 శ్లో.

అనియుండఁ బోతన యిట్లనువదించినాఁడు –

మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడసి చయ్యన మ్రింగి
చూడ లేదని నోరు చూపు నొక్కఁ
డేగురార్గురి చల్దు లెలమిఁ బన్నిదమాడి
కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్నియుఁ దగఁబంచి యిడుట నెచ్చెలి తన
మనుచు జంతెనగుండు లాడు నొకఁడు

కృష్ణుఁజూడు మనుచుఁ గికురించి పరుమోల
మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకఁడు మురియు నొకడు
– 10 స్కం., 497 ప., పూ.భా.

చపల స్వభావులగు గోపబాలుర చిలిపిచేష్టలు అచ్చతెనుఁగులో పోతన సాక్షాత్కరింపఁజేసిన విధము పరమ శ్లాఘాపాత్రము. మూలమునలేని సొగసులను సహజసుందరముగాఁ దీర్చిదిద్ది అనువదింపవలసినవిధ మెట్టిదో అనంతరానువాదకులకు పోతన భంగ్యంతరముగ సూచించినాఁ డనఁదగియున్నది.

మూలమునలేని భావములను కూర్చి మనోజ్ఞముగ సంతరించి చిత్రించుటయే గాక మూలమునన్నున్న సుందరములగు భావములను మనోహరముగా మలచి కన్నులకుఁ గట్టినట్లు అనువదించుటయుఁ బోతన అనువాదమునఁ గననగు మఱియొక విశేషము. నిశితముగఁ బరిశీలించిన యనేక సన్నివేశములలో నీ విశేషము గనుపించుచుండును. భీష్ముఁడు శ్రీకృష్ణుని ఇట్లుస్తుతించినట్లు మూలమునఁ గలదు.

స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం
ఋతమధికర్తు మవప్లుతో రథస్థః
ధృత రథచరణో భ్యయాచ్చలద్గు
ర్హరిరివహంతు మిభం గతోత్తరీయః
శితవిశిఖవతో విశీర్ణదంశః
క్షతజపరివృత ఆతతాయినోమే
ప్రసభమభిససార మద్వధార్థః
సభవతుమే భగవాన్ గతిర్ముకుందః

– 1 స్కం., 9 అ., 37, 38 శ్లో.

పోతన ఈ శ్లోకద్వయము నిట్లాంధ్రీకరించినాఁడు –

కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి
　　గగనభాగంబెల్లఁ గప్పికొనగ
నుఱికిన నోర్వక నుదరంబులోనున్న
　　జగముల వ్రేగున జగతిగదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ
　　బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
　　మన్నింపుమని క్రీడి మఱల దిగువఁ

గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి
నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు

– 1 స్కం., 185 ప.

భీష్మునిపైఁ గుఱుక నుపక్రమించిన శ్రీకృష్ణుని సంరంభముతోడి రూపము సాక్షాత్కరించునట్లనువదించిన పోతన ప్రతిభ యనల్పము.

విషయసుఖవైముఖ్యమును బోధించు మూలములోని శ్లోకములను విశదపఱుచుచు ననువదించుట పోతన అనువాదములో మఱియొక విశేషము. ఆయా ఘట్టములం దాతని ఆత్మీయత సువ్యక్తమగుచుండును. శుకమహర్షి పరీక్షిత్తునకు విరాట్స్వరూపమును వివరించు సందర్భమున మూలమున –

సత్యాంక్షితౌ కిం కశిపోః ప్రయాసైః
　　బాహౌ స్వసిద్ధేహ్యుపబర్హణైః కిమ్
సత్యంజలౌ కిం పురుధాన్నపాత్ర్యా
　　దిగ్వల్కలాదౌ సతి కిం దుకూలైః

చీరాణి కిం పథిన సంతి దిశంతి భిక్షాం
నోవాంఘ్రిపాః పరభృతస్సరితోవ్యశుష్యన్
రుద్ధాః గుహాః కిమజితో వతి నోపపన్నాన్
కస్మాద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్
– 2 స్కం., 2 అ., 4, 5 శ్లో ॥ లు

అను శ్లోకములుండ వానిని పోతన యిట్లనువదించినాఁడు –

కమనీయ భూమి భాగములు లేకున్న వే
పడియుండుటకు దూదిపఱుపులేల ?
సహజంబులగు కరాంజలు లేకున్న వే
భోజన భాజన పుంజమేల ?
వల్కలాజిన కుశావళులు లేకున్న వే
కట్టు దుకూలసంఘంబులేల ?
కొనకొని వసియింప గుహలు లేకున్న వే
ప్రాసాద సౌధాది పటలమేల ?

ఫలరసాదులఁ గురియవే పాదపములు
సాధుజలముల నుండవే సకల నదులు
పొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల తాపసులకు

– 2 – 21 ప.

మూలములోని 'కవయః' అనుపదములోని అంతరార్థమును గ్రహించిన పోతన 'తాపసులకు' అని మార్చి రచించుటలోని ఔచిత్యము సహృదయైక వేద్యము. భౌతికసుఖములే నిత్యములని భావించువారలకు పోతన యొసంగిన ఈ సందేశము శిరోధార్యము, అనుభవగ్రాహ్యము కాఁగలదు. ఆ మహాకవియొక్క రచనా పరిపక్వతారూపణమున కీ పద్యము గీటురాయి.

ఈ విధముగ ఆత్మజ్ఞాన బోధనైక ప్రయోజనమగు వ్యాసభాగవతమును నైకవిధ శిల్పచమత్కృతులలో ఆంధ్రీకరించిన మహాకవి పోతన కృతకృత్యుఁడు. అట్టి కవిలోకతల్లజుని బొందిన ఆంధ్రులు ధన్యచరిత్రులు.

సూచికలు :

1. యత్రాధికృత్య గాయత్రీ వర్ణ్యతే ధర్మ విస్తరః
వృత్రాసుర వధోపేతం తద్భాగవత మిష్యతే
అష్టాదశ సహస్రం తత్ పురాణం పరికీర్తితమ్

2. గ్రంథోఽష్టాదశ సాహస్రో ద్వాదశస్కంధ సమ్మితః
హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్రవృత్రవధస్తథా
గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః
3. అంబరీష శుకప్రోక్తం నిత్యం భాగవతం శృణు
పఠస్వ స్వముఖేనాపి యదీచ్ఛసి భవక్షయమ్
4. 7 ప.
5. 109 ప.
6. 170 ప.
7. 171 ప.
8. 86 ప.
9. 87 ప.
10. 90 ప.
11. 620 ప.
12. 621 ప.
13. పూ.భా., 1702 ప.
14. పూ.భా., 1710 ప.

**ఈ వ్యాస రచన కుపకరించిన గ్రంథములు :**

1. సంస్కృత వ్యాసభాగవతము – వావిళ్ల వారి ముద్రణ, 1941, వ్యాఖ్యాత్రయ సమేతము

2. శ్రీమదాంధ్రభాగవతము – వేంకట్రామ అండ్ కో ముద్రణ, 1947

3. ఆంధ్రభాగవత విమర్శ – డా॥ ప్రసాదరాయకులపతి

4. శ్రీమదాంధ్ర భాగవతానుశీలనము – శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

5. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు – ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ, 1968

6. పోతన – శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, ఆంధ్ర సాహిత్య అకాడమీ ప్రచురణ, 1975

7. పోతన – ఆచార్య దివాకర్ల వేంకటావధాని -- సాహిత్య అకాడమి, న్యూఢిల్లీ ముద్రణ, 1980.

# పోతన - రచనాశిల్పం

## శ్రీమతి కోలవెన్ను మలయవాసిని

శిల్పం అంటే రచనావిధానమనీ కూర్పు నేర్పనీ పిండితార్థముగా చెప్పుకో వచ్చు. శిల్ప శబ్దాన్ని రచనాపరంగా తిక్కన ఉత్తరరామాయణంలో తాను ఉభయ కావ్య రచనాశిల్పమున పారగుడ నని చెప్తూ వాడాడు. మంచన కవిని కృతిపతి – కేయూరబాహు చరిత్రాన్ని 'కావ్యశిల్పము' మెఱయన్ చెప్పమంటాడు. పోతన దుర్గను స్తుతిస్తూ తనకు మహత్త్వ కవిత్వ పటుత్వసంపదను ఇవ్వమంటాడు. అయితే ఒక్కొక్క కవి రచనకు ఒక్కొక్క వినూత్నమైన, విశేషమైన పద్ధతి ఉంటుంది. తనదయిన అనుభూతి తనదయినట్లే తనదయిన రచనావిధానం తనదై ఉంటుంది మహాకవులకు. అందుకే ఇది నన్నయ మత్తేభమనీ, అది తిక్కన కంద మనీ ఇది శ్రీనాథుని సీసమనీ అది వేమన ఆటవెలది అనీ ఇట్టే పోల్చగలరు విజ్ఞులు. ఒక ప్రత్యేకమైన కూర్పునేర్పు ఒకొక్కరికి దైవదత్తమై ఉంటుంది. దానితో పరిచితి గలిగినవారు ఆవిధమైన రచనావిన్యాసం ఎక్కడ ఉన్నా గుర్తు పట్టగలుగుతారు. ఏవంవిధమైన ప్రత్యేక రచనావిన్యాసమే రచనా శిల్పం.

తిక్కన చెప్పిన రచనాశిల్పం, మంచన మెచ్చిన శిల్పము మెఱవు, పోతన దుర్గను కోరిన మహత్త్వ కవిత్వ పటుత్వసంపద భావసామ్యం గలవే. పోతన శిల్ప విన్యాసాన్ని వివిధ విషయాలలో వివరించడమే ఈ వ్యాసోద్దేశము.

**కథాకథనశిల్పం :**

భాగవత కథ శుకయోగీంద్రుడు పరీక్షిత్తు అడిగినమీదట చెప్తాడు. ఒక్కొక్క కథలో వినేవాడికి కుతూహలం కలిగించే విషయం ఏదో ఒకటి ఉంటుంది. ఆ విషయాన్ని విశేషాలనీ ప్రస్తావిస్తూ పరీక్షిత్తు చేత ప్రశ్నలుగా అడిగిస్తాడు పోతన. ఒక ఉదాహరణము –

> బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేడె ని
> శ్చలుఁడుం బూర్ణుడు లబ్ధకాముడు రమాసంపన్నుడై తాఁ బర
> స్థలికిన్ దీనుని మాడ్కి నేల చనియెం దప్పేమియున్‌లేక ని
> ష్కలుషున్ బంధన మేల చేసె వినం గౌతుహలం బయ్యెడున్

రమాసంపన్నుడు, అన్ని కోరికలూ తీరినవాడు, పూర్ణుడు అయిన విష్ణు మూర్తి పరాయిబోటికి దీనుని వలె వెళ్ళి మూడడుగులు వేడడం, తప్పేమీలేని బలిని బంధించడం వింతగా ఉండే విషయం. అందుకే పరీక్షిత్తు చేత ఇలా అడిగించి ఆ కథను ఆమూలాగ్రంగా చెప్తాడు పోతన. కథని అరంభించడంలో పోతన పద్ధతి ఇది.

ఇలా ప్రశ్న వేసిన తరువాత సాధారణంగా పరీక్షిత్తు వింటూ ఉండడమే కాని మధ్యలో మరి మాట్లాడడు. కాని మరీ విచిత్రమైన సందర్భం వచ్చినప్పుడు పరీక్షిత్తు మధ్యలో కథకుడిని అపి ప్రశ్నిస్తూ ఉంటాడు. ఆ సందేహం పాఠకులకి కూడ ఆ ఘట్టంలో ఆపాటికి కలిగే ఉంటుంది. ఈ సందేహనివృత్తి కోసమే పరీక్షిత్తు చేత కవి కథకుడిని ప్రశ్న వేయించినట్లు కనిపిస్తుంది. అలాంటి ఘట్టాలలో హాలాహల భక్షణం ఒకటి. లోకరక్షణకై శివుడు విషం మ్రింగుతానంటే సర్వమంగళ సరే అంది. అప్పుడు ఎవరికయినా పార్వతి ఈ పనికి ఎలా అంగీకరించింది అనిపించక మానదు. ఆ పట్టున పరీక్షిత్తు —

అమరన్ లోకహితార్థమంచు నభవుండౌఁగాక యంచాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరివో యంభోజగర్భాదులుం
దము గావన్ హర లెమ్ము లెమ్మనిరివో తాజూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్.

లోకహితార్థమై శివుడు సరే అనవచ్చుగాక, దేవతలు ఆ విషానికి భయపడి మ్రింగమనవచ్చుగాక, బ్రహ్మాదులు తమను రక్షించుకోవడానికి హరా! లే అనవచ్చుగాక, ఆ ఉగ్రానల జ్వాలలను తాను చూచి కూడా ఉమ ప్రాణేశ్వరుణ్ణి ఎలా మింగమంది అని ఆశ్చర్యపోతాడు.

వెంటనే శుకుడు —

మ్రింగెడువాడు విభుండని
మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో

అని మ్రింగేవాడు తన భర్తేననీ, మ్రింగేది గరళమనీ ఆవిడకు తెలుసు. మ్రింగడంవల్ల ప్రజలకు మేలనీ తెలుసు. ఆమె సర్వమంగళ - సర్వులకు శుభాలు చేకూర్చే జగన్మాత ఆమె. శివుని అంతర్యాన్ని ఈశ్వరతత్త్వాన్ని, శివునిలో సగపాలయిన ఆమెకు తెలియడంవల్ల తన మంగళసూత్రానికి ఎట్టి భయము లేదని ఆమె గట్టిగా నమ్మింది. అందుకే మింగమంది అని వివరించి పరీక్షిత్తు

సందేహంతోపాటు పాఠకుల సందేహం కూడా నివృత్తి చేస్తాడు కథకుడి ద్వారా కవి. తెలుగుతనం ఉట్టిపడే మంగళసూత్ర ప్రస్తావన చేయడమేగాక 'మేలని ప్రజకున్' అనడంలో ప్రజలంటే బిడ్డలనే అర్థం ఈ పద్యంలో పోతన కూడా స్ఫురింపచేసి జగత్పితరులయిన పార్వతీపరమేశ్వరుల వాత్సల్యాన్ని భంగ్యంత రంగా వెల్లడించాడు. శిల్ప మంటే ఇదేకదా!

ప్రతి కథ చివరా ఆ కథలోని విశేషాన్ని ఒక సూక్తిగా కూర్చడం పోతన ప్రత్యేకత. ఈ కథలో శివుడు హాలాహలాన్ని మింగి కంఠం నలుపు చేసుకున్నాడు.

కాని అది అతనికి భూషణంలా అందంగా అమరింది. ఆ విషయాన్ని పోతన –

హరుడు గళమునందు హాలాహలము పెట్ట
గప్పు గలిగి తొడవు కరణి నొప్పె
సాధు రక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర

అది నల్లనిమచ్చే. అయితేనేం సాధురక్షణం వల్ల ఏర్పడింది కనుక భూషణం అయింది. సజ్జను లయినవారికి సాధురక్షణమే భూషణం అన్నాడు.

ఈ శివుడే విష్ణుమూర్తి మోహినీ అవతార మెత్తినప్పుడు ఆమె వెంట పడతాడు. ఆ కథనంతా వివరించిన తరవాత చివరగా పోతన –

కాము గెలువవచ్చు గాలరి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
ఆడువారి చూపుటంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన

అని చెప్పి శివుడు మన్మథుణ్ణి గెలిచాడు. యముణ్ణి గెలిచాడు, మృత్యువుని జయించాడు – కాని ఆడదాని చూపుని గెలవడం చేతకాలేదు. త్రిపుర వైరికైనా అపని సాధ్యం కాలేదన్నాడు.

నవమస్కంధంలో రామకథ ముగింపు చూడండి –

ఆది దేవుడైన యా రామచంద్రుని
కబ్ధి గట్టుటెంత? యసురకోటిఁ
జంపు టెంత? కపుల సాహాయ్య మదియెంత
సురల కొఱకుఁ గ్రీడ సూపెఁగాక

అంటూ ఇదంతా రాముని క్రీడావిశేష మంటాడు పోతన.

కథలో ఉన్న విషయాన్నిబట్టి పాత్రకు కలిగే ఔన్నత్యాన్ని కథలోని నీతిని ఉపాఖ్యానం చివర ఇలా వివరించడం పోతన గారి కథాశిల్పంలో ఒక ప్రత్యేకత అని చెప్పుకోవచ్చు.

**సంభాషణాశిల్పం :**

సహజసుందరమైన రీతిలో సంభాషణలు నడపడం పోతన పద్ధతి. యజ్ఞవాటానికి వచ్చిన వామనుణ్ణి చూచి బలి వెంటనే 'వడుగా ఎవ్వరివాడ వెవ్వఁడవు — సంవాసస్థలం బెద్ది' అంటూ పలకరిస్తాడు. వచ్చినవాడు చిన్న కుఱ్ఱాడు కాబట్టి వాడు తాను ఫలానావారి అబ్బాయిననో, మేనల్లుడిననో చెప్తేగాని ఎవరో తెలియదు. అందుకే ముందుగా వడుగా, ఎవ్వరివాడవు అని అడిగాడు. ఆ తరవాత ఏఊరు మీది అని అడిగాడు బలి. దానికి వామనుడి సమాధానం అసామాన్యమై వినిపిస్తుంది.

నొరులుగారు నాకు నొరులకు నేనౌదు
నొంటివాడ జుట్ట మొకడులేడు
సిరియు దొల్లిగలదు చెప్పెదనాటెంకి
సుజనులందు తఱచు సొచ్చియుండు

అంటూ పరబ్రహ్మతత్త్వాన్ని తన కలరూపుని భంగ్యంతరంగా చెప్పాడు వామనుడు. 'నేను ఒంటివాడిననే' విషయం వామనుడు బలితో మాట్లాడే సందర్భంలో మరోసారి కూడా చెప్తాడు. కరులో అశ్వములో కన్యలో మాడలో అడగమని బలి హెచ్చరించి నప్పుడు — ఒంటివాడ నాకు ఒకటి రెండడుగులమేర ఇమ్ము అంటాడు. నేను ఒక్కడిని, నాకెంత కావాలి అని ఎంతో నిర్లిప్తంగా అంటాడు. ఈ విషయం బలిచక్రవర్తికి బాగా నాటింది. గురువు దానం ఇయ్యవద్దన్నా —

ఏకలుండఁట కన్నవారన్నదమ్ములు నైన లేరట
ఈ చిన్నిపాపని త్రోసిపుచ్చగ చిత్తమొల్లదు సత్తమా

అంటూ వినయంగా నా సమాధానం చెప్తాడు. ఎవరితోనయినా సంభాషించేటప్పుడు ఏవిషయం ప్రత్యేకంగా చెప్తే ఎదుటివారిని ఆకట్టుకోగలమో దాన్ని సందర్భోచితంగా ఒకటికి రెండుసార్లు చెప్పడం ఒక నేర్పు. ఆ నేర్పు వామనుని ముఖస్థంగా ప్రదర్శించాడు పోతన.

పోతన సంభాషణాశిల్పాన్ని పట్టి ఇచ్చే ఘట్టాల్లో ప్రశస్తమనతగ్గది గోపికలు శ్రీకృష్ణుని ఆగడాలను యశోదతో చెప్పే ఘట్టం. ఈ సందర్భంలో పోతన ఇరవై మూడు పద్యాలు వ్రాసాడు. కాబట్టి కనీసం పాతికమందైనా

యశోద యింటి ముందు చేరి యశోదతో సంభాషిస్తున్నారనుకోవచ్చు. సంభాషణా శిల్పంలో భాషతోపాటు, విన్యాసానికి కూడా బాలా ప్రాముఖ్య ముంది. పోతన ప్రత్యేకంగా చెప్పకపోయినా ఆ పద్యం విరుపులో గోపికల చేతి త్రిప్పులూ, మూతి విరుపులూ, ముఖకవళికలలో మార్పులూ స్ఫురిస్తూ ఉంటాయి. మచ్చుకి –

పడతీ నీబిడ్డఁడు మా
కడవలలో మంచి కాఁగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కని
కడవలలో నడిచె నాజ్ఞ కలదో లేదో ?

పడతీ నీబిడ్డడు అన్నప్పుడు, ఆజ్ఞ కలదో లేదో అన్నప్పుడు ఆ గోపిక చెయ్యి తిప్పడం భావుకులకు కనిపిస్తోంది కదా ?

నమ్మినిదురవోవ నాపట్టి చుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁగట్టి
వీధులందుఁ దోలె వెలఁది నీకొమరుండు
రాచబిడ్డడైన నవ్వమేలె ?

అంటూ మరో గోపిక రాజు బిడ్డయితేమాత్రం ఇంత ఆగడమా అంటూ మూతి తిప్పింది.

కడు లచ్చికలిగెనేనిం
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగులవాడలపైఁ బడవిడుతురె !

మీకు డబ్బుంటే శుభ్రంగా తినండి, మంచిబట్టలు కట్టుకోండి. అంతేగాని నీ అల్లరిపిల్లవాణ్ణి మావంటి పేదవాళ్ల ఇళ్లమీదకి వదులుతారా అని నిలదీసింది ఒక గోపిక. ఇలా అందరూ చెప్పడం అయ్యాక చివరగా ఒక గోపిక బాగా విసిగి పోయిందేమో –

ఓయమ్మ నీకుమారుఁడు
మాయిండ్లను పాలుపెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ !

అంది. ఈ ఊళ్లో ఉండలేం తల్లీ ఎక్కడికయినా పోతాం. ఊరికే బెదిరింపుకి అంటున్నా ననుకుంటున్నావేమో మా అన్నల ఆవులమీద ఒట్టు పెట్టుకుని చెబు తున్నాను అంటూ మంజులవాణీ అని సంబోధించింది. యశోద మధురంగా మాట్లాడగల నేర్పుగలది. ఇలా గోపికలు రావడం ఆవిడకు ఫిర్యాదు చెయ్యడం

ఆమె మంచిమాటలు చెప్పి పంపడం ఇంతకుముందు జరిగే ఉంటుంది. అందుకే మంజులవాణి అంది గోపిక. ఇదివరకు యశోద ఏమందోగాని ఇప్పుడుమాత్రం వీళ్లు ఇంతగా కృష్ణునిమీద నేరాలు చెప్పినా ఆ తల్లికి తనయునిమీద కోపం రాలేదు సరికదా – అతి సరళంగా మృదువుగా, మంజులంగా మావాడునన్ను విడిచిపోడె, వీడికి పొరుగిండ్లకు దారి తెలియదె, కన్నులు తెఱవని మాయీ చిన్నకుమారుణ్ణి ఇంతగా రవ్వచేస్తారా –

అన్య మెఱుఁగఁడు తనయంత నాడుచుండు
మంచివాఁడితఁడె ఎగ్గులు మానరమ్మ
రామలార త్రిలోకాభిరామలార
తల్లులార గుణవతీమతల్లులార !

అంటూ మీ సౌందర్యం త్రిలోకాల్లోనూ మనోహరమైనదనీ వారి సౌందర్యాన్ని, తల్లులార మీరూ పిల్లలకు తల్లులేకదా ! పిల్లలు అల్లరి చెయ్యరా, చేస్తే తల్లులు సహించవద్దా, అది గుణాలకెల్లా పెద్దదయిన గుణం కాదా, మీరు గుణవతీమతల్లులుకదా అంది. ఈ సంబోధనలలోని పోతరాజు గారి అనుప్రాసను విన్న తరువాత ఆ గోపికలిక నిరుత్తరులవుతారు కదా !

పోతన సంభాషణలలో నాటకీయత ఉట్టిపడే ముచ్చటయిన సందర్భం కృష్ణుడు మన్ను తిన్న ఘట్టం. కృష్ణుడు మన్ను తిన్నాడని బలరామాదులు వెళ్లి యశోదతో చెప్పారు. వెంటనే యశోద వచ్చి బాలుని కేలు పట్టుకొని –

మన్నేటికి భక్షించెదు
మన్నియమములేల నీవు మన్నింపవు మీ
యన్నయు సఖులును చెప్పెద
రన్నా మన్నేల మఱి పదార్థములేదే

మన్నెందుకు తింటావు. నేను తినొద్దని చెప్పానా ? నామాట వినవేం. మీ అన్న నీ స్నేహితులు మన్ను తిన్నావని చెప్పారు. మన్నెందుకురా తినడానికి వేరే పదార్థాలేమీ లేవా అంది. ఇక్కడ నెమ్మదిగా అన్నా మన్నేల అని బుజ్జగించే స్వరంతో అనవచ్చు, హన్నా మన్నేల అని గద్దించే స్వరంతోనూ అనవచ్చు. అనడం అన్నది తల్లి స్వభావాన్నిబట్టి ఉంటుంది. రెండువిధాలా అనడానికి వీలుగా పోతన 'అన్నా' అనే పదాన్ని ఆ పాదాదిలో అందంగా అతికాడు.

ఇలా అడిగిన ముగుద తల్లితో ఎఱదంటయైన కొడుకు ఏమన్నాడో వినండి –

అమ్మా ! మన్నుఁ దినంగ నేశిశువనో యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరి మాటలు మదిన్ నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్య గం
ధమ్మాఘ్రాణముసేసి నావచనముల్ దప్పైన దండింపవే

అమ్మా ! మన్ను తినడానికి నేనేం చిన్నపిల్లాడినా, ఆకలేసి తిన్నానంటావా, లేకపోతే వెఱ్ఱివాడినా వీళ్లమాటలు నమ్మకు. ఇదిగో వీళ్లున్నారే – వీళ్లూ – అని చూపిస్తూ – నామీదలేనిపోనివి చెప్పి నన్ను కొట్టిద్దామని ఈ పథకం వేసారంతే. కావాలంటే నానోరు మట్టివాసన వేస్తోందేమో చూడు. చూసి నామాట తప్పయితే కొట్టు. అంతేగాని వీళ్లని నమ్మకమ్మా అంటూ అభినయపూర్వకంగా బదులు చెప్పిన చిన్నికృష్ణుడు పోతన గారి శిల్పం నుండి ప్రత్యక్షమౌతున్నాడు.

రుక్మిణీకల్యాణ ఘట్టంలో – రుక్మిణీదేవి శ్రీకృష్ణుడికి భూసురోత్తముని ద్వారా సందేశాన్ని పంపుతుంది. ఆ బ్రాహ్మణునిచేత పోతన కృష్ణుణ్ణి చూడగానే 'పెండ్లికొడుకువు కమ్మని' దీవింపజేసి మరీ విషయ ప్రస్తావన చేయించాడు. ఇది మూలంలోలేని రసగుళిక శుభోదర్కమయిన ఆ దీవన విన్న ఏ పురుషుని కైనా అంతర్యమున ఆనందానుభూతి కలుగకమానదు.

సంభాషణని ఎలా ప్రారంభించాలో పోతన దగ్గర నేర్చుకోవచ్చు.

**పాత్రచిత్రణశిల్పం :**

పోతన ప్రత్యేకంగా తీర్చిన పాత్రలో ద్రౌపది పాత్ర ఒకటి. అశ్వత్థామ ఉపపాండవుల్ని సంహరించాడు. పుత్రశోకంతో ఉన్న ద్రౌపది దగ్గఱకు అశ్వత్థామను పట్టి తెచ్చి భీమార్జునులు ఆమె ముందు నిలబెట్టారు. పుత్రహంతకుని తలతొక్కి స్నానం చెయ్యమని భీముడామెను హెచ్చరిస్తాడు. కాని ద్రౌపది అలా చెయ్యదు. అశ్వత్థామతో –

ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకు జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా ! నీచేతు లెట్లాడెనో !

అంటుంది. నీమీదికి వాళ్లు ఉద్రేకంతో రాలేదే. బాణాలు పుచ్చుకుని యుద్ధ భూమిలో లేరే. కించిత్తయినా నీకేం ద్రోహం చెయ్యలేదే. రణప్రౌఢులు వాళ్లు బతికి ఉంటే ప్రమాదమని చంపావా అంటేవాళ్లు రణప్రౌఢక్రియాహీనులే – అవన్నీ అలావదిలేయి – వాళ్లు చూడముచ్చటయినవాళ్లే. చంటిపిల్లలే. సర్వం మరచి నిద్రపోతున్నారే, వాళ్లని చంపడానికి నీకు చేతులెలా వచ్చాయి నాయనా –

అంటుంది. అంతటి నిర్దయుణ్ణి ఘోర కిరాతుణ్ణి భీమార్జునులు చంపుతానన్నప్పటి కీ వద్దని వారిస్తుంది. వారించడానికి ఆమె చెప్పిన కారణం —

అక్కట ! పుత్రశోక జనితాకులభావ విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్నభంగి నినుఁబోరఁ గిరీటి నిబద్ధుఁజేసి నేఁ
డిక్కడి కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నే
డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో

నేను పొందుతున్న ఈ పుత్రశోకభారం మరో తల్లి పొందకూడదు. నిన్ను అర్జునుడు తెచ్చినందుకే మీతల్లి ఎంత ఏడుస్తోందో ఏమో అని అశ్వత్థామతోనూ, ద్రోణునితో సహగమనం చెయ్యకుండా ఈ తనయుడి కోసం ఆమె బతికి ఉంది. వీణ్ణి పట్టి తెచ్చినందుకే ఎంతగా విలపిస్తోందో వీడి కేదైనా అయితే ఆవిడ భరించలేదు. నేను అనుభవిస్తున్నటువంటి శోకం మరో స్త్రీ అనుభవించ కూడదు. వీణ్ణి వదలిపెట్టండి అని భర్తల్ని హెచ్చరించే సుస్వభావ పోతన ద్రౌపది.

పోతనకు ద్రౌపదిలాగే కుంతి పాత్ర యందు గూడా గౌరవమే. భాగవతంలో ఆమెను ప్రత్యేకంగా చిత్రించే అవకాశం పోతనకు లేదు. అందు వల్ల పోతన భీష్మపాత్ర ద్వారా కుంతి శీలాన్ని పరిశీలించి ప్రకటించాడు. కురు వృద్ధుడైన భీష్ముడు కుంతి చరిత్రంతా ఆమూలాగ్రం ఎఱిగినవాడు. అతడు అంపశయ్య మీద ఉండగా ధర్మరాజాదులు కుంతీ సహితులై ఆయనను చూడ డానికి వెళ్లారు, అప్పుడు భీష్ముడు కుంతిని చూసి —

సంతసమింతలేదు మృగశాపవశంబునఁ బాండుభూవిభుం
డంతము నొందియుండ మిము నర్భకులం గొనివచ్చి కాంక్షతో
నింతటివారిగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టుగానదీ
కుంతి యనేక దుఃఖముల గుందుచునున్నది భాగ్యమెట్టిదో

ఎప్పుడూ ఆనందించలేదు కదా ! పాండురాజు పోయేనరికి మీరా చిన్నలు, చితకలు. మిమ్మల్ని తీసుకుని వచ్చి పెద్దవాళ్లై పేరు తెచ్చుకుంటారని ఇంతటి వారిగా పెంచింది. ఎప్పుడూ సుఖమన్నది ఎఱుగదు. ఇక పడిన కష్టాలా లెక్క లేవు. ఇంకా కష్టపడుతూనే ఉంది. మరి ఆవిడ అదృష్ట మెలాంటిదో అని భీష్ముణి పాత్ర మాటున పోతన కుంతిని గూర్చి ఇంతగా చింతించాడు. అవ కాశం వస్తే ఆ పాత్రని ఎంతగా చిత్రించేవాడో అనిపిస్తుంది.

బలరాముని పాత్రచిత్రణలో మరో చిత్రం చూడండి. కర్మసిద్ధాంతాన్ని కృష్ణుడు చెప్పగా వినడమే గాని బలరాముడు చెప్పడం సాధారణంగా కనిపించదు. పోతన బలరాముడు కృష్ణుడి కంటె ముందుగా కర్మసిద్ధాంతాన్ని కృష్ణుడి భార్యకు వినిపిస్తాడు.

రుక్మిణీదేవిని ద్వారకకు తీసుకొనిపోయే సందర్భంలో కృష్ణుడికి తోడుగా వచ్చాడు బలరాముడు. రుక్మిని చంపబోతున్న కృష్ణుణ్ణి ప్రార్థించి రుక్మిణి అన్న కు ప్రాణభిక్ష పెట్టమంది. ప్రాణాలు ఉంచాడు గాని కృష్ణుడు రుక్మిని మానాన్ని పోగొట్టేవిధంగా సగం తల, సగం గడ్డం గొరిగించి పంపించాడు. ఆ సమయం లో రుక్మిణీదేవి ఎంతో బాధపడుతూ ఉంటుంది. విచారిస్తున్న రుక్మిణితో బల రాముడు –

తోడం బుట్టినవాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడంజూడకు మమ్మ ! పూర్వభవ కర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెందు లేడొకఁడు శిక్షింపంగ రక్షింప నీ
తోడం బుట్టువు కర్మశేష పరిభూతుండయ్యె నేఁడియ్యెడన్

మీ అన్నని అవమానించాడని మా కృష్ణుణ్ణం అనకుసుమా ! పూర్వజన్మ కర్మానుభవం అనుభవించి మీ అన్న కర్మశేషపరిభూతు డయ్యా డంతే. మేలు కీళ్లు కర్మనిబట్టే గాని కర్తలెవ్వరు లేరు సుమా అంటాడు. బలరాముని పాత్రకి ఇంతటి ఉదాత్తత పోతన కూర్చినదే.

**అలంకారశిల్పం :**

పోతన పేరు వినగానే భక్తితోపాటుగా గుర్తు వచ్చేవి పోతనగారి అను ప్రాసలు. శబ్దాలంకారాల్లో అనుప్రాసలతోపాటు పోతన శిల్పం యమకాల్లో కూడా బహుధా కనిపిస్తుంది. మచ్చుకి స్త్రీ పర్యాయ నామాలయిన లేమా ! కొమ్మా ! అవ్వా ! అనే అచ్చమైన తెలుగు పదాలతో పోతన కూర్చిన యమకాలు చూద్దాం. తనతోపాటుగా యుద్ధరంగానికి బయలుదేరింది సత్య. ఆమెతో కృష్ణుడు —

లేమా దనుజుల గెలువఁగ
లేమా నీ వేల కడఁగి లేచితివిటురా
లేమాను మానవేనిన్
లేమా విల్లందుకొనుము లీలంగేలన్

లేమా ? అని ప్రశ్నగానూ, లేమాను అనేచోట లే-మాను అనీ, లేమా అంటే సుకుమారవతియైన స్త్రీ అనీ అర్థాలు వచ్చే టట్టూ సభంగాభంగ సంశ్లేషార్థ యమకాలంకారం ప్రయోగించాడు పోతన. సరిగ్గా ఇలాంటిదే ఇదే ఘట్టంలో —

కొమ్మా దానవనాథుని
కొమ్మా హావమునకుఁ దొలఁగె గురు విజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెద
గొమ్మా భరణములు నీవు గోరినవెల్లన్

ఇక్కడ కొమ్మా, గైకొమ్మా,దానవనాథుని కొమ్మా అనీ విరుపులు.

బాలకృష్ణుడు మాటలు నేర్చుకొనే ఘట్టంలో మరో ముచ్చటయిన యమకం పోతన కూర్చాడు —

అవ్వల నెఱుగక ముువ్వురి
కవ్వల వెలుగొందు పరముఁ డర్భకుడై యా
యవ్వలకు సంతసంబుగ
నవ్వా యవ్వా యనంగ నల్లన నేర్చెన్

అవ్వల నెఱుగక అన్నప్పుడు - అవతలి ఒడ్డు తెలియనివాడని, ముువ్వురి కవ్వల వెలుగొందు అన్నప్పుడు త్రిమూర్తులకూ అవ్వల వెలిగే పరముడు అర్భకుడై అవ్వలకు సంతోషం కలిగేలా అవ్వా అవ్వా అనడం అంటే అమ్మా అమ్మా అనడం నేర్చుకున్నాడని అర్థం.

సత్కవుల్ హాలికులైననేమి అన్నాడు పోతన. అలా అన్నందుకు సత్కవి పోతన రచనలో కొన్ని ఉపమలు పోతన్నను హాలికునిగా పొల్తిపట్టడానికి ఉపకరిస్తాయి.

కేశి అనే రాక్షసుడిని శ్రీ కృష్ణుడు చేత్తో కొట్టగానే ఆతని దేహం —

పగిలి దోసపండు పగిది తద్దేహంబు
వసుమతీశ రెండు వ్రయ్యలయ్యె

అంటాడు. పాదునుండగానే బాగా ముదిరి లంకలో పండిన దోసపండు చేత్తో పట్టుకోగానే రెండు ముక్కలవుతుంది. హాలికుడైన పోతన రచనలో ఈ దోస పండు ఉపమానంగా రావడం ఉచితమే.

అర్థాలంకారాల్లో పోతనకి రూపకాలంకారం అంటే మోజెక్కువ. పోతన ఎంతటి కృష్ణభక్తుడో అంతటి ప్రకృతిప్రియుడు. అతనికి ప్రకృతి అంతా కృష్ణుడిగా, కృష్ణుడు ప్రకృతిగా కనిపిస్తూ ఉంటారు. ప్రకృతిలో పురుషుణ్ణి, పురుషుడిలో ప్రకృతిని దర్శించగలిగిన మహాయోగి పోతన. నీలమేఘశ్యాముడయిన కృష్ణుడు మేఘమే అంటాడు పోతన చాలాసార్లు.

విమల బృందావననాకాశవీథుల్లో కృష్ణమేఘం
గోపాలజన మునీంద్ర చాతకంబుల దురవస్థ నక్క

వేసిందంటాడు.

విశ్వమోహనమైన వేణు నినాదంబు సరసగంభీర గర్జనముగాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి లలిత సౌదామనీలతికగాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు ఫించపు దండ శైలభేదన శరాసనముగాఁగ

జాడ నేతెంచు గోపాలజనమునీంద్ర
చాతకంబుల దురవస్థ సక్కఁజేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తినొప్పె
విమల బృందావనాకాశవీథులందు

సత్యభామ తన యుద్ధాన్ని వర్షాకాలం చేసిందని చెప్తూ —

జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ సారంగ యూథంబుగా
నావిల్లింద్ర శరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగా
దావిద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగా
బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్

వింటినారిమోత గర్జనగా, దేవతలు సారంగాలుగా, తన విల్లే ఇంద్ర ధనుస్సుగా, కృష్ణుడు మేఘంగా, తాను మెఱపుతీగగా, బాణాలు వాన చినుకులుగా, యుద్ధాన్ని వర్షాకాలంగా చేసిందిట సత్య. రాసక్రీడలాడే కృష్ణుడు మేఘంగా, గోపికలు మెఱుపుల్లా ఉన్నారట.

కృష్ణుణ్ణిచూసి మేఘమనుకున్నది కవి పోతనే కాదు. అతని కవితలోని తిర్యక్కులయిన నెమళ్లు కూడా కృష్ణుని మేఘమని భ్రాంతి పొందాయట. గోపికలు తమలో తాము —

వనితా ! కృష్ణుని నల్లని ఘనమనియున్
వేణురవము గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు ననవరతము
నెమలి తుటుములాడెడికంటె

అంటూ కృష్ణుడు మేఘమనుకునీ, వేణునాదం గర్జన మనుకునీ, నెమళ్లు భ్రాంతి పడి ఆనందనాట్యం చేస్తున్నాయట. ఇక్కడ భ్రాంతితోపాటు మరో విషయం కూడా గమనించాలి. అనవరతమూ కృష్ణుణ్ణి మేఘంగా మనస్సులో తలస్తున్న నెమళ్లకు కృష్ణుడు తాను గీతలో చెప్పినట్లుగా ఎవరు ఎలా ధ్యానిస్తే ఆ రూపంతోనే దర్శన మిస్తానన్న విషయం నిజమయ్యేలా దర్శన మిచ్చాడా అనిపిస్తుంది.

తారాచంద్రుల కథలో బుధుడు ఎవరికి పుట్టినవాడో చెప్పమని బ్రహ్మ తారని అడుగుతాడు. సంకోచించి, సంకోచించి బ్రహ్మ ధైర్యంచెప్పినమీదట తార బుధుడు చంద్రుని కొడుకే నని చెప్తుంది. అప్పుడు చంద్రుణ్ణి గురించి పోతన —

బుద్ధిమంతుఁ డయిన బుధుఁడు పుత్రుండైన
మేను వెంచి రాజు మిన్ను ముట్టె
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి
మిన్ను ముట్టకేల మిన్నకుండు

అంటాడు. ఇక్కడ రాజు మిన్నుముట్ట, బుధుడు అనే పదాల్లో శ్లేష. బుద్ధిమంతు డయిన బుధుడు అంటే పండితుడు కొడుకైతే ఏరాజు పొంగిపోడు. అందుకే బుద్ధిమంతు డయిన బుధుడు పుట్టడంతోనే రాజు అంటే చంద్రుడు మిన్ను ముట్టాడు. ఆకాశంలో విహరించసాగాడని చెప్తూ – బుద్ధిగల సుతుడు పుట్టినచో తండ్రి మిన్నుముట్టకేల మిన్నకుండు అని కావ్యలింగాలంకారాన్ని నేర్పుగా కూర్చాడు పోతన.

అలంకార రచనలో ఇంతటి శిల్పి అయిన పోతన వామనావతార ఘట్టంలో అద్భుతమైన శిల్పాన్ని చూపాడు.

అడ్డు ఆపు లేకుండా వామనుడు అదేపనిగా క్షణక్షణానికి ఎదిగి త్రివిక్రము డవుతున్నాడు. ఆ విషయాన్ని పోల్చి చెప్పడానికి పోతరాజు సూర్యుడికి ఉపమానస్థితి కల్పించాడు. ఆ కల్పనలో కవి చూపిన కల్పనాచాతుర్యం అపూర్వం.

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్

అంటూ – వామనుడు ఎదుగుతున్నాడనేకంటే సూర్యబింబం అతనికి ఛత్రంగా, శిరోరత్నంగా కుండలంగా, హారంగా, కేయూరంగా, కంకణంగా, మొల గంటలా, నూపురంగా, పదపీఠంగా ఉపమించేలా అయింది అని చెప్పాడు. వామను డంతగా ఎదిగిపోతున్నా శిల్పి అయిన కవి దృష్టి ఉపమానం మీదనే కేంద్రీకృతమై ఉపమాన వస్తువునే కర్తగా చేసింది. అంతేకాదు – ఉపమానానికి ఉల్లేఖను గూర్చి కవి ఉపమేయానికి ఉత్కృష్టను ఆపాదించాడు. అలంకారశిల్పంలో పోతన త్రివిక్రముడే.

రసశిల్పం :

భక్తిరసామృతం భాగవతం. పోతన భాగవతోత్తముడు. భక్తిరస పోషణలో పోతన శిల్పం అందరికీ తెలిసిందే. భక్తి తరవాత పోతన మెచ్చింది కరుణ. దుఃఖంలో అందరిదీ ఒక్కటే – పక్షికైనా సరే, పరమేశ్వరునికైనా-

సరే. కళింగపక్షి కథలో పక్షి దంపతుల్లో ఆడపక్షిని బోయవాడు పట్టుకు పోతాడు. అప్పుడు మగపక్షి –

ఱెక్కలురావు పిల్లలకు, ఱేపటినుండి మేతగానమిం
బొక్కుచు ; గూఁటిలో నెగసిపోవఁగనేరవు మున్ను తల్లి యా
దిక్కన నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి న
ల్దిక్కులుఁ జూచుచున్న వతి దీనత నెట్లు భరింతు నక్కటా !

అంటూ పిల్లలకా ఇంకా ఱెక్కలు రాలేదు. రేపటి నుంచి వీటికి మేత కనిపించక ఏడుస్తాయి. గూడు విడిచి ఎగిరి వెళ్లి తినిరాలేవు. తల్లి యీదిక్కు నుంచి వస్తుందేమో, ఆ దిక్కు నుంచి వస్తుందేమో అని నలుదిక్కులూ అతి దీనంగా చూస్తూఉంటే ఎలా భరించను అని వాపోతుంది. పీత కష్టాలు పీతవి అన్నట్టు పక్షి కష్టాలు పక్షివి.

భార్యా వియోగం ఎవరికైనా మహా ఆపద అని పోతన రామోపాఖ్యానంలో వివరిస్తాడు. సీతాదేవి భూవివరంలోకి వెళ్లిపోగా రాముడు –

ముదితా ! యేటికిఁ గ్రుంకితీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీవాక్యంబు విన్పింపవే
తుదిసేయందగదంచు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁడా
పద గాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్

ఈశ్వరుడునై రాముడు ప్రియురాలికై దుఃఖించాడు. భార్యావియోగం చాలా కష్టం అంటూ కరుణ చిందేలా రచించి తన శిల్పాన్ని చూపాడు పోతన.

**సన్నివేశ శిల్పం :**

గజేంద్రుడు మొసలితో ఇక పోరాడలేక 'కలడు కలండనెడివాడు కలడో లేడో' అని ఆక్రోశిస్తూ 'లావొక్కింతయులే' దంటూ 'రావే ఈశ్వరా ! కావవే వరదా ! సంరక్షించు భద్రాత్మకా !' అంటూ ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు. ఆ సమయానికి శ్రీహరి ఎక్కడ ఉన్నాడో, ఎలా ఉన్నాడో వ్యాసుడు చెప్పలేదు గాని పోతన ఒక రమణీయమైన సన్నివేశాన్ని కల్పించి –

అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరఃప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహియనఁ గుయ్యాలించి సంరంభియై

వైకుంఠంలో మందారవనంలో రమావినోదియై పూలపాన్పుమీద ఉన్నాడాయన అని చెప్పాడు. అయితేనేం గజేంద్రుని మొర వినగానే సిరికి చెప్పకుండా

బయలుదేరి వచ్చాడు. ఆ రావడంలో వివాదప్రోత్థిత శ్రీకుచోపర చేలాంచల మయినా వీడడు అని పోతన ప్రత్యేకంగా చెప్పాడు. భక్తరక్షణ కళాసంరంభకు డైన విష్ణువు ఉన్నవాడు ఉన్నట్లున బయలుదేరాడు. శ్రీదేవితో ఏకాంతంలో కేళీవినోదంలో ఉన్నప్పుడు అందులోనూ, ఆ ఆటలో ఏదో తగువు రాగా శ్రీదేవి చేలాంచలాన్ని పట్టిన పట్టయినవేళలో శ్రీహరి భక్తరక్షణకై వచ్చేసాడని చెప్పడంలో, ఈ సన్నివేశకల్పనం వల్ల శ్రీహరి ఎంతటి భక్తరక్షణ తత్పరుడో చెప్పక చెప్పాడు పోతన.

అయితే ఇక్కడ శ్రీదేవి చేలాంచలంవిషయం పోతన కథ చివరివరకూ వదల లేదు. విష్ణువు వెంట పరిగెత్తే లక్ష్మీదేవి మనోహర కరాలగ్నోత్తరీయంతో ఉందని చెప్పాడు. చివరికి – హరి పాంచజన్యాన్ని పూరించి భక్తరక్షణ పూర్తిచేసాక లక్ష్మితో –

బాలా నా వెనువెంటను
హేలన్ వినువీథి నుండి యేతెంచుచున్
చేలాంచలంబుఁ బట్టుట
కాలో నేమంటి నన్ను నంభోజముఖీ

అంటాడు. ఈ సన్నివేశ మంతా పోతన శిల్పచాతురికి ఉదాహరణమే.

అలాగే మరోసారి గొల్లపిల్లలతో కలిసి చల్దు లారగిస్తున్నాడు శ్రీకృష్ణుడు. అన్నం కలుపుకి ముద్ద చేసాడు. నోట్లో పెట్టుకోవడానికి సిద్ధంగా ఉన్న సమయం లో గోపబాలురు కొందరు వచ్చి గోవులు చాలా దూరం పోయాయనీ కనిపించటం లేదనీ చెప్పగానే చేతిలో ముద్ద చేతిలో ఉండగానే –

ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జ హస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేఁగె లేగలకునై దూరాటవీవీథికిన్

అని విష్ణువు సర్వకాల సర్వావస్థల్లోనూ రమావినోది అయి ఉన్నా, చేత్తో కలుపు కుని భోజనం చెయ్యబోతున్నా అపన్నులను రక్షించడానికి సంసిద్ధుడై ఉంటా డని పోతన మరోసారి శిల్పము మెఱయ హెచ్చరించాడు.

**పదశిల్పం :**

పోతన పదశిల్పంలో అఁట అనే పదప్రయోగం గమనించ దగింది. ఏద యినా అద్భుతమైన విషయాన్ని చెప్పాల్సి వచ్చినప్పుడు అటువంటి అలతి శబ్దంతో బృహత్తరమైన శిల్పాన్ని సాధిస్తాడు కవి.

భాగవత రచన గురించి –

పలికెడిది భాగవత మఁట
పలికించెడివాఁడు రామభద్రుం డఁట నే
పలికిన భవహర మగునఁట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా ?!

అంటాడు.

పాండవులకు ఆపద కలగడం గురించి భీష్ముడు –

రాజఁట ధర్మజుండు సురరాజసుతుం డఁట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియఁట యుగ్రగదాధరుఁడైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట యాపదగల్గుటదేమి చోద్యమో!

అంటాడు.

నిందార్థంలో ఆమ్రేడితంలో గిగీలు వస్తాయి. ఆ పదాలు ప్రయోగించడంలో పోతన చూపిన నేర్పు చిత్రమైనది. బలిచక్రవర్తిని ఈ దానం ఇయ్యవద్దని చెప్తూ శుక్రుడు వలదీ దానము గీనము అంటాడు. గురువుకు సమాధానం చెప్తూ బలి నేను ఈ దానం చెయ్యకుండా ఉండలేను. రాజ్యము పోయినా ఫరవాలేదు. 'రాజ్యము గీజ్యమున్ సతతమే' అంటాడు. గురువు హెచ్చరికలోనూ. శిష్యుని సమాధానంలోనూ గిగీ లను ఇలా ప్రయోగించి పోతన ప్రదర్శించిన శిల్పం అనితర సాధ్యం.

ఆంధ్రభాషలో స్త్రీకి పర్యాయపదాలు ఎన్నో ఉన్నాయి. వాటిని కవులు సాధారణంగా గణానుకూలంగా వాడుకుంటూ ఉంటారు. అర్థానికి అంతగా ప్రాధాన్యాన్ని ఇచ్చినవాళ్లు అరుదు. గంగావతరణ ఘట్టంలో పోతన ఈ పద్ధతికి భిన్నంగా –

మానిని యన లోతు నూపక
గరిత యన నడిసప్పుడు చేయక
ముగుదయన బయలు పడక
ప్రమద యన గ్రయ్యం బాఱుచు
పతివ్రత యన నిట్టటు జనక
తల్లియన నెవ్వియైన లోగొనుచు

గంగానది ప్రవహించిందని ఆయా పదాల వుత్పత్త్యర్థాలకు తగినరీతిగా రచించాడు.

**పద్యశిల్పం :**

సన్నివేశాన్ని బట్టి వృత్తాన్ని, గణాన్ని వ్రాసని ఎన్నుకోవడమే పద్యశిల్పం. గోపికలు యశోదతో కృష్ణుడి మీద నేరాలు చెప్పే సందర్భంలో ఇరవైమూడు పద్యాలు వ్రాసాడని చెప్పుకున్నాం. అందులో పందొమ్మిది

పద్యాలు కందాలుగా వ్రాసాడు పోతన. అన్ని పద్యాలూ నేరాలు చెప్పేవే. కంద పద్యంలో ఒకటి మూడు పాదాలు కురుచగా, రెండు నాలుగు పాదాలు నిడివిగా ఉంటాయి. నేరాలు చెప్పడానికి ముందు కొంచెం జంకూ, అంతలోనే చెప్పడానికి కాస్త ఊపూ వచ్చి చెప్పినట్లుగా పోతన ఈ సందర్భంలో ఇన్ని కందాలు అందంగా వ్రాసాడు.

ఇక వ్రాన కృష్ణుడు వస్తాడో రాడో నాభాగ్యమెలా ఉందో అని – ఉద్విగ్నమానసయైన రుక్మిణిని వర్ణించే సందర్భంలో 'లగ్నం బెల్లి వివాహమున్ గదిసె నేలా రాడు గోవిందుడుద్విగ్నంబయ్యెడి మానసంబు' అంటూ 'గ్న' కారాన్ని వ్రాన స్థానంలో నిలిపి రచన చేసాడు పోతన.

భక్తి తత్పరుడైన పోతన భగవంతుణ్ణి కొలిచే పట్టుల్లో సాధారణంగా ఆ కారంలో పెద్దదయిన సీసాన్ని ఎన్నుకుంటాడు. సీసంలో అయితే భగవంతుణ్ణి మరింతసేపు కొనియాడవచ్చునని కాబోలు.

ఒక్క మందారమకరందాన్నే కాక భక్తిమకరందాన్ని కూడా పోతన సీసాల తోనే అందించాడు ఆంధ్రులకు. అసలు స్తుతి సంబంధి పద్యాలను, నన్నయ సూక్తుల్లా ముక్తకాలుగా వ్రాయడం పోతన శిల్పం, ఆ పద్యం కావ్యంలో ఏ పాత్ర దయినా, ఎవరయినా అది తమదిగా చేసుకుని భగవంతుణ్ణి స్తుతించుకో వచ్చు. వృత్తాల్లో పోతనకు ప్రీతిపాత్ర మయింది శార్దూలం. అయితే పోతన శార్దూలాలు గాంభ్రీంచవు. గంభీరముద్ర ప్రదర్శిస్తాయి. ముక్తక లక్షణానికి శార్దూల విన్యాసానికి కలిసి మచ్చుకొక్కటి –

శ్రీకృష్ణా ! యదుభూషణా ! నరసఖా ! శృంగార రత్నాకరా !
లోకద్రోహి నరేంద్రవంశ దహనా ! లోకేశ్వరా ! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా ! నిర్వాణ సంధాయికా
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ

స్థూలంగా పోతన గారి రచనాశిల్పం ఇది. భాగవతంలో పోతన రచనా శిల్పానికి ఇది దిఙ్మాత్ర ప్రదర్శన. 'ఇందు గల దందులేదను సందేహము వలదు' ఎందెందు వెదకి చూచిన అందందే గలదు – ఇట్టి శిల్పవిశేషం అనడం అతిశయోక్తి అనిపించుకోదు.

భాగవతము తేటపఱుప నెవ్వఁడుసాలు
శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క

అని కదా ఆర్యోక్తి, పోతన గారి భాగవతంలో నిక్షిప్తమై ఉన్న కవితాశిల్పాన్ని బుద్ధికి తోచినంత, బుధులచే విన్నంతలో కొత్తిమిరి ప్రాయంగా ఇక్కడ తడ వడం జరిగింది.

# పోతన భాగవతము — అద్వైతము

## బ్రాహ్మీభూషణ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి

వ్యాసభగవానుఁడు సంస్కృతమున మహాభాగవతమను పురాణమును రచించెను. దానికే విష్ణుభాగవత మని పేరు. భగవంతుని గూర్చి వ్రాయఁబడి నందున దానికా పేరు సార్థకము. కాని యా భగవంతుఁ డెవ్వఁడను విషయ మును గ్రహించిన భాగవతతత్త్వ మవగత మగును. కావున ముమ్మందు దాని నరయుట యవశ్యకర్తవ్యము.

ఉత్పత్తించ వినాశంచ భూతానా మాగతింగతిమ్
వేత్తి విద్యామ విద్యాంచ స వాచ్యో భగవానితి

అని భగవత్పదమునకుఁ బ్రాచీనులు లక్షణము నిచ్చిరి. భూతముల యొక్క జననమరణములను, గమనాగమనములను, విద్యావిద్యల నెవ్వఁ డెఱుంగునో వాఁడే భగవంతుఁడని యా వాక్యమున కర్థము. ఈ లక్షణము బ్రహ్మయందును, విష్ణువు నందును, శివుని యందును, ఇంద్రాది దేవత లందును వర్తించు చున్నది.

ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా

అని భగ శబ్దమున కర్థము. సంపూర్ణమగు నైశ్వర్యము, వీర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము అను లక్షణములు గలవాఁడు భగవంతుఁడని పై శబ్దార్థ మును బట్టి విశదమగుచున్నది. ఇదియును బైవారి యందేకాక మఱికొందఱి మహాత్మ లందును వర్తించుచున్నది. కావున నిదియును నిర్దుష్టమగు లక్షణముగాఁ గానరాదు. అయినచో నీ భాగవతమున కర్థమేమి? ఇందలి భగవంతుఁ డెవ్వఁడు? అను సంశయము మిగిలియే యున్నది.

సూక్ష్మముగ నిపుణముఁగఁ బరిశీలించిన భగవత్పదమునకుఁ బరమాత్మ యని యర్థము. దాని స్వరూపస్వభావములను నిరూపించు గ్రంథము భాగవతము.

దీని యందలి విభాగములను బట్టి యిట్లూహింపవచ్చును. స్కంధపదమునకు వృక్షకాండ మని పేరు. మూలము నుండి కొమ్మల వరకు మధ్యనున్న భాగము. 'మూలాచ్ఛాఖావధేస్తరో స్స్కంధః' అని కోశము. అట్టి స్కంధము లిందు పండ్రెండున్నవి. ఒక వృక్షమున కొక్క స్కంధమే యుండును గాని పండ్రెండుండునా ? సందేహము కలుగును. అట్టి వృక్షమొక్కటే యున్నది. అది అరఁటి చెట్టు. ఆ చెట్టున కాధారము దుంప. ఆ దుంప నుండి చాలచెట్లు మొలచును. అవన్నియును వేరు వేరు వృక్షములే. వానికి ప్రత్యేకముగా స్కంధములు గలవు. కావున పండ్రెండు స్కంధములు గల యీ భాగవత వృక్షమునకు మూలకంద మొకటి యున్నది. అదియే పరమాత్మ. ఆ పరమాత్మ మాయోపాధికమై రూపము లను ధరించినది. ఆ రూపములనే మన మవతార పురుషులనుగాఁ జెప్పుచున్నాము. ఆ యవతార పురుష జన్మ కర్మాదులను బూర్ణముగ నెఱింగించుచున్నది భాగవతము. ఇందు దశావతారములే గాక ద్వావింశత్యవతారములు వర్ణింపఁ బడినవి. అందు చేతనే పోతన మహాకవి –

లలిత స్కంధము కృష్ణమూలము శుకా లాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై

అని భాగవతమును గల్పవృక్షముతో సరిపోల్చి, రెండు పదముల నందు గుప్తముగ నిక్షేపించెను. కృష్ణమూలము అనున దొక పదము. వృక్షపక్షమున చేవఁదేరిన నల్లని వేరని యర్థము. భాగవత పరముగ దీనికి మూలకందము కృష్ణుఁ డని యర్థము. కృష్ణపదమునకు దేవకీపుత్త్రు డని యర్థము కాదు. పరమాత్మ యని యర్థము. 'కృషిర్భూవాచకశబ్దః ణస్తు నిర్వృతివాచకః తయోరైక్యం పరబ్రహ్మ కృష్ణఇత్యభిధీయతే, అని కృష్ణ పదమునకు భారతమున వ్యాసభగవానుఁ డిచ్చిన నిర్వచనము. కావున నీగ్రంథమునకు మూలము పరమాత్మ యని యర్థము. ఇఁక రెండవ పదము 'మహాఫలంబు' అనునది. పెద్ద పండ్లు కలదని వృక్షపరమైన యర్థము. మోక్షమే మహాఫలము. మిగిలిన వన్నియు నల్పములే. ఆ ఫల మాత్మజ్ఞానముచేతనే లభించును మఱి దేనిచేతను రాదు.

అట్టి ఫలము నాశించియే యీ మహాకవి 'శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై' అని గ్రంథాది పద్యమునఁ దన మనోరథమును వెల్లడించెను. కైవల్య మనగా నేకత్వము. ఆత్మైక్య మని భావము. 'తత్రకో మోహః కశ్శోకః ఏకత్వ మనుపశ్యతః' అని శ్రుతి ప్రమాణము. ఏకత్వమును గాంచినవానికి శోక మోహము లుండవని తాత్పర్యము. 'అథ తస్య భయం భవతి య ఉదర మన్తరం కురుతే' అని మఱియొక శ్రుతి. ఎవ్వఁడు తనకు నాత్మకును స్వల్ప

మగు భేదమును గూడఁ గాంచునో వానికే సంసార భయము. కాని యితరునకు లేదని భావము. కావున నేకత్వమును బోధించునది భాగవతము. దాని నను వదించిన పోతన మహాకవి మాత్రము తద్భిన్నముగ నెట్టు వ్రాయఁ గలడు ? అందుచేత భాగవత మద్వైతపరమే గాని యన్యము కాదు.

ఇంతకు నద్వైత మనఁగా నేమి ? దాని స్వరూప మేమి ? యని పరిశీలించి యది యీ గ్రంథమున నెట్లున్నదో యరయుదము.

ధర్మార్థకామమోక్షములని పురుషార్థములు నాలుగు. అందుఁ జతుర్థము మోక్షము. దానికే కైవల్య మనియు ముక్తి యనియును బేర్లు. సంసార బంధము నుండి మానవుఁడు ముక్తుఁ డగుటయే ముక్తి. దీనికై భారతీయులు యత్నింతురు. ఇదియే యాధ్యాత్మిక శాస్త్రముల కన్నింటికిని విషయము.

ఈ ముక్తి స్వరూపమును గూర్చి యెన్నియో మత భేదములు గలవు. 'దుఃఖ జన్మప్రవృత్తి దోష మిథ్యా జ్ఞానానా ముత్తరోత్త రాపాయే తదన్తరాపాయాన్మోక్షః' అని న్యాయసూత్రము. మిథ్యాజ్ఞానముచే రాగద్వేష ములు గలుగు ననియు, రాగద్వేషముల వలనఁ గర్మముల నాచరించు ననియు, కర్మముల వలన జన్మము లభించుననియు, నద్దాన దుఃఖము వచ్చుచున్న దనియు, గావున మిథ్యాజ్ఞానమంతరించు సమ్యగ్ఙానము గలిగిన రాగద్వేషము లుండవనియు, అవి లేనిచోఁ గర్మము లుండవనియుఁ గర్మములు లేనిచో జన్మముండదనియు, జన్మము లేనిచో దుఃఖము లేదనియు, నదిలేకుండుటయే యపవర్గ మనియు న్యాయ సూత్రము వివరించుచున్నది. వీరి మతమున సమ్యగ్జ్ఞానమే మోక్షమని స్పష్టమగు చున్నది.

చార్వాక లోకాయతిక ప్రాకృతాదు లందఱును స్వాతంత్ర్యమే మోక్ష మనిరి. వారి నటుండ నిండు. వైష్ణవులు, సామీప్యము, సాలోక్యము, సారూప్యము, సాయుజ్యము అని ముక్తి నాల్గు విధము లనియు నందు 'సాయు జ్యమేవ మోక్షః' అని సాయుజ్యమునకుఁ బ్రథమ స్థానము నిచ్చిరి. విష్ణుసన్నిధి కేగి విష్ణురూపధారియై లక్ష్మ్యాలింగిత వక్షస్కుఁడు మాత్రము గాక, తదితర భాగముల నన్నిఁటి ననుభవించును. వైకుంఠలోకమున నివసించుటయే సాయుజ్య మని వారి యభిప్రాయము.

జీవులలోఁ గొందఱు ముక్తజీవు లనియు, గొందఱు బద్ధజీవు లనియు, ముక్తు లెప్పుడును ముక్తులే, బద్ధు లెప్పుడును బద్ధులే యనియు, ద్వైత మతస్థులు చెప్పుచున్నారు.

ఇట్లు ముఖ్యముగా మూఁడు సిద్ధాంతములు ప్రసిద్ధములై యున్నవి. 'ద్వే ఇతే గతే యస్మింస్తత్ ద్వైతం' అని ద్వైత పదమున కర్థము. అనఁగా రెండు మార్గములు గలది. జీవుఁడు వేరు, దేవుఁడు వేరు అని వారి యభిప్రాయము. వీరినే

మాధ్వమతస్థులని యందురు. జగద్విశిష్టుఁడగు జీవునకు దేవునితో నైక్యము విశిష్టాద్వైతము. ఇదియే విశిష్టాద్వైతము. పై రెండు మతములవారికిని దేవుఁడు విష్ణువు. అతఁడు సకల గుణాభిరాముఁడు. సర్వ శక్తిమంతుఁడు. 'ద్వైతం న భవతీ త్యద్వైతం' రెండు మార్గములు లేనిది. అనఁగా జీవుఁడు దేవుఁడను భేదమే లేదు. రెండు నొక్కటియే. అజ్ఞాన మున్నంతవఱకు జీవుఁడను భేద మున్నది. అది నశించిన యాత్మయే యగును. కాని యిద్దరు వేరు. ఉన్నదంతయు నొక్కటియే. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః' అని సిద్ధాంతము. ఆ యాత్మ నిర్గుణము. నిరాకారము. నిష్క్రియము – శుద్ధము – శాంతము – సచ్చిదానందము. ఆ యాత్మ నెఱింగినవాఁడాత్మయే యగును. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి తరతి శోకమాత్మవిత్' అని శ్రుతి ప్రమాణము అని అద్వైతు లందురు.

ఈ మూఁడు మతములను మువ్వురు మహానుభావులు సిద్ధాంతీకరించిరి. పైవానిలో సకలకల్యాణగుణగరిష్ఠుఁడును, వైకుంఠవాసియునగు విష్ణువే భగవంతుఁడని మొదటి రెండు మతములవారు విశ్వసింతురు. అట్టిలోకము అట్టి దేవుఁడునున్నాఁడా ? లేఁడా ? అను వివాదముతోఁ బనిలేదు. అచ్చట విశ్వాసమే ముఖ్యకారణము. ఉన్న చిక్కంతయు నద్వైతమందే యున్నది. అద్వైతము సగుణ రూపము నంగీకరింపదు. వారి యాత్మ నిర్గుణము. నిరాకారము. జీవుఁడన్నానో యొక యుపాధినాశ్రయించి యున్నవాఁడు. సగుణుఁడు. సాకారుఁడు. వీరిరువురకు భేదమేలేదట ! ఇదంతయు నొక్కటేయట ! 'ఐతదాత్మ్య మిదం సర్వం సర్వం ఖల్విదం బ్రహ్మ' అని శ్రుతి ప్రమాణమట ! ఇది యెట్లు పొసగును. సందేహము లన్నియు దీనియందే యున్నవి. కాని దానిని సనకాదిమును లెఱింగినట్లు 'యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్' అని సూక్తు లెఱింగించు చున్నవి. అది యెట్లో గ్రహించుట ముఖ్య కర్తవ్యము.

'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, నాన్యత్కించన మిషత్' ముందుగా నాత్మ యొక్కటియే యున్నది. మఱియొక వస్తువు లేదు. 'ఏకం సత్ విప్రాబహుధా వదంతి' ఉన్నదొక్కటే. దానినే పలువిధములుగా జెప్పుచున్నారు. 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్' ఈ జగత్తునఁ గల ప్రతి వస్తువు నీశ్వరాచ్ఛాదితము. 'మయాతత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా' – నేనే యానందరూపమున జగత్తు నంతను వ్యాపించి యుంటిని అను శ్రుతి స్మృతి ప్రమాణము లన్నియును, ఆత్మయనున దొకటియున్నదనియు, నది యాకాశము వలె సర్వవ్యాపక మనియుఁ జెప్పుచున్నవి. కావుననే 'ఆకాశ శరీరం బ్రహ్మ' అను వాక్యము రూఢమైనది. కావున నంతట నిండియున్న దాత్మయే యని సారాంశము. అంతట వ్యాపించి యున్నది గావున దాని కాత్మ యను పేరు సార్థకము.

సర్వవ్యాప్తమైన యాత్మ కించిద్వ్యాప్తమైన జీవుఁడే యగుట యెట్లు ? అని సందేహము గలుగును. దానిని గమనింతుము –

వ్యక్తి – జగత్తు – దేవుఁడు అని మూఁడు వస్తువులు గలవు. వ్యష్టిగతమైన చైతన్యము జీవుఁడు. సమష్టిగత చైతన్యము జగత్తు. దానికే ఈశ్వరుఁడని పేరు. అంతటను వ్యాపించి యున్నవాఁడు దేవుఁడు. అతఁడే పరమాత్మ. దీనినిబట్టి – జీవుఁడు – ఈశ్వరుఁడు – పరమాత్మయని మూఁడు వస్తువు లేర్పడినవి. కాని వీనిని బరిశీలించిన మూఁడు లేవు. ఒక్కటియే మిగులును.

ఆకాశ మంతటను వ్యాపించి యున్నది. ఆ యాకాశమే నాలుగు గట్ల మధ్యనున్న తటాకమున (చెఱువు) నున్నచోఁ దటాకాకాశ మయినది. ఆ యాకాశమే కడవలో నిండిన ఘటాకాశమైనది. ఈ నామములు ఉపాధినిబట్టి వచ్చినవి. అట్లే అంతటను నిండియున్నది — పరమాత్మ. అది సమష్టిగత మగు జగత్తున నున్నప్పుడు ఈశ్వరుఁడను నామమును ధరించినది. ఆ యాత్మయే వ్యష్టి యగు నుపాధినిఁ బ్రవేశించి జీవసంజ్ఞ నందినది. ఇట్లు భేదము గోచరించు చున్నది.

ఘటము భిన్నమైన ఘటాకాశము లేదు. గట్లు తీసివేసిన తటాకము లేదు. తటాకము లేనిచోఁ దటాకాకాశము గూడ లేదు. మిగిలినది మహాకాశమొక్కటే. అట్లే ఉపాధిరూపమైన దేహము నశించిన జీవసంజ్ఞ లేదు. ఇచ్చట త్రివిధ దేహమును గ్రహింపవలెను. సమిష్టి రూపమగు జగదుపాధి నశించిన ఈశ్వర సంజ్ఞయు లేదు. మిగిలిన దొక్క పరమాత్మయే. ఇచ్చట ఘటతటాకములు జలశూన్యములని గ్రహింపవలెను.

జలపూర్ణమగు ఘటమున్నది. దానియందు సూర్యబింబము ప్రతిఫలించు చున్నది. అట్టిఘటము లనంతము లున్నవి. వాని యన్నింటి యందును అన్ని సూర్యబింబములు ప్రతిఫలించు చున్నవి. కాని సూర్యుఁడొక్కడే. ప్రతిబింబములు మాత్రమనంతములు.

అట్లే, వ్యష్టి శరీరమున అవిద్య యున్నది. దాని యందు ప్రతిఫలించిన యాత్మ జీవుఁడైనాఁడు. అన్నిజీవుల మొత్తమునకు జగత్తని పేరు. అదియే సమష్టిరూపము. దానియందున్నది మాయ. ఆ మాయలోఁ బ్రతిఫలించిన యాత్మకు ఈశ్వరసంజ్ఞ వచ్చినది. దీనిని మించి యున్నది పరమాత్మ.

ఘటము ఘటాంతర్గత జలమును నశించిన దాని యందలి ప్రతిబింబము లేదు. అన్నిఘటములు వానియందున్న జలములు నశించిన ఆ ప్రతిబింబములును లేవు. బింబభూతమగు సూర్యుఁ డొక్కడే యున్నాఁడు. అట్లే శరీరోపాధియు దానియందున్న యవిద్యయు నశించిన జీవుఁడు లేఁడు. అట్లే సమష్టి

రూపమగు జగత్తును దాని యందలి మాయయు నశించిన ఈశ్వరుఁడును లేఁడు. మిగిలినది పరమాత్మ యొక్కటియే. జీవేశ్వర సంజ్ఞలు మాయా కల్పితములు. వాస్తవికములు గావు.

ఈ మాయ యెచ్చటినుండి వచ్చినదని యందురు. ఎచ్చటి నుండియును రాలేదు. ఇది యాత్మశక్తి. ఆత్మయందే యంతర్లీనమై యాత్మాభిన్నముగ నున్నది గుణసామ్యమే మాయ.

వ్యక్తిలోఁ దన నీడ యంతర్గతమై యున్నది, కాని యున్నట్లు కానరాదు. కాని వెలుతురులోనికి రాగనే యది తనకంటె భిన్నముగఁ దనకుఁగనఁబడును. అట్లే యాత్మయందాశక్తి యున్నది. సంకల్పమున బహిర్గత మగును. ఆ మాయ యందు అవరణ విక్షేపములను రెండు శక్తులు గలవు. అందావరణ శక్తి వస్తువు నిజరూపమును దెలియనీయకుండ కప్పును. అదియే మిథ్యా జ్ఞానమునకు మూలము. దానిని విక్షేపశక్తి పెంచును. జీవజగద్భేదము ఈ మాయ వలన వచ్చిన భేదముగాని వేరు భేదము లేదు. కావున సర్వము నాత్మయే గాని తద్భిన్నమగు వస్తువు మఱియొకటి లేదు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను వాక్యమున కిదియే యర్థము.

ఈ మాయను జయించుటకుఁ బూర్వులు మూఁడు మార్గములను గను గొనిరి. అందు మొదటిది కర్మమార్గము. ఇది ద్రవ్యైకసాధ్యము. శరీర శ్రమదాయకము. ఫలమును గోరక యీ కర్మముల నాచరింపవలెను. అట్లు చేసినను దీనివలన చిత్తశుద్ధి మాత్రమే కలుగును. అట్లు చిత్తశుద్ధి కలిగిన పిదప జ్ఞాన ముదయించును. తరువాత ముక్తిలభించును. కావున నీ మార్గము ప్రథమసోపానము మాత్రమే. రెండవది భక్తిమార్గము. ఇది ముఖ్యమైన మార్గమే. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అని జగద్గురు శంకరా చార్యుల వారు దీని కగ్రస్థాన మిచ్చిరి. కాని యా భక్తి నవవిధములుగ నున్నది. 'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్, అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ఏవం నవవిధాభక్తిః' అని భాగవతమునఁ గలదు. పై శ్లోకమును బోతన మహాకవి -

> తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
> ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తియున్ జింతనం
> బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
> జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

అని అనువదించెను. ఆత్మనివేదన మనుచోట నాత్మలో నెఱుకయున్ అని వివరించెను. అదియే యాత్మజ్ఞానము. ఆభక్తియే యనన్యభక్తి, కేవల భక్తి.

దానినే గీతయు బోధించుచున్నది. శంకరాచార్యులవారు కూడ, భక్తిమార్గ ముత్తమమయినదని యని చెప్పుచు, 'స్వస్వరూపానుసన్ధానం భక్తిరిత్యభిధీయతే' అని భక్తికి నిర్వచన మిచ్చిరి. మఱియును, 'అఙ్కోలం నిజ బీజసన్తతి రయస్కాన్తో పలం సూచికా సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహం సిన్ధుస్సరిద్వల్లభమ్ ; ప్రాప్నోతీహ యథా తథాపశుపతేః పాదారవిన్ద .... సా భక్తిరిత్యుచ్యతే' అని చెప్పినది. సముద్రములో కలిసి నామరూపములను విడనాడి సముద్రమయినట్లు భక్తుండు భగవంతుఁడొకఁడే కావలెనని చివరి యుపమానముచే సూచించెను. కావున ననన్య భక్తి ముఖ్యము. ఇంతకును ఆ భక్తిమోక్షము నీయంజాలదు. 'భక్తిర్జ్ఞానాయ కల్పతే' అను సిద్ధాంతము ప్రకారమా భక్తి జ్ఞానమును ప్రసాదించును. కావున పై రెండును ముక్తికి సాధనములు మాత్రమే. 'జ్ఞానాదేవ కైవల్యం' అను సిద్ధాంతమునుబట్టి జ్ఞానమే మోక్షము నిచ్చును. 'అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యన్తి జన్తవః, జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః, తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్' అని గీతయు జ్ఞానమునకే ప్రాధాన్యమిచ్చినది. కాని యా మార్గ మతిదుష్కరము. అందుచేఁ గర్మ భక్తిమార్గముల ననుసరించినవారే యధికముగాఁ గానవత్తురు. ఈ రెండింటి యందుఁ గూడ భక్తిమార్గము సుకరము. శీఘ్రఫలదాయి. కాన దానినే యెక్కువ మంది యాశ్రయించిరి.

ఈ మార్గమున, భక్తుఁడు దేవుఁడు ననువారిరువురు గలరు. ఆత్మ యొక్కటియే గదా ! ఇరువు రెచ్చట నుండి వచ్చిరి ? అని శంక కలుగుచున్నది. కాన నీ మార్గమున, సగుణరూపునిగా దేవుని భావించి యారాధింతురు. ఆరాధనకు లక్ష్యము కావలెను. సామాన్యుఁడు 'సర్వం విష్ణుమాయాజగత్' అని జగత్తును లక్ష్యముగా నుంచుకొనఁజాలఁడు. తాను ధ్యానించు దేవునకొక రూపమును గల్పించుకొనును. అందుచేతనే 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా' అను సిద్ధాంతము వచ్చినది. కల్పితరూపము కార్యకారి యగునా ? అను సందేహము వలదు. గమనింపుఁడు.

ప్రతి కఱ్ఱయందును అగ్ని యున్నది. కాని దాని [illegible]గాని రూపము గాని మనకుఁ దెలియదు. అందుచే ప్రాథమికావస్థ యందా యగ్ని నిర్గుణము, నిరాకారము గదా ! ఆ కఱ్ఱను మఱియొక కఱ్ఱతో మథనము గావించిన కొంతసేపునకు వేడిమి పుట్టును. అప్పుడా యగ్ని సగుణము నిరాకారము నైనది. మఱికొంతకాలము మథించిన మంట వచ్చును. అప్పుడా యగ్ని సగుణము సాకారమునైనది. ఇట్లావిర్భవించిన యగ్ని దహనపాచకాది క్రియల కత్యంతముపయుక్త మగుచున్నది గదా !

జలము దగ్గ్గి యున్నది. అది కంటికి కానరాదు. చేతికి దొరకదు. కాని దానిని దూరము నుండి క్రిందకుఁ ద్రోసిన యొక శక్తి వచ్చుచున్నది.

అదియే విద్యుచ్ఛక్తి. దానిని యంత్రాదు లందుంచిన కార్యకారి యగుచున్నది. అట్లే నిర్గుణము నిరాకారము నగు పరమాత్మ భూతవ్యాప్త మయినప్పుడు సగుణము నిరాకారము నగును. అదియే యొక విశిష్టవ్యక్తి నాశ్రయించిన సగుణము సాకారము నయి ప్రకృత క్రియోపయోగి యగును. ఆ పరమాత్మ సగుణరూపములే శివ కేశవాదులు. రామకృష్ణాద్యవతారములు.

అందుచేతనే గీతాచార్యుడు – 'అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్. ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామాత్మ మాయయా యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతిభారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్, పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే, అని తన రహస్యమును వెల్లడించెను. అట్టి రూపమునే భక్తులుపాసింతురు. ఆ సగుణరూపములను వారిచేష్టలను, కర్మములను భాగవతము వర్ణించి, అందలి మూలతత్త్వ మాత్మయే యని నిరూపించినది

భాగవతమున నాయా ఘట్టము లందు దాని నరయుదము –

నిగమములు వేయుఁజదివిన
సుగమంబులుగావు ముక్తిసుభగత్వంబల్
సుగమంబు భాగవత మను
నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!

అను పద్యమునుబట్టి భాగవతము మోక్షగ్రంథ మనుట నిర్వివాదము.

ఆధ్యాత్మికాది తాపత్రయంబు నడఁచి
పరమార్థభూతమై యఖిల సుఖదమై
సమస్తంబు కాకయు నయ్యై నుండు
వస్తు వెఱుఁగంగఁదగు భాగవతము నందు

ఈ పద్యమునుబట్టి భాగవతము నుండి తెలియఁదగు వస్తు వేదియో నిశ్చయింప వచ్చును. ఆ వస్తువెట్టిదనిన 'సమస్తంబు కాకయు నయ్యై నుండునదట! అది సగుణమా? లేక నిర్గుణమా? సగుణమైన సమస్తముకాక యెట్లుండును? నిర్గుణమైన సమస్త మెట్లగును? అట్టి వస్తువేది? అదియే యాత్మ. అది యన్నియు నగును. ఏదియును కాదు. ఇదియే యిందలి రహస్యము. ఇది యొక్కటి చాలును. భాగవత మద్వైతమునే నిరూపించుచున్న దనుటకుదాహరణము. గమనింపుఁడు –

మయాతత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
మత్థ్సాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః
నచ మత్థ్సానిభూతాని పశ్యమే యోగమైశ్వరమ్

అని గీతావచనము. దీని సారమును జూడుఁడు. ఇందు రెండు వాక్యము లున్నవి. 'నేనంతటను గలను. నాయం దన్నియు నున్నవి.' ఇది యొక వాక్యము. 'నే నే భూతమందును లేను, నాయందేవియును లేవు.' ఇది రెండవ వాక్యము. ఈ రెండును పరస్పర విరుద్ధములుగా నున్నవి. అదియే యా భగవానుని మహిమ యట! ఈ గీతావాక్యమందు వలె పై పద్య మందలి భావ మున్నది. అన్నియుఁ దానేనట! తానేదియు కాదట? ఇది యెట్లు.

మృత్తిక నుండి ఘటము లావిర్భవించినవి. కావున ఘటములకు మృత్తిక యుపాదాన కారణము. ఘటములు కార్యములు. కార్యములందు ముఖ్యకారణము గోచరింపవలెను. అట్లున్నదానినే యుపాదాన కారణమని యందురు. అనఁగా మృత్తికయే ఘటముగా మారినదని యర్థము. ఆ ఘటము నశించినంతనే మిగిలినది మృత్తికయే. దీనినే పరిణామవాద మని యందురు. 'ఉపాదాన సమసత్తాక కార్యాపత్తిః పరిణామః' అని దాని లక్షణము.

జలము నుండి తరంగ ముత్పన్నమైనది. దాని నుండి బుద్బుదాదు లేర్పడినవి. తరంగ బుద్బుదాదులు నశించిన మిగిలిన దొక్క జలమే.

సువర్ణము నుండి కటకకుండలాదు లేర్పడినవి. అవి కరగబడిన సువర్ణమే మిగులును గదా!

అట్లే బ్రహ్మము నుండి సర్వజగత్తు నావిర్భవించినది. జగత్తు నశించిన బ్రహ్మమే మిగులును. కావున ఘటములో మన్నున్నట్లు, మట్టిలో ఘటమున్నట్లు ఆత్మ జగమందంతటనున్నది. జగ మంతయు నాత్మలోనే యున్నది. ఇది మొదటి వాక్యమున కర్థము. సమస్తము నేనే అను భాగవత వాక్యమునకుఁ గూడ నిదియే యర్థము.

దీనికి మించి మఱియొకటి గలదు. మార్గమధ్యమున త్రాడు పడి యున్నది. చీకటి సమయము. గాలి మెల్లగా వీచుచుండ నాత్రాడు కదలు చున్నది. ఆ సమయమున నామార్గమునఁబోవువాఁ డొకఁడా త్రాటిని జూచి పామనుకొనెను. వానికి వెంటనే భయకంపాదులు జనించెను, ఇంతలో నామార్గమున వచ్చు మఱియొక వ్యక్తి వానిని జూచి, అయ్యా! అది పాము కాదు. త్రాడు సుమా! అని చెప్పెను. వెంటనే యా ముందువ్యక్తి వాని మాటలను నమ్మి దానిని పరిశీలించి నిజమును గ్రహించెను. భయకంపాదులు కూడ పోయినవి. ఆతఁడు తన దారిని తాను బోయెను. ఇచ్చట త్రాటి నుండి సర్పము జనించినదా? లేదు. జనింపనిది పోవుట యెట్లు? అదియునులేదు. ఉన్న దొక్క త్రాడే. సర్పాదికము భ్రాంతి కల్పితము. అట్లే అధిష్ఠానరూపమగు నాత్మ యొక్కటియే యున్నది. దాని యందు నీకు జగద్భ్రాంతి కలిగినది. కాని వాస్తవముగ ఆత్మయందు జగత్తులేదు. జగత్తునందాత్మయు లేదు.

రెండు లేవు. ఉన్నదొక్క ఆత్మయే. ఇదియే వివర్తవాదము. 'ఉపాదాన విషమసత్తాక కార్యాపత్తిః వివర్తః' అని దాని లక్షణము. ఈ వాదమే రెండవ వాక్యమున కర్థము. నేను దేనియందును లేను. నాయందేదియును లేదు. ఉన్నవాడను నేనొక్కడనే. జగత్తు భ్రాంతి కల్పితమే. మనఃకల్పితమే చిత్తస్పందనమే జగత్తు. నామరూపములచే వేరుగా నున్నట్లు గోచరించును గాని, నామరూప నాశనమున బ్రహ్మమే మిగులును. 'అస్తిభాతి ప్రియం నామరూపం చేత్యంశ పంచకం, అద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం' అనునది సిద్ధాంతము. దీనినే భాగవతము నుండి గ్రహింపఁదగునని పైపద్యమునకు తాత్పర్యము. పరిణామవాదము కంటె వివర్తవాదమే అద్వైతసారము.

భాగవతమున విదురుమైత్రేయ సంవాదము, కపిలదేవహూతి సంవాదము, ఈ రెండింటి యందును వర్ణింపఁబడిన దంతయు నద్వైతతత్త్వమే.

పంచమస్కంధ మందున్న పురంజనోపాఖ్యానమును గనుఁడు. కథా రూపమున నద్వైతతత్త్వమే యందు నిరూపింపఁబడినది.

పురంజనుఁడు. వాని సఖుఁ డవిజ్ఞాతుఁడు. వీరిలో మొదటివాఁడు జీవుఁడు. రెండవవాఁడు పరమాత్మ. జీవుఁడు సంసారబద్ధుఁడై సుఖదుఃఖముల ననుభవించి, రూపాంతరములను గ్రహించి భిన్నుఁడై పరమాత్మ ప్రబోధమున నాత్మయయి నాఁడు. అందలి వాక్యములను గమనింపుఁడు — 'ఇంతయు మామకీనమైన మాయం జేసి కల్పితంబయ్యె. చర్చింప మనము పూర్వమున హంసల మనియుఁ, బూని యెఱుఁగఁబలికితి. తెలియు. మరల రూపంబుఁజూఁడు.' నేనే నీవుగాని యన్యుండవు గావు. నీవే నేనుగాని యన్యుండనుగాను. ఇట్లెఱుంగుము. విద్వాంసులు మన యిద్దఱి యందు నంతరంబు వీక్షింపరు. పురుషుండు దన్నొక్కనినె యాదర్శ చక్షువు లందు భిన్నరూపులుగాఁ దలంచు చందంబున, మన యిద్దఱికి భేదంబు కలిగినయట్లుఁ దోచు.' ఇందద్వైతము దక్క మఱియొకటి గోచరింపదు.

'ద్వాసుపర్ణా సయుజౌ సఖాయౌ సమానంవృక్షం పరిషస్వజాతే, తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యః పరిచాకశీతి' అను శ్రుతియే యీ కథా రూపమున వివరింపఁబడినది.

'భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మ యందుఁ బరమాత్మను బొడఁగందురు.'

'అరూపుండై చిదాత్మకుండగు జీవుండు'

'విను వత్స ! నీవు నన్నడిగిన ప్రశ్నకు నుత్తరంబు, కేవల పరమంబను బ్రహ్మంబీ యఖిలంబునకు అగు నాధారహేతుభూతము సుమ్మి' అను వాక్యము లన్నియుఁ బరమాత్మ బోధకములే గదా !

ప్రహ్లాదచరిత్రమును గనుఁడు –

'దిక్కుల కాలముతో నేదిక్కున లేకుండు
గలుగు దిక్కుల మొదలై దిక్కు గలలేనివారికి
దిక్కెయ్యది యదియ నాకు దిక్కు మహాత్మా'
'ఇందుఁ గలఁడందులేఁడని సందేహము వలదు
చక్రి సర్వోపగతుండెందెందు వెదకిఁజూచిన
నందందే గలఁడు దానవాగ్రణి! వింటె ?'

అను నీవచనములు ఆత్మ, దేశకాలాద్యపరిచ్ఛిన్నుఁ డనియు, వెదకి జూచినఁ గాని లభింపఁ డనియు, సతఁడు సర్వగతుఁ డనియుఁ దెలుపుచున్నవి.

'తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముఁ దాఁబ్రతిష్ఠింపఁ దలంచి' యా పరమాత్మ నృసింహరూపుఁడై స్తంభము నుండి యావిర్భవించెనట.

స్త్రీనపుంసక పురుషమూర్తి యునుగాక
తిర్యగమరనరాది మూర్తి యునుగాక
కర్మగుణభేద సదసత్ప్రకాశిగాక
వెనుక నన్నియుఁ దానగు విభుఁ దంతు

ఈ పద్యము 'సర్వతః పాణిపాదంతత్ .... అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితం' అనునాత్మతత్త్వమును నిరూపించుచున్నది.

గజేంద్రమోక్షమున గజేంద్రుని ప్రార్థన యంతయు నద్వైతమే. 'ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై యెవ్వని యందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం బెవ్వఁ డనాదిమధ్య లయుఁ డెవ్వడు సర్వము తానయైనవాఁ డెవ్వఁడు' అను పద్య మొక్కటియే చాలును. 'యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తీతి తద్విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి' అను శ్రుతిని వివరించుచున్నదీ పద్యము. 'లోకంబులు లోకేశులు లోకస్థులు తెగిన తుదినలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతియై వెలుఁగు నట్టివాని నుతింతున్' అను పద్యము 'తమసః పరస్తాత్' అను శ్రుతి సారమే. అట్లే వామనచరితమున 'ఇది నాకు నెలవని, ఒంటివాఁడ నేను' అను పద్యములన్నియు నాత్మ నిరూపకములే.

కృష్ణావతారమున, దేవకీవసుదేవుల స్తోత్రము, దేవతాస్తవము, బ్రహ్మస్తవము, మున్నగునవి యన్నియు నాత్మను బోధించుచున్నవి. శ్రుతిగీతలు కూడ నట్టివే. ఇంత యేల భాగవత మంతయు నద్వైతసిద్ధాంత నిరూపకమే.

# పోతన భాగవతము - విశిష్టాద్వైతము

## ఎస్. ఎన్. సి. రఘునాథాచార్య

వ్యాస ప్రణీతమైన సంస్కృత మహాభాగవతమును ఆన్ధ్రీకరించిన పోత నార్యుడు శ్రీధరీయ వ్యాఖ్య ననుసరించియే తన అనువాదమును కొనసాగించె ననియు, అందును తత్త్వనిరూపణ ఘట్టములలో ఆ వ్యాఖ్యలో ప్రతిపాదితమైన అద్వైత సంప్రదాయమునే తు.చ. తప్పకుండ తన యనువాదములో ప్రదర్శించె ననియు ఒకవాదము లోకానువృత్తమై యున్నది. ఈ వాదము ఎంతవరకు నిజమని పరిశీలించు నవకాశము నాకు కొందరు మిత్రులు కల్పించిరి. ఇట్టి చర్చలలో ప్రత్యేకాభినివేశము లేకున్నను మిత్రప్రేరణచే క్షోదక్షమమగు నొక వ్యాసమును వ్రాయుట తటస్థించినది. అది వరంగల్లులో జరిగిన పోతన పంచ శతి మహోత్సవ సందర్భమున టి.టి. దేవస్థానం వారిచే ప్రకటితమైన 'పోతన భాగవత నీరాజనము' అను సంచికలో ప్రచురింపబడినది.

దశమ స్కంధములో తత్త్వనిరూపణ పరమగు శ్రుతిగీతలు అను ఘట్ట మున పోతనార్యుని అనువాదమును గమనింపగా అతడు శ్రీధరీయములోని నిరూపణమును అనుసరింపకపోగా తిరస్కరించెననియు, రామానుజ సిద్ధాంతము లోని విశిష్టాద్వైతచ్ఛాయలే ఈ అనువాదములో ప్రస్ఫుటముగ గోచరించు ననియు, ఆనా వ్యాసములో విపులీకరింపబడినది. ఈ దృష్టితోనే ఆన్ధ్రభాగవత ములోని మరికొన్ని ఘట్టములను పర్యవేక్షించుటకు ఇది మరియొక ప్రయత్నము.

1. కృష్ణావతార ఘట్టమున వసుదేవుడు తనకు పుత్రుడుగా జన్మించిన విష్ణుమూర్తిని స్తుతించు సందర్భమున గల ఈ క్రింది శ్లోకము శ్రీధరాచార్యుల వారిచే ప్రపంచ మిథ్యాత్వబోధన పరముగా వ్యాఖ్యాతమైనది.

> య ఆత్మనో దృశ్యగుణేషు సన్నితి వ్యవస్యతే స్వవ్యతిరేకతో బుధః
> వినానువాదం న చ తన్మనీషితం సమగ్యతస్త్యక్తముపాద దత్పుమాన్

దీనికి శ్రీధరాచార్యుల వారి అవతారికావాక్యము 'నన్వేతద్ధేతు చతుష్టయం ప్రపంచస్యా వస్తుత్వే ఘటతే తత్తు న సంభవతి/సత్త్వేన ప్రతీతేః – ఇత్యా

శంక్యాహ 'య ఆత్మనః' ఇతి/అని. ఇక చివరకు 'అతః అవస్తుత్వేన త్యక్తం బాధితమేతత్ (దేహాదికం) వస్తుబుధ్యా ఉపాదదత్ స్వీకుర్వన్ అబుధ ఇత్యర్థః' అని ముగింపబడినది. దీని భావమిది – వెనుకటి శ్లోకములో బ్రహ్మము అపరిచ్ఛిన్న మనుటకు నాల్గు హేతువులు చూపబడినవి. ఆ నాల్గును ప్రపంచము మిధ్య యనుకున్నపుడే కుదురును. కాని ప్రపంచమిథ్యాత్వమును చెప్పుట సంభవము కాదు. అది ఉన్నట్లు సర్వజన ప్రతీతి సిద్ధమగుట వలన – అను శంకకు ఈ శ్లోకము సమాధాన మిచ్చుచున్నది – అని యవతారిక. చివరకు అవస్తువగుటచేత గగనకుసుమాదుల వలె తుచ్ఛ మగుటచేత, త్యక్తమగు (బాధితమగు) ఈ దేహాది పదార్థమును ఉన్నదనుబుద్ధితో గ్రహించువాడు అజ్ఞానియే నని వ్యాఖ్య ముగింపబడినది.

ఇట్లు ప్రపంచమిథ్యాత్వమును శ్రీధరీయము తెలుపుచుండగా, పోతనార్యుడు మిథ్యాత్వమును చెప్పక, ఆత్మ వలన కలిగిన ప్రపంచమంతయు ఆత్మకంటె వేరె కాదనియు, అట్లనుకొనువారు మూఢు లనియు, విశ్వము నీవే ననియు, జగత్తునకు బ్రహ్మతాదాత్మ్యమును బోధించుచున్నట్లు శ్లోకమును అనువదించెను.

ఆత్మవలన కలిగి యమరు దేహాదుల
నాత్మకంటె వేరులవి యటంచు
దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ !
విశ్వమెల్ల నీవ వేఱులేదు

ఇందు నాల్గవ పాదములోని 'వేఱులేదు' అను దానికి వేఱు కాదు అని యర్థము. దేహాది ప్రపంచము ఆత్మకంటె వేరని తలంచువాడు మూఢతము డనుట వలన, వేరుకాదనియే గ్రహింపదగును. నీవేకలవు – విశ్వములేదు, అని చెప్పుట అద్వైతము. విశ్వము నీవే ననుట విశిష్టాద్వైతము.

2. భీష్ముడు నిర్యాణము చెందు సమయమున శ్రీకృష్ణుని స్తుతించు ఘట్టములో చివరి శ్లోకమిది —

తమిమ మహమజం శరీరభాజాం హృదిహృది ధిష్ఠిత మాత్మకల్పితానామ్
ప్రతిదృశమివ నైకధార్కమేకం సమధిగతోఽస్మి విధూతభేదమోహః

భీష్ముడు బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుడు. 'యస్యబ్రహ్మర్షయః పుణ్యాః నిత్యమాసన్ సభాసదః' అని భారతములో శాంతిపర్వమున కీర్తింపబడినట్లు అతని సభలో ఎందరో బ్రహ్మవేత్తలు అన్వయించి తమకు గల సంశయములను తీర్చుకొనుచుండిరి. అట్టి భీష్ముడు తాను భగవత్సాయుజ్యరూప మోక్షము నొందబోవుచు చెప్పిన మాట యిది. 'అహం తమిమం సమధిగతోస్మి' (నేను అట్టి ఈ పరమాత్మను చేరుకొంటిని) అను భీష్ముని వాక్యవిన్యాసము కర్మ కర్తృ

భావ భేదమునుబట్టి, మోక్ష మనగా భగవత్సాయుజ్యమే నని అతని హృద్గ తాశయమును స్ఫుటీకరించుచున్నది. జీవస్థితి పోయి బ్రహ్మస్వరూపముతో నైక్యము నొందుట మోక్షము కాదని తెలుచున్నది. దేహత్యాగానంతరమే తనకు మోక్షలబ్ధి యనుటచేత జీవన్ముక్తివాదము గూడ పరాస్తమగుచున్నది.

(తం) అను పూర్వపరామర్శి తచ్ఛబ్దముచే 'స్వసుఖముపగతే' ఇత్యాది పూర్వశ్లోకోక్త జగత్కారణీభూత బ్రహ్మము ననువదించి, (ఇమం) అను సామానాధికరణ్యముచే పురోవర్తి శ్రీకృష్ణపరమాత్మతో 'అతడీ కృష్ణుడే' నని అభేదము చెప్పబడినది, కాని నేనా పరమాత్మనే నని (సోఽహం – అని) ఈ భీష్ముడెచ్చటను చెప్పకుండుట గమనార్హము. 'ఆత్మకల్పితానాం శరీరభాజాం హ్రదిహృది ధిష్ఠతం' తనచే సృష్టింపబడిన దేవ మనుష్యాది శరీరములను పొందిన జీవులందరి హృదయకోశములలో అంతఃప్రవిష్టుడై నిత్యవాసము చేయువాడీతడే.

ఉద్ఘాట్య యోగకలయా హృదయాబ్జకోశం
ధన్యైశ్చిరాదపి యథారుచి గృహ్యమాణః

అని అప్పయ్యదీక్షితుల వారన్నట్లు ప్రతి జీవహృదయమున అంతర్యామి గతాను జ్ఞానైక స్వరూపముతో నున్నను, ఉపాసకుల రుచి భేదమునుబట్టి రామకృష్ణ నృసింహాది రూపభేదముచే సాక్షాత్కార మొసఁగువాడని దీని భావము. 'ప్రతి దృశ మివనైకధార్క్‌మేకం' ఇది దృష్టాంతము. సూర్యుడొకడేయైనను ప్రతి ప్రాణి దృష్టిలో 'రశ్మిభిరేషోఽ స్మిన్ ప్రతిష్ఠితః' అని శ్రుతిలో చెప్పబడినవిధముగా కిరణములద్వారా తత్తచ్చక్షురింద్రియాధిష్ఠాతగా నానాత్వము నొందినట్లు ఈ పరమాత్మయు ప్రతి ప్రాణి హృదయము నధిష్ఠించెనని భావము. 'విధూత భేద మోహః అహం' ఇంతకాలముగ వివిధ ప్రాపంచిక పదార్థము లందు మోహ మును కలిగియున్న నేను బ్రహ్మజ్ఞానముచే నట్టిమోహమును త్రెంచుకొని కొద్ది క్షణములలోనే ఆ పరమాత్మను చేరుకొనుచున్నానని ఈ శ్లోకమునకు స్వరసమగు తాత్పర్యము.

'ఏషబ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివహ్రదమ్' అని ఈ భీష్ముడే నిర్యాణసమయమున చెప్పినట్లు మహాభారతములో గల శ్లోక ఖండము గూడ ఈ భాగవత శ్లోకమునకు మధుర సంవాదము. దీనికి పోతనార్యుని అనువాద పద్య మిది –

ఒక సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కఁడై తోచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ
పకుడై యొప్పుచునుండు నట్టి హరినే ప్రార్థింతు శుద్ధుండనై

ఈ పద్యములో నొక తప్పున్నది. 'ప్రార్థింతును' అను క్రియాపద మిట సరి పడదు, ఇచట బీష్ముడు హరిని తనకు కావలెనని ప్రార్థించిన దేమియు లేదు. ఇట్లు స్తుతించుచు ఉత్తరక్షణములో నతడు బ్రహ్మసాయుజ్యమునేపొందు చున్నాడు. కనుక 'సమధిగతోఽస్మి' అను భాగవత శ్లోకములోని క్రియను గాని, 'ఏషబ్రహ్మ ప్రవిష్టోఽస్మి' అను భారత శ్లోకములోని క్రియను గాని, పరామర్శించి నపుడు 'అట్టి హరినే ప్రాపింతుశుద్ధుండనై' అనియే పోతనార్యుడు రచించి యుండునని ఉచితమగు సాధు పాఠము రసిక పాఠకుల హృదయమున స్ఫురించును. 'ప్రార్థింతు' నన్నది లేఖన ముద్రణాది ప్రమాదమున దొర్లిన అపపాఠము. ఇది ఏ పరిష్కర్తల దృష్టికి కూడ నందక తప్పించుకొని సుస్థిరత నొందిన దోషము. ఇట్టిదే శ్రుతిగీతలలోని గద్యము నందలి 'పరమాణు కారణవాదులైన కణ్వగౌతమాదులును' అను అపపాఠము పరమాణు కారణవాది కణ్వుడు కాడు, కణాదుడు. సరి. ఈ పాఠదోష విచారముప్రాసంగికము. ప్రకృతమునకు వత్తుము –

పై పద్యమందు గాని, భాగవత శ్లోకములో గాని, ముక్తుడగు భీష్మునకు పరబ్రహ్మముతో స్వరూపైక్యమును జెప్పుపదమో అసలు జీవస్వరూపము గూడ అవిద్యోపాధికల్పితమే కాని పరమార్థము కాదను పదమో, ఒక్కటియు కానరాదు. హరి సర్వజీవుల హృదయములలోను నానావిధరూపశాలియై యొప్పుననుట అతని ప్రభావాతిశయమునకు బోధకమగును గాని, అతని ఆ రూపము లన్నియు అవాస్తవములనియో, ఆ జీవులు గూడ నందతే ననియో తెలుపదు గదా.

ఆక్షేపము : స్వరూపైక్యమును బోధించు పదము లేకేమి ? 'సమధిగతోఽస్మి' అను పదమునకు ఐక్యము నొందితి నని యర్థమే. 'సం – ఇత్యేకీకారే' అని వైయాకరణు లందురు. కనుక భీష్ముడు పొందినది బ్రహ్మస్వరూపైక్యమునే. అంతేకాదు. దీని తరువాత మరొక శ్లోకములో 'సంపద్యమాన మాజ్ఞాయ – భీష్మంబ్రహ్మణి నిష్కళే' అని చెప్పబడిన బ్రహ్మసంపత్తి బ్రహ్మస్వరూపములో నైక్యము నొందుటయే. 'ఏషసంప్రసాదః అస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యతే' అను ఛాందోగ్యశ్రుతి యిందులకు ప్రమాణము. సూర్యదృష్టాంతముచే జీవులు పరబ్రహ్మకు ప్రతిబింబముల వలె కల్పితులే ననుట స్పష్టమే కదా ! శ్లోకములోని 'ఆత్మకల్పితానాం, అను పదము కూడ జీవులు కల్పితులే ననుచున్నది.

'సమాధానము : 'జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ' 'నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం' ఇత్యాది శ్రుతి ప్రమాణములు 'నత్వేవాహం జాతునాసం – నత్వం నేమే జనాధిపాః! నచైవ నభవిష్యామః ...' ఇత్యాది భగవద్గీతా వాక్యములు

బ్రహ్మము వలె జీవస్వరూపము గూడ నిత్యమే ననుచున్నవి. కనుక జీవస్థితి మోక్షములో గూడ నిత్యమే. శ్లోకములోని 'ఆత్మకల్పితానాం' అను పదము భ్రాంతికల్పితమైన రజ్జు సర్పము వంటిదే జీవస్వరూపము అను నర్థము నీయదు. తనచే తత్తచ్ఛరీర విశిష్టులుగా సృష్టింపడిన జీవులు – అను నర్థమునే బోధించును. ఈ యర్థమును గ్రహించియే పోతనార్యుడు 'నిజోత్పన్న జన్యకదంబంబుల' అని యనువదించెను. భ్రాంతి సిద్ధమైన సర్పము రజ్జు సముత్పన్నముకాదు గదా!

'సంపద్యమానా మాజ్ఞాయ – భీష్మంబ్రహ్మణి' అను పై శ్లోకము గూడ బ్రహ్మము వద్దకు చేరి అతనితో కలసిన భీష్ముడు అను అర్థమును బోధించును. ఆ కలియుట స్వరూపైక్యమని భ్రమపడరాదు. 'రామసుగ్రీవయోరైక్యం – దేవ్యేవం సమజాయత' అన్నట్లు వ్యక్తిత్వములో భేదముండగనే సన్నిహితు లగుటయే దీని యర్థము. మీరుదాహరించిన 'ఏష సంప్రసాదః ... ఉప సంపద్య .... ' ఇత్యాది శ్రుతి గూడ ముక్తునికి బ్రహ్మముతో స్వరూపైక్యమును బోధింపదు. ఏలయనగా ... దీని తరువాతి వాక్యమే ఆ బ్రహ్మ సంపత్తిని పొందిన ముక్తుడు తాను చేరిన బ్రహ్మలోకమున సంచరించుచు వివిధ దివ్యభోగముల ననుభవించునని తెలుపు చున్నది. ఆ శ్రుతివాక్య మిదిగో – 'సతత్ర పర్యేతి జక్షత్ క్రీడన్ రమమాణః ... ' ఇత్యాది స్వరూపైక్యము నొందినచో ఈ సంచారము దివ్యభోగానుభవము ఎట్లు సంభవించును ? కనుక ఇందు చెప్పబడిన బ్రహ్మ సాయుజ్యము ఐక్యము కాదు. తత్సామీప్యమున పరబ్రహ్మముతో సామ్యాపత్తియే.

ఇక సూర్యదృష్టాంతములోని పరమార్థము బింబ ప్రతిబింబ భావమును చెప్పుట కాదు. ఇచట జలమో దర్పణాదులో సూర్యునికి ప్రతిబింబ స్థానములుగా చెప్పబడలేదు. శ్లోకములోని 'ప్రతి దృశం' అను పదము గమనార్హము, చక్షురింద్రియమునకు సూర్యు డధిష్ఠాత. 'ఆదిత్యః చక్షుర్భూత్వా అక్షిణి ప్రావిశత్। అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్' ఇత్యాది ఐతరేయోపనిషద్వాక్యమును పరిశీలించిన వారికి ఈ సూర్యదృష్టాంతములోని స్వారస్యము అవగత మగును. ఈ ఉపనిషద్వాక్యములో చెప్పినట్లు, సూర్యుడు ఒకడే అయినను దర్శనశక్తిని కలిగించుటకై స్వాంశే భూతచక్షురింద్రియ రూపమున ఆయా ప్రాణుల నేత్ర గోళములలో ఏవిధము ప్రవేశించి ఇంద్రియాధిష్ఠాత యగుచున్నాడో అట్లే పరమాత్మయు నొకడే యైనను తత్తత్ప్రాణుల హృదయముల నధిష్ఠించి యుండి, యోగిజనులచే పరిదృశ్యమానమగు నానావిధానూన రూపములతో భాసించునని దృష్టదీదార్ష్టాంతికములకు గల సమన్వయము. 'ధిష్ఠితం' అను పదమును 'ప్రతిదృశం' అనుచోట గూడ అన్వయించుకొని 'ప్రతి జీవుని దృష్టి యందును

ప్రవిష్టుడై నానారూపములతో భాసించు సూర్యుని వలె' అని యర్థము చెప్ప వలెను.

కొందరిట్లాక్షేపింతురు – ఒకే వ్యక్తి నానారూపములను పొందుటయెట్లు ? ఇందులకు రెండే మార్గములు. ఏక ఘటము భిన్నమై నానాశకలములైనట్లు, బ్రహ్మ మొక్కటియే ముక్కలు ముక్కలై బహుత్వము నొందె ననుట ఒక పద్ధతి. నటు డొక్కడే కాలభేదముచే తనకు సహజము కాని కల్పిత నానారూప భేదము నొందినట్లు, బ్రహ్మము గూడ కల్పిత నానారూపభేదముల నొందెననుట రెండవపద్ధతి. ఇందు మొదటిపద్ధతి ప్రకృతమున సరిపడదు. నిరవయవము కనుకనే అఖండము సర్వవ్యాపియు నగు బ్రహ్మమునకు శకలరూప బహుత్వము అసంభావ్యము కదా। ఇక రెండవపద్ధతిలో కల్పిత నానారూపములు బ్రహ్మము నందు మిథ్యయే నని అద్వైతవాదమే నిలుచును. శ్లోకమునను అనువాదపద్యము నను ఈ భావమునే గ్రహింపదగును. ఇట సమాధాన మిది —

ఏకో విష్ణుర్మహద్భూతం – పృథగ్భూతా న్యనేకశః
త్రీన్ లోకాన్ వ్యాప్యభూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః

అను విష్ణుసహస్రనామాధ్యాయములోని శ్లోకము ఇచట అనుసంధేయము. విష్ణు వొక్కడే తనకంటె భిన్నములైన వివిధభూతములలోను త్రిలోకములలోను వ్యాపించి తత్తద్భూతాత్ముడైనాడు. ఇట్లొక్కడే నానారూపముల నొందుటకు తత్తదంతర్వ్యాప్తియే కారణమని దీని భావము గదా ! అయః పిండాదులలో అంతర్వ్యాప్తిచే అగ్నికి తత్తద్వస్తుతాదాత్మ్యము ఏర్పడినట్లు, బ్రహ్మమునకు అంతర్వ్యాప్తిచే తత్తన్నామరూపభాగిత్వ రూపవైవిధ్యము కలిగెనని దీని సారాంశము. సౌభరి మహర్షి యొక్కడే తన తపోమహిమచే అనేక శరీరములను సృష్టించుకొని తత్తదంతః ప్రవిష్టుడై ఏకకాలమున తత్తద్రూప శాలియై కర్మఫలములను అనుభవించెనను పౌరాణిక గాథ గూడ ఇచట దృష్టాంతము కాదగును. 'పృథగ్భూతాని .... వ్యాప్య' వ్యాప్తములైన ఆ నానాభూతములు కల్పితములే (అసత్యములే) యైనప్పుడు వానిలో వ్యాపించెనని చెప్పుట అత్యంతాసంగతమే గదా। సర్వ పదార్థములు పరమాత్మకు శరీరములని చెప్పి వాని యందతడు అంతర్వ్యాప్తిచే తత్తద్రూపుడైనాడని చెప్పు ఉపనిషత్తు లన్నియు ఇందులకు ప్రమాణములు.

సమంజసము ప్రామాణికము నగు ఈ యర్థము భాగవత శ్లోకమునను అనువాద ములోను సుజ్ఞేయమై, యుండగా, శ్రీధరీయమున గల శ్లోకవ్యాఖ్యను గమనింపుడు - 'సమ్యక్ అధిగతోఽస్మి సమ్యక్త్వ మాహవిధూత భేదమోహ ఇతి ! తదర్థం భేదస్యో పాధికత్వమాహ' ఆత్మకల్పితానాం ఇతి। నైకధా — అధిష్ఠానభేదాత్ అనేక వద్భ్రాంతమిత్యర్థః। తత్ర దృష్టాంతః ఏకమేవార్కం అనేక ప్రతీతమివేతి,

ఇందు వీరు స్వసిద్ధాంతాభిమత మగు నర్థమునే శ్లోకముపై నారోపించుట స్పష్ట మగుచున్నది. 'శరీరభాజాం హృదిధిష్ఠితం' జీవుల హృదయములలో నున్న వాడు ఆ పరమాత్మ యని చెప్పబడినది గాని, ఉపాధివశమున ఈ పరమాత్మే యే ఆ శరీరభాగి జీవుడయ్యె నని ఇచట చెప్పబడలేదే, పోతనార్యుడును శ్లోక ములో లేకున్నను 'నానావిధానూనరూపకుడై యొప్పచునుండును' అని చెప్పి 'ధిష్ఠిత' మను పదమును వ్యాఖ్యానించెను, వారి వారి హృదయములలో స్ఫురించు ఆ పరమాత్ముని నానారూపములను 'అనూన'ములని విశేషించెను. ఇది వెనుక మేము చెప్పినట్లు భగవన్మహిమాతిశయద్యోతనము.

3. పోతనార్యుడు శ్రీధరీయము ననుసరింపలేదను మా వాదమును ఆక్షే పింప దలంచిన కొందరు, అతడు విశిష్టాద్వైత వ్యాఖ్య యగు వీరరాఘవీయమును గూడ అనుసరింపలేదని ప్రతివాదమును చేయబూన వచ్చును. అది సరికాదు, ఈ వీరరాఘవాచార్యుడు పోతనార్యునికన్న అత్యంత మర్వాచీనుడు, ఇతని వ్యాఖ్య ప్రామాణికమే యైనను పోతనార్యుని కాలమునకు ఇదిలేదు గదా। కనుక దీని ననుసరించుట యను ప్రశ్నయే ఉదయింపదు.

భగవద్రామానుజుల శ్రీభాష్యముపై అప్రధృష్యమగు వ్యాఖ్యను వ్రాసిన శ్రుత ప్రకాశికాచార్యులు శ్రీభాగవతముపై శుకపక్షీయ మను ఒక అతి సంక్షిప్త వ్యాఖ్యను రచించిరి. బృందావనమున అనేక వ్యాఖ్యలతోపాటు అది కూడ ముద్రితము. అందలి వాక్యము లట్లే వీరరాఘవీయమున స్వీకరింపబడుటచే, ఆ శుకపక్షీయముపై మరికొంత విపులీకరణమే వీరరాఘవీయ మని స్పష్ట మగును. ఆ శుకపక్షీయము పోతనార్యునికి పూర్వమే అవతరించిన విశిష్టా ద్వైత వ్యాఖ్య. దాని సంవాదమును ఆంధ్రభాగవతము నందు అచ్చటచ్చట పరిశీలింపవలసి యుండును. ఆ యవసరము లేకుండనే మేము శ్రీభాష్యా దిగ్రంథములలోని విశిష్టాద్వైత సిద్ధాంత చ్ఛాయలు ఇందు కలవని సోదాహరణముగా పూర్వ వ్యాసములో నిరూపించి యున్నాము. ఇతడు ఆ శుకపక్షీయమును చూచి యుండు ననుటకు ఒక ఉదాహరణమును చూపుదుము.

4. శ్రుతిగీత ఘట్టమున ఈక్రింది శ్లోకము కలదు —

న యదిదమగ్ర ఆసన భవిష్యదతో నిధనాత్
అనుమిత మంకరాత్వయి విభాతి మృషైకరసే
అత ఉపమీయతే ద్రవిణజాతి వికల్పపథైః
వితథమనోవిలాసమృత మిత్యవయంత్యబుధాః

దీనికి శ్రీధరాచార్యు లిట్లు అవతారిక నిడిరి – 'తదేవం ప్రపంచ సత్యత్వే సాధకం నాస్తీత్యుక్తమ్, ఇదానీం అసత్వే సృష్టిప్రళయ శ్రుతయః' 'యతో వా

ఇమాని భూతాని జాయంతే' 'ఇత్యాద్యాః తన్మూలంచ అనుమానం ప్రమాణ మిత్యాహ' అని. అటుపై వ్యాఖ్యానమున వాచారంభణాది శ్రుతులను బట్టి ప్రపంచమిథ్యాత్వమును చెప్పి, చివరకు ఈ క్రింది అనుమాన ప్రమాణనిరూపణ ముతో ముగించిరి. 'అత్రైవం ప్రయోగః వివాదాధ్యాసితం నసత్, ఆద్యంతయోర విద్యమానత్వాత్ వికారిత్వాత్, దృశ్యత్వాద్వా, శుక్తిరజతాదివత్, ఇత్యన్వయే ఆత్మ వచ్చేతి వ్యతిరేక దృష్టాంతః' – దీని భావ మిది – వెనుకటి శ్లోకములలో ప్రపంచము సత్యమని సాధించుటకు ప్రమాణములు లేవని చెప్పబడెను. ఇప్పుడీ శ్లోకమున ప్రపంచము లేదనుటకు 'యతోవా ఇమాని, ఇత్యాది సృష్టి ప్రళయ బోధక శ్రుతులును, ఆ శ్రుతులకు అనుగ్రాహక తర్కరూపమగు అనుమానమును, ప్రమాణీకరింపబడుచున్నవి. ఎట్లనగా 'సదేవ సోమ్యే దమగ్రఆసీత్ ... ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' ఇత్యాది శ్రుతులు సృష్టికి పూర్వము సత్తగు బ్రహ్మము తప్ప ఏదియు లేదనుచున్నవి. 'నాసదాసీత్ నోసదాసీత్ తదానీం' ఇత్యాదులు ప్రళయానంతరము గూడ ఏదియు లేదనుచున్నవి. కాగా సృష్టి ప్రళయము లకు మధ్య మాత్రము ఉన్నట్లు కనబడుచున్న జగత్తంతయు (త్వయి మృషా విభాతి) మిథ్యాప్రతిభాసమే. వాస్తవముకాదు. కనుకనే శ్రుతి మృత్పిండాది దృష్టాంత త్రయమును చూపి వానియందు కల్పితములైన ఘట శరావాదులు అసత్యములై మృత్తికాదులే సత్యములైనట్లు బ్రహ్మమే సత్యమై తత్కల్పితమైన ప్రపంచమంతయు నసత్యమని తేల్చినది. ఈ శ్రుతి ప్రమాణ మొక్కటియే కాదు, అనుమాన ప్రమాణము గూడ ఇందులకు సాధకమే. ఎట్లనగా మధ్య కాలమున మాత్రమే యుండి సృష్టికి ఆద్యంతములలో లేనందునను వికారాస్పద మైనందునను, దృశ్య (జ్ఞానగ్రాహ్య) మైనందునను, ఈ ప్రపంచము మిథ్య. రజ్జువుపై ప్రతిభాసించిన సర్పాదులు ముత్యపుచిప్పపై ప్రతిభాసితమైన రజతము ఇచట అన్వయ దృష్టాంతము. సర్వకాలవర్తియై వికారాస్పదముకానిదై దృశ్యముగాక జ్ఞానమాత్రరూపమైనందున పరబ్రహ్మ యసత్యముకాదు. సత్యమే యని వ్యతిరేక దృష్టాంతము. ఇట్లు స్వప్నాదులవలె మనోమాత్రకల్పితమైనందున (వితథ మనోవిలాసం) ఆ ప్రపంచము మిథ్యయే నని తెలుచుండగా (అబుధాః) కొందరు అజ్ఞానులు (ఋతుమితి అవయంతి) ఇది సత్యమేనని నమ్ముచున్నారు. 'ఆదావన్తేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా' అని పంచదశిలో విద్యారణ్యులును ఇదే విషయమును తెలిపిరి.

ఇట్లీ శ్లోకములో మిథ్యావాదము ప్రామాణిక మని శ్రీధరాచార్యులు స్థాపింపదలచగా, దీనిని పోతనార్యుడు అనువదింపనేలేదు. వెనుకటి శ్లోకము నమవదించుచు తాను వ్రాసిన 'సత్తైన ప్రకృతి వలన నుత్పన్నంబైన' ఇత్యాది గద్యము నందే ఈ మిథ్యావాదము పూర్వపక్షము క్రిందనే జమకట్టి నిరసింప బడినందున తిరిగి దీని ననువదింప నవసరములేదని యాతడు భావించెను.

కాని శ్రీధరీయోక్త మగు అనుమాన ప్రమాణము నందు దోషమును జూపుచు ఒక వాక్యమును కూర్చెను. 'సత్యంబుబాధాయోగ్యంబు గావున నీకు విశేషణంబై యుండును' అన్నదే ఆ వాక్యము. ఇది ఏ మూలశ్లోకమునకును అనువాదముకాదు. విశిష్టాద్వైత వ్యాఖ్య యగు శుకపక్షీయములో నున్న మిథ్యావాద ఖండనయుక్తినే ఈ వాక్యములో పోతనార్యుడు కూర్చెను. ఆ వ్యాఖ్యలో నిట్లున్నది – ప్రతిపన్నోపాధౌ బాధాదర్శనాత్ ఇతిభావః' అని. ఇది వివరణాపేక్షమైన గంభీర వాక్యము. దీనిసారమే పైపోతనార్యుని వాక్యము.

సృష్టికి పూర్వము ప్రళయానంతరము లేనంతమాత్రమున ఈ మధ్య కాలమున గూడ ప్రపంచము లేదనుట సరికాదు. ఒక ప్రదేశమునసో ఒక కాలముననో ఉన్న వస్తువు దేశాంతరమున కాలాంతరమున లేకపోయినచో మిథ్యకాదు. గదిలోనున్న కుండ వరండాలో లేనిచో మిథ్య యగునా ? నిన్న లేని వస్తువు నేడు పుట్టినచో మిథ్య యగునా? ఆయా ప్రదేశ మందును కాలమందును వర్తమానము లైన ఆ ఘట పటాది వస్తువులు రజ్జుసర్పాదుల వంటివి కావు. ఒక ప్రదేశమున ఒక కాలమున ఉన్నట్లు భాసించిన వస్తువు అదే ప్రదేశమున ఆ కాలమందే లేనట్లు నిశ్చయాత్మకబాధ జ్ఞానము కలిగిన యెడల అపుడా వస్తువు మిథ్య యనబడును. శుక్తియందు భావించిన రజతము రజ్జువున భాసించిన సర్పాదులు ఇట్టివి. అవి యట్లునిర్దుష్ట ప్రబలప్రమాణబాధితము లగుటచేతనే మిథ్య యనబడినవి. అట్లు ఘట పటాదులు తాము ఉన్న దేశ కాలముల యందు ప్రమాణాంతర బాధితము లగుటలేదు. ప్రతిపన్నోపాధి యనగా తత్తద్వస్తువులు భాసించిన దేశకాలములు. ఆ దేశకాలములోనే అవి లేనట్లు బాధ జ్ఞానము కలుగుట ప్రతిపన్నోపాధిబాధితత్వ మనబడును. అట్లు బాధితమైనది మిథ్య యనుట సర్వానుభవసిద్ధము. ప్రపంచ మెప్పుడును తాను ఉన్నకాలమున ప్రమాణాంతర బాధితము కానందున మిథ్య యనరాదని, శుకపక్షీయ వాక్యమునకు భావము.

ఆ వాక్యములోని సారవంతమగు యుక్తినే 'సత్యంబు బాధాయోగ్యంబు గావున .. ' అని పోతనార్యుడనువదించెను. 'బాధా యోగ్యంబు కావున' తాను ఉన్న కాలమందు ఏ ప్రమాణముచేతను నాస్తియని బాధితము కానందున 'సత్యము' ఈ ప్రపంచము వాస్తవమే, మిథ్య కాదు. ఇట్లు సత్యమైన ప్రపంచము నీకు విశేషణమై (అంశమై) యుండును – అని పోతనవాక్యమున కర్థము. ఇట్లు మిథ్యావాదమును శుకపక్షీయోక్తితో ఖండించి, విశిష్టాద్వైతమునే పోతనార్యుడంగీకరించినట్లు స్పష్టమే కదా! ఇంతవరకు శ్రీధరీయమునకు విరుద్ధముగా అనువదించిన కొన్ని ఘట్టములను వివరించితిని. కాని పోతనార్యునిచే శ్రీధరీయానుసారము కూర్పబడిన ఘట్టములున్నట్లు కొందరు వ్యాసకర్తలు ప్రకటించిరి.

అది ఎంతవరకు నిజమో ఇటుపై పరిశీలింతము. ఆ విమర్శకులు పంచమ స్కంధమున జడభరతుడు రహూగణునికి చేసిన తత్త్వోపదేశములోని కొన్ని గద్య పద్యములను చూపి అవి అద్వైతప్రతిపాదకములైనట్లు తెలుపుచున్నారు. పంచమస్కంధము గంగన ప్రణీతమైనట్లును, షష్ఠస్కంధము సింగన ప్రణీత మైనట్లును, స్కంధాద్యంత పద్యములచేతను గద్యములచేతను స్పష్టముగా తెలియుటచే, అవి పోతనార్య ప్రణీతములు కావు గనుక వానిపై విచార మిచట మాకనవసరమే. విమర్శకులు చూపిన ఆయా ఘట్టములలోని గద్యపద్యములు నిర్గుణబ్రహ్మతత్త్వమును జగన్మిథ్యాత్వమును తెలుపుచు అద్వైత సంప్రదాయ పరముగానే కానవచ్చుచున్నవి. కాని ఆ ఘట్టములలో వాని మూలమగు సంస్కృతభాగవత శ్లోకములను, అచటి శ్రీధరీయమును, తదనువాద పద్యములను పరిశీలించినపుడు, ఈ రచయిత లిద్దరును శ్రీధరీయోక్తమగు అద్వైతసంప్రదాయమును గాని, శ్లోకార్థమును గాని బొత్తిగా నాకళింపచేసికొనలేక తత్తరపాటు పడిరని విజ్ఞులు స్పష్టముగా గ్రహింపగలరు. దిఙ్మాత్రముగా నట్టి స్థలములను ఒకటి రెండు ఎత్తి చూపెదము. గమనింపుడు –

పంచమస్కంధమున 12 వ అధ్యాయమున ఈ క్రింది శ్లోకములు వీనిపై శ్రీధరీయ వ్యాఖ్యయు ఇట్లున్నవి –

యదాక్షితావేవచరాచరస్య విదామనిష్ఠాం ప్రభవంచ నిత్యమ్
తన్నామతోఽన్యత్ వ్యవహారమూలం నిరూప్యతాం సత్క్రియయానుమేయమ్

(శ్రీధరీయము) నచోత్తరోత్తరావయవిభావః (అవయవభావః) పూర్వ పూర్వావయవానాం భవేదితి వాచ్యమ్। తేషామప్యవిరూపణాదిత్యాశయేనాహ 'యదేతి'. నిష్ఠాం – నాశం, ప్రభవం – ఉత్పత్తిం, విదామ – విద్మః, తత్ – తదాక్షితే రన్యస్య వికారస్యాభావాత్, నామమాత్రాదన్యత్ వికారస్య మూలం కారణం అర్థక్రియ యాసత్ ఇత్యనుమేయం నిరూప్యతామ్। నకిమపీత్యర్థః. తథాచ శ్రుతిః 'వాచారంభణం ... మృత్తికేత్యేవ సత్య' మితి। దీని భావ మిది – పరమాణ్వాది రూపములైన ఆయా అవయములే కలసినప్పుడు ఉత్తరోత్తరావయవిరూపము నొందవచ్చును గదా! కనుక ఆ పరమాణ్వాది అవయవములు తదారబ్ధావయవి పదార్థములు సత్యములే కావచ్చును కదా! అని భావింపరాదు. అసలా అవయవావయవి పదార్థము లన్నియు దుర్నిరూపములే' కావున మిథ్య యను విషయమీ శ్లోకములలో చెప్పబడుచున్నది. 'యదేతి, చరాచరాత్మకమైన సర్వపదార్థము ఈ మట్టినుండియే పుట్టి అందే నశించుచున్నది కదా! ఆ మట్టికే లోకవ్యవహారమునకై ఘటపటాది నామధేయములు కల్పింపబడినవి. కాని మట్టి కంటె వేరువస్తువేదియు (సత్–) సత్యభిన్నముగా లేదు గదా! క్రియా

విశేషమును బట్టి ఇది మృద్భిన్న వస్తువని సత్యమని అనుటకు మట్టికంటె వేరేదియు నచట లేదే! ఛాందోగ్యములోని వాచారంభణము మృద్దృష్టాంతముచే ఘటాది సర్వప్రపంచమును మిథ్య యని సాధించుచుండగా దీనికి అనువాదముగా గంగన వ్రాసిన గద్య ఖండమును చూడుడు –

'ఈ స్థావరజంగమములకు నివాసస్థానంబు వసుంధర యైన చందంబున సత్క్రియలచే నెరుంగదగిన జగత్కారణంబైన తత్త్వంబు నెరింగించెద' – ఇచట శ్లోకములోని 'నిస్థాం' 'ప్రభవం' అను పదములను ఉత్పత్తి వినాశ పరముగా జెప్పక నివాసస్థానమని యనువదించుట 'సత్' అను పదమును విభజించి సత్యమైనది వేరు కలదా యని అర్థము చెప్పక సత్కర్మలచే తెలిసికొనదగిన జగత్కారణతత్త్వ మెరింగించెద ననుట పూర్తిగా శ్రీధరీయ విరుద్ధానువాదమే.

ఇక దీనిపైనున్న మరొక శ్లోకము చూడుడు –

ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్త మసన్నిధానాత్ పరమాణవోయే
అవిద్యయా మనసాకల్పితాస్తే యేషాం సమూహేన కృతోవిశేషః
శ్రీధరీయమ్

తర్హిక్షితేస్సత్యతాస్యాత్, తత్రాహ – ఏవ మితి। ఏవం క్షితిశబ్దస్యాపివృత్తం – వర్తనం, అర్థం వినైవనిరుక్తమ్ ... తదపి మిథ్యాత్వేన నిరుక్త మిత్యర్థః। కుతః? అసత్యు సూక్ష్మేషు పరమాణుషు స్వకారణభూతేషు నిధానాత్ విలయాత్ అతః పరమాణువ్యతిరేకేణ క్షితిర్నాస్తీత్యర్థః పరమాణ వస్తర్హిసత్యాస్స్యుః తత్రాహ తే మనసాకార్యానుపపత్త్యావాదిభిః కల్పితాః ... తథాపితే సత్యాస్స్యుః న అవిద్యయా ప్రపంచస్య భగవన్మాయా విలసితత్వాత్ అజ్ఞానేన, కల్పితాః – ఇక దీనిపై నింకొక శ్లోకము –

ఏవం కృశం స్థూలమణుర్బృహద్యత్ అసచ్చసజ్జీవమజీవ మన్యత్
ద్రవ్యస్వభావాశయ కాలనామ్నా బుద్ధ్యా జయావేహి కృతంద్వితీయమ్
– శ్రీధరీయమ్

ఏవమన్యదపి కృశత్వాదికం కర్మబుద్ధ్యా ప్రతీతం ద్వితీయం – ద్వైతం ద్రవ్యాది నామ్నా ఉపలక్షితయా అజయా మాయయా కృతమవేహి। – ఈ రెండు శ్లోకములపై శ్రీధరాచార్యుల వారి భావమిది. వెనుక చెప్పినట్లు మట్టిలోపుట్టి దానిలోనే లయము నొందు వస్తువులు మిథ్యయైనను ఆ భూమి సత్యము కావచ్చును కదా। అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది. క్షితి శబ్దమునకు అర్థమైన భూమి గూడ మిథ్య యనియే నిర్ణయము. ఏల యనగా అది గూడ అసత్తు లనబడు సూక్ష్మపరమాణువులలో లయమగుచున్నది గదా। కనుక

పరమాణుభిన్నమగు భూమి యనునది లేదు. ఇక ఆ పరమాణువులు సత్యమను కొందురేమో। కాదు. అవికూడ తార్కికాదులచే తమ మనస్సుతో నూహించి కల్పింపబడినవే. అవయవములు లేనిది అవయవి పుట్టదను యుక్తిచే వారు అణువులను కల్పించిరి. ప్రపంచ మంతయు భగవదవిద్యాకల్పితము కాగా పరమాణువులను గూర్చి వేరే చెప్పవలెనా? అవియు నంతే. ఇంతెందులకు కృశము స్థూలము. అణువు మహత్తు, అసత్తు సత్తు, జీవము అజీవము, మొదలగు పేర్లు గల వస్తువు లన్నియు (ద్వితీయం) మాయాకల్పితములగుటచే మిథ్యయే. అని యిట్లు శ్రీధరాచార్యులు ఈ శ్లోకముల యందు క్షిత్యాది దృష్టాంతముతో సర్వమిథ్యాత్వ మునుసాధింపగా గంగన వ్రాసిన ఈ శ్లోకానువాద వాక్యమును చూడుడు — 'పరమాణు సముదాయంబీ ధరిత్రి యైన చందంబున, అవిద్యా మనంబులచేతం గల్పితంబైన కృశస్థూలబృహదణు సదసజ్జీవాజీవ ద్రవ్యస్వభావాశయ కాల నామ బుద్ధిరూపంబైన మాయచేత జగత్తు రెండవదియై కల్పింపబడియె' — శ్లోకములనో శ్రీధరీయమునో అరము చేసికొనలేక అయోమయ పరిస్థితిలో పడి గంగన శ్లోకములోని పదము లన్నింటిని తన గద్యములోనికి దించి వాక్యము నేదోవిధముగా పూరించినట్లు కనబడుచున్నది. 'అవిద్యామానంబులచే కల్పితంబైన ... బుద్ధిరూపంబైన' ఇవి దేనికి విశేషణములు? మాయకు విశేషణములా? జగత్తునకా? అవిద్యామాయలు వేరా? లేక ఏకమా? వేరన్నచో, జగత్తు ఏతదుభయకల్పిత మని గద్యమున కర్థమా శ్లోకమున చెప్పబడినది? ఇట్లనేక సందేహముల కాస్పదమై ఈ గద్యము అనన్వితముగ నున్నది. వాక్యవిన్యాసము గూడ సరిగాలేదు. 'పరమాణు సముదాయము ధరిత్రి యైన చందంబున' ఇది ఉపమానము. ... మాయచేతజగత్తు కల్పింపం బడియె' ఇది ఉపమేయము. ఒకటి కర్తరి ప్రయోగ వాక్యము, మరొకటిప కర్మణి ప్రయోగవాక్యము. వాక్యములలో సారూప్యము లేదు' సరి. ఇక దీనిపై నింకొక శ్లోకము —

> జ్ఞానం విశుద్ధం పరమార్థమేకం అనంతరం త్వబహిర్బ్రహ్మసత్యమ్
> ప్రత్యక్ప్రశాంతం భగవచ్ఛబ్దసంజ్ఞం యద్వాసుదేవం కవయోవదంతి
> — శ్రీధరీయం

తర్హికింసత్యమ్? తదాహ 'జ్ఞాన' మితి జ్ఞానం సత్యం. వ్యావహారిక సత్యత్వం వ్యావర్తయతి — పరమార్థమితి! వృత్తిజ్ఞాన వ్యవచ్ఛేదార్థా ని షడ్విశేషణాని! విశుద్ధం — తత్తు (వృత్తిజ్ఞా నంతు) అవిద్యకం! ఏకం — తత్తు నానా రూపం. అనంతరం అబహిః బాహ్యాభ్యంతర శూన్యం' తత్తు విపరీతం బ్రహ్మ — పరిపూర్ణం — తత్తు పరిచ్ఛిన్నం. ప్రత్యక్ — తత్తు విషయాకారమ్! ఏవం స్వరూపజ్ఞానం సత్య మిత్యుక్తం' ఇత్యాది. దీని భావ మిది — సర్వము మిథ్య యన్నచో, మరి సత్యమేది? అనగా జ్ఞాన మొక్కటియే సత్యమని ఇందు

చెప్పబడుచున్నది. అజ్ఞానము గూడ వృత్తిజ్ఞానము గాదు. అనగా మాయా వచ్ఛిన్న చైతన్యమో అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమో విషయావచ్ఛిన్న చైతన్యమో, కాదు - అని ఆరు విశేషణములతో తెలుపబడుచున్నది. పరమాత్మ స్వరూపమగు జ్ఞానమే పరమార్థ సత్యము. వృత్తి జ్ఞానము లన్నియు వ్యావహారిక సత్యములే. అది విశుద్ధము. ఇవి అవిద్యామలినములు. అది ఏకము. ఇవి నానారూపములు. అది బహిరంతః ప్రదేశశూన్యము. ఇవి బహిరంతః ప్రదేశము కలవి. అది పరిపూర్ణము. ఇవి పరిమితములు. అది స్వప్రకాశము. ఇవి విషయ ప్రకాశములు. అది నిర్వికారము. ఇవి సవికారములు, ఇట్లు భగవచ్ఛబ్దవాచ్యమైన వాసుదేవ పరబ్రహ్మమే పరమార్థమని శ్రీధరీయ వివరణము తెలుపుచుండగా దీని అనువాద గద్యమును గమనింపుడు – 'బాహ్యాభ్యంతరంబులం గలిగి, స్వప్రకాశంబై భగవచ్ఛబ్ద వాచ్యంబు విశుద్ధంబు, బరమార్థంబు జ్ఞానరూపంబైన బ్రహ్మం బొకటియె సత్యంబు. జగత్తు సత్యంబగు' ఇట్టు గద్యము ననువదించిన గంగన అద్వైతసంప్రదాయములోని లోతుపాతులను ఆకళింపుచేసికొనకున్నను 'బ్రహ్మ' సత్యం – జగన్మిథ్య' యని మాత్రము గ్రహించినందులకు అభినందనీయుడు. శ్రీధరీయమున, శ్లోకములోని జ్ఞాన పదమును విశేష్యముగా జేసి, పరమార్థ – విశుద్ధ – బ్రహ్మాది విశేషణములు వ్యావృత్తి సాధకములై సార్థకము లనబడినవి. ఇతని అనువాదమున బ్రహ్మపదము విశేష్యమైనది. సరే. ఇది యెట్లున్నను 'బాహ్యాభ్యంతరంబులం గలిగి' అను విశేషణమున కేమర్థమో, ఆన్ధ్రభాగవతమున అద్వైతపరముగా నభిమానించు సహృదయులో ఆ గంగనయే చెప్పవలెను. శ్లోకమునను శ్రీధరీయమునను బాహ్యాభ్యంతర శూన్యము బ్రహ్మ మనబడుచుండగా ఈ యనువాదమున కర్థమేమి ? అద్వైతబ్రహ్మమునకు బాహ్యాభ్యంతరము కలవా ? లేవా ? లేక ఇతర పదార్థముల యొక్క బాహ్యాభ్యంతరములలో తాను కలిగి (వ్యాపించి) యున్నాడని యర్థమా ? బ్రహ్మమే పరమార్థముగాని, ఆ ఇతర పదార్థము లేవియు లేవని ఈ శ్లోకము చెప్పుచుండగా, ఇక వానిలో వ్యాపించుటకు ప్రసక్తి యెక్కడిది ? ఇది శ్రీధరీయమునకు అనువాద మెట్లగును ? కాదు కాదు. ఇది అచ్చుతప్పేమో ! 'బాహ్యాభ్యంతరంబులం దొలగి' అని మార్చవలెనందురా ! సహృదయ పరిష్కర్త లెందరో ఉండి అకాడమీ వారి ముద్రణములో గూడ సవరింపకపోయిరేమి ? ఇట్టి అయోమయాద్వైత ప్రతిపాదకమగు రచనలు పట్టుకొని, మా అద్వైతమిందు కలదని చెప్పుకొనుట గూడ ఆ సిద్ధాంతమునకు అప్రతిష్ఠాకరమే కదా !

6. ఇక సంస్కృతభాగవత ప్రథమ శ్లోకము ననువదించుటలోనే పోతనార్యుడు శ్రీధరీయము ననుసరించినట్లు కనబడునని కొందరు విమర్శకులు భావించుచున్నారు. అదియు సరికాదని జాగ్రత్తగా ప్రతిపదము పరిశీలించు వారికి సుజ్ఞేయ మగును.

జన్మాద్యస్య యతోన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః పుమాన్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యంతి యత్సూరయః
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేన సదా నిరస్త కుహకం సత్యం పరం ధీమహి

ఇది శ్లోకము. దీనికి ఆన్ధ్రానువాదము సీసపద్యము.

విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని
వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యము లందభిజ్ఞుఁడై
తాన రాజగుచు చిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్గావించె
నెవ్వడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీటఁగాచాదుల
నన్యోన్యబుద్ధి తానడరునట్లు

త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగితోచు స్వప్రభానిరస్త
కుహకుడెవ్వఁ డతని గోరి చింతించెద
ననఘు సత్యపరుని ననుదినంబు

ఈ మొదటి శ్లోకము నన్వయించుకొనుటలోనే పోతనార్యుడు శ్రీధరీయము నతిక్రమించినట్లు స్పష్టముగా కనబడును. 'ముహ్యంతి యత్సూరయః, తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే' – ఏ వేదార్థము నెరుంగుటలో విజ్ఞానవంతులు గూడ వ్యామోహము నొందిరో, అట్టి వేదమును చతుర్ముఖునికి ఉపదేశించిన వాడు పరమాత్మ అని శ్రీధరాచార్యుల వారు అర్థమును తెలిపిరి. ఇట్లుసూరులకు గూడ వేదార్థము దుర్జ్ఞేయమై వ్యామోహజనక మని వారు వివరింపగా 'ముహ్యంతి యత్సూరయః' అను వాక్యమును పరమాత్మపరముగా నన్వయించి 'బుధులు మోహింతు రెవ్వనికి' అని పోతన యనువదించెను. ఇది శుకపక్షీయ – వీర రాఘవీయ వ్యాఖ్యలలో 'యద్వా' అని వివరింపబడిన అన్వయమునకు సరియగు అనువాదము. 'సూరయః ... యం పరమాత్మానం నారాయణం ప్రతిముహ్యంతి – తన్నిరతిశయ సౌందర్యాది దర్శనేన సంభ్రమచిత్తాభవంతి' అని విశిష్టాద్వైత వ్యాఖ్యాన వాక్యము.

ఇక 'తేజోవారి మృదాం యథా వినిమయః యత్ర త్రిసర్గోమృషా' అను శ్లోక ఖండమునకు అతనిచే రచింపబడిన 'ఎండమావుల నీట కాచాదులు నన్యోన్య బుద్ధి తానడరునట్లు, త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము భంగితోచు ...'

అను అనువాదము శ్రీధరీయానుసారి కాదా! ప్రపంచ మిథ్యాత్వమును స్పష్టముగ బోధించుటలేదా! అని వీరి ప్రధానాక్షేపము. ఇచట ప్రపంచ మిథ్యాత్వ సూచనమే లేదు. 'త్రిగుణ – సృష్టి – యెందు దీపించి' అను పదము లిచట గమనింప దగినవి. విశ్వజన్మస్థితి విలయంబులను వెనుక మొదటపాదముననే చెప్పి, తిరిగి త్రిగుణసృష్టి యనుటచే, ఇది ఆ ప్రపంచ సృష్టికంటె వేరని గ్రహింపవలెను. లేనిచో పునరుక్తి యపరిహార్యము. మరియు శుక్తి రజతము రజ్జు సర్పము మొదలగు స్థలములలో రజతమునకు గాని సర్పమునకు గాని కేవల ప్రతిభాసమే తప్ప, కొత్తగా పుట్టుట యుండదు. కావున దీపించి యను పదమునకు రజతాదుల వలె లేనివస్తువు ప్రతిభాసించియని యర్థమైనపుడు, త్రిగుణసృష్టి పదము అన్వయింపదు. కనుక త్రిగుణసృష్టి సత్యమే. మరి, ఆ త్రిగుణసృష్టి యేది? అది సత్యము భంగితోచుట కర్థమేమి? ఎండమావులను దృష్టాంతమున కర్థమేమి? అందురా! వినుడు. పరమాత్మ యందు త్రిగుణ సృష్టి సత్యముకాదని గదా పద్యమునందున్నది. త్రిగుణాతీతుడగు పరమాత్మ త్రిగుణమయ దేహాదుల యందు అంతఃప్రవిష్టుడైనను గుణత్రయ కార్యములగు శోకమోహాదులు అతనియందు ప్రసరింపవు గనుక నసత్యములని యర్థము. జీవుని యందు త్రిగుణ కార్యములు శోకమోహాదులెట్లు సంభవమో అట్లు ఈశ్వరుని యందు కాదని తాత్పర్యము. రామకృష్ణాద్యవతారము లందు 'ఆత్మానం మానుషం మన్యే' 'అహంవో బాంధవో జాతః' అని మనుష్యభావనను నటించినపుడు శోకమోహాది త్రిగుణ కార్యములు ఆయనకు కలుగు చున్నట్లు పామరులకు (సత్యము భంగి) తోచును. కాని యది సత్యము కాదని గ్రహింప దగును. ఎండమావులలో తోచిన నీరు అసత్యమైనట్లు అనుట ప్రకృతమునకు దృష్టాంతము.

శ్లోకములోని 'త్రిసర్గ' పదమునకు త్రిగుణసృష్టి యని గాక, తేజోవారి మృత్తులని శుకపక్షీయ వీరరాఘవీయములలో అర్థము చెప్పబడినను, 'యత్ర మృషా' అనుదానికి తాత్పర్యము మాత్రము పైవిధముగనే వ్రాయబడియున్న ది. కనుక విశ్వమిథ్యాత్వ నిరూపణమున కిచట యవకాశము లేదు. ఈ త్రిగుణ సృష్టి వేరు. మొదటిపాదములోని విశ్వసృష్టి వేరు. త్రిగుణములచే కలుగు శోకమోహాదులు జీవునిలో సత్యములు కాని, ఈశ్వరునిలోనివి యుండవని చెప్పుటయే ఇచట ముఖ్యాంశము. తస్యాపి తదంతః ప్రవేశ ప్రయుక్త దోషాశ్రయత్వం స్యాత్ – అత ఆహ 'యత్రత్రిసర్గోమృషేతి' మృషా – మిథ్యా భగవంతం నస్పృశతీత్యర్థం' అను శుకపక్షీయ వీరరాఘవీయములోని వాక్య విన్యాసము ఈభావమునే తెలిపినది. పోతన యనువాదములోని సారాంశ మిదియే. ఇట్లు కానిచో పునరుక్తి అనన్వయాది దోషములు అనివార్యములు.

8. ఉపనిషత్తులలో పరబ్రహ్మమును నిర్గుణమని సగుణమని అశరీర మని సశరీరమని నిష్క్రియమని క్రియావంతమని పరస్పరవిరుద్ధముగా నిరూపించుట కలదు. ఆ విరోధమును పరిహరించుటకై అద్వైతమతస్థులు నిర్గుణము అశరీరము నిష్క్రియము ననుట పరమార్థమని. అతనికి గుణములు శరీరములు క్రియలు అవిద్యాకల్పితములు గనుక అవాస్తవమని, అపచ్ఛేదాది మీమాంసా న్యాయములను బట్టి నిరూపింతురు. విశిష్టాద్వైతులు వానికి విరోధమే లేదని చెప్పి, భిన్నభిన్న విషయములుగా సమర్థింతురు. నిర్గుణపదమునకు హేయ గుణరహితుడని యర్థము. సగుణ పదమునకు కల్యాణగుణశాలి యని యర్థము. అశరీర శబ్దమునకు ప్రాకృత శరీరహీనుడని, అతనికి సశరీరత్వము అప్రాకృత శరీర విశిష్టు డగుటచేత నని, అంతేకాని ఈ గుణశరీరాదులు మిథ్యకావని చెప్పుదురు.

పోతనార్యుడు కూడ ఈ సమన్వయ పద్ధతినే అవలంబించె ననుటకు తృతీయ స్కంధములోని కపిలదేవహూతి సంవాదమున గల ఈ క్రింది పద్య ఖండములను ఉదాహరింపవచ్చును. కపిలుడు దేవహూతికి ఉపదేశించిన సాత్త్వికభక్తిని వివరించుచు 'హేయగుణ రహితుడనగల నాయందలి భక్తి' అని ఒక చోటను, 'గురుతరానేక కల్యాణ గుణవిశిష్టుడనగ నొప్పిన నను పొందుము' అని మరియొకచోటను పోతనార్యుడు చెప్పియున్నాడు. ఇది తానే పలు స్థలములలో ప్రయోగించిన నిర్గుణ పదమును తానే సమన్వయరూపార్థముగా వివరించుకొన్న ట్లయినది. ఇది విశిష్టాద్వైత మతసమ్మతముగాక మరేమి ?

ఇట్లే మోక్షమనగా వెనుక భీష్మనిర్యాణ ఘట్టములోని పద్యమున మేము వివరించినట్లు బ్రహ్మైక్యముగాక తత్సారూప్యమే ననుట పోతనకు సమ్మతమని ఈ ఘట్టముననే గల గద్యఖండము నిరూపించుచున్నది. 'సత్త్వరజస్తమోగుణ హీనుండైన జనుండు మత్సమానాకారతం బొందును' అనునది ఆ వాక్యము. ఇట్లెన్నో ఉదాహరింపవచ్చును.

9. అయినను కొన్ని సంవత్సరములకు పూర్వము పోతనార్యుని గురించి అతడద్వైతియా విశిష్టాద్వైతియా, శైవుడా, వైష్ణవుడా అను వివాదములు లేవదీసి కొందరు చర్చించియుండిరి. భోగినీదండకము వీరభద్రవిజయము రచించు కాలమునకు అతడు శైవుడని, భాగవత రచన జరుగునప్పటికి వైష్ణవ విశిష్టాద్వైతిగా మారెనని కొందరును, శ్రీధరీయము ననుసరించుటచేతను గ్రంథాది యందలి స్వీయ వంశావళిని చెప్పు పద్యములచేతను అత డద్వైతాభిమాని యగు శైవుడని కొందరును వాదించుచు వచ్చిరి. ఇట్టి విషయములలో మాకు ప్రత్యేకాభిమానము ఏ పక్షముననను లేదని మొదటనే తెలుపుకొంటిమి. పూర్వము ఒక వ్యాసమున తిక్కన విషయమున గూడ ఆ మహాకవి మాఘకాళిదాసాదుల వలె

ఏ ఒక్క మతము నవలంబించినవాడు కాక, షడ్దర్శనముల యందును ఆయా సంప్రదాయముల యందును సమబుద్ధిని కలిగియుండెనని, అతనినట్లే భావించుట మంచిదని తెలిపియుంటిమి. పోతన విషయమున గూడ నంతేనని మా నిశ్చయము. శ్రీధరీయమును తు.చ. తప్పకుండ అనుసరించెనను విషయముననే మాకు గల వైమత్యమును ఈ వ్యాసమున వివరించితిమి.

# ఆంధ్ర భాగవతము — ద్వైతసిద్ధాంతము

## తీర్థం శ్రీధరమూర్తి

**భాగవత స్వరూపం :**

భగవదవతారమూర్తియైన వేదవ్యాసమునీంద్రుడు లోకహిత దృష్టితో సకల వేదార్థ ప్రతిపాదకముగా ఇతిహాస పురాణములను విరచించెను. లోకము త్రిగుణాత్మకము. కావున అష్టాదశ పురాణములను తదనుగుణముగా వెలయింపజేసెను. కావున పురాణములు సాత్త్విక రాజస తామస భేదములచే ప్రవర్తిల్లు చున్నవి. ఏ పురాణము నందు విష్ణువు యొక్క మాహాత్మ్యము అధికముగా కనుపట్టునో అది సాత్త్వికపురాణమని పురాణనిర్వచనము[1] కలదు. కాబట్టి విష్ణువు యొక్క అనేకావతారముల మహిమాతిశయమును విస్తారముగా వర్ణించునట్టి శ్రీమద్భాగవతము సాత్త్విక పురాణములలో పరిగణింపబడి యున్నది.

ముఖ్యముగా శ్రీమద్భాగవతము భక్తిరస ప్రధానమైన ఒక శాస్త్రగ్రంథమై యున్నది. జీవన సార్థక్యమునకు భక్తి ఉత్తమసాధనమని సకల మతాచార్యుల యొక్క అభిప్రాయమై యున్నది. కాబట్టి ద్వైత అద్వైత విశిష్టాద్వైత గౌడీయ వైష్ణవ వలభ నింబార్క ఆదిగా గల మత ప్రవక్తకులు, తదనుయాయులు గూడ భక్తిరసామృతము వెల్లివిరియు భాగవతము యొక్క ప్రామాణికతను గుర్తించి, దానికి సుందరమైన వ్యాఖ్యానములను రచించి యున్నారు. వారిలో ద్వైతసిద్ధాంత ప్రతిష్ఠాపన ఆచార్యులని ప్రసిద్ధి గాంచిన మధ్వాచార్యులు శ్రీమద్భాగవత నిరూపితార్థ బోధకముగా భాగవత తాత్పర్య నిర్ణయము అను గ్రంథమును కావించి యున్నారు.

**మధ్వాచార్యుల జీవితచరిత్ర :**

కర్ణాటక దేశమున, ఉడుపీ ప్రాంతమున పాజకము అను క్షేత్రము గలదు. అందు మధ్యగేహభట్టు, వేదవతి అను సాత్త్విక దంపతులు ఉండిరి. వారు ఉడుపిలోని అనంతేశ్వరుని ఆరాధించి, అతని యనుగ్రహమున ఒక కుమారుని

పడసిరి. ఆ కుమారునికి వాసుదేవుడని పేరు పెట్టిరి. ఆ బాలునకు ఐదవ యేట ఉపనయనము జరిగినది. గురువులకడ విద్యాభ్యాసము సాగినది. అతనికి బాల్యమునందే విరక్తి కలిగినది. బాలుఁడైన వాసుదేవుడు ఉడుపికి పోయి అక్కడ హంసనామక పరమాత్మని ద్వారా యేర్పడిన, పరమహంస పీఠమున విరాజిల్లు చుండిన అచ్యుతప్రేక్షయతుల నుండి సన్యాసమును స్వీకరించి, పూర్ణప్రజ్ఞయతి యని ఆశ్రమ నామమును పడసెను. వీరికే మధ్వ ఆనందతీర్థ పూర్ణబోధ ఇత్యాదులు నామాంతరములు.

మధ్వాచార్యులు వాయుభగవానుని యొక్క మూడవ యవతార మని ప్రసిద్ధి.[2] 'మధిత్యానంద ఉద్దిష్టః వేతి తీర్థముదామృతం' ఆనందకరమైన, విష్ణూత్కర్షను దెల్పు శాస్త్రములను రచించుటచే మధ్వ అను పేరు వచ్చినది. మధ్వమహిమ వేదము లందును కొనియాడబడి యున్నది.

'యదీమను ప్రదివో మధ్వ అధవే గుహాసంతం మాతర్విశ్వా మధాయతి'
— బళిత్థాసూక్తము

మహాజ్ఞాని యైన వాయుదేవుని యొక్క అవతారరూపులైన మధ్వాచార్యులు శ్రీమన్నారాయణుడే. తరువాత మధ్వాచార్యులు మహాబదరీక్షేత్రమునకు పోయి వేదవ్యాసుల వారిని సందర్శించి, మరలి వచ్చి, ప్రస్థానత్రయమునకు భాష్యములను, కొన్ని ప్రకరణ గ్రంథములను, స్తోత్ర గ్రంథములను, భారత భాగవత తాత్పర్యనిర్ణయ గ్రంథములను, మొత్తము 37 గ్రంథములను రచించి, వేదవిహిత ద్వైతసిద్ధాంతమును పునరుద్ధరించిరి.

**ద్వైతసిద్ధాంతము :**

ద్వైతసిద్ధాంతము అనాదియైనది. వేదప్రతిపాదితమైనది. ద్వైత మనగా ద్వయోః భావః ద్వితా తస్యాః ఇదం ద్వైతం. ద్విత్వేన ఇతం ద్వైతం. ద్వాభ్యాం ఇతం ద్వైతం. ద్వితాయాం భవం ద్వైతం. రెండు ప్రధాన తత్త్వములు గలది ద్వైతం అని పరమార్థము. ఈవిషయమును మధ్వాచార్యులిట్లు ఉద్ఘోషించి యున్నారు —

స్వతంత్ర మస్వతంత్రం చ ద్వివిధం తత్త్వమిష్యతే
స్వతంత్రో భగవాన్ విష్ణుః భావాభావౌ ద్విధేతరత్[3]

స్వతంత్రము, అస్వతంత్రము అని తత్త్వము రెండువిధములు. ఐశ్వర్యాది షడ్గుణసంపన్నులైన విష్ణువు స్వతంత్రతత్త్వము. స్వతంత్రతత్త్వము కంటె భిన్నమై భావము, అభావము అని రెండు విభాగములు గలది అస్వతంత్ర తత్త్వము. వేదములో ఈ ద్వైతతత్త్వ మిట్లు దృష్టాంతపూర్వకముగా నిరూపింపబడి యున్నది.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి
– అధర్వణోపనిషత్తు, ఖండ. 5, మంత్ర.

రెండు పక్షులు ఒక యశ్వత్థవృక్షమును ఆశ్రయించి యున్నవి. అవి ఒక దానిని వదలి మరొకటి యుండదు. పరమ మిత్రములై మెలగుచుండును. వానిలో ఒక పక్షి అశ్వత్థఫలమును రుచికరమైనదను భావముతో భక్షించును. రెండవపక్షి ఫలమును భక్షింపకయే తేజరిల్లుచుండును అని సామాన్య అర్థము. జీవుడును దేవుడును దేహమున సదా కూడియుందురు. జీవుడను పక్షి దేహజన్య కర్మఫలమును అనుభవించును. భగవంతుడను మరొక పక్షి యెట్టి కర్మాను భవమును లేక స్వయంజ్యోతియై ప్రకాశించుచుండు నని తత్త్వార్థము. విరుద్ధ ధర్మములు గల ఈ రెండు పక్షుల చర్యలలో ద్వైతతత్త్వము ఇమిడియున్నది. ఇదే ద్వైతతత్త్వమును శ్రీమద్భాగవతము కూడ అక్షరశః గ్రహించి యున్నది. కాబట్టి శ్రీమద్భాగవతము ద్వైతతత్త్వ ప్రతిపాదక గ్రంథము అనుటలో విప్రతిపత్తి యుండదు. చూడుడు –

సుపర్ణావేతౌ సదృశౌ సఖాయౌ యదృచ్ఛయాఏతౌ కృతనీడౌ చ వృక్షే
ఏకః తయోః ఖాదతి పిప్పలాన్నం అన్యోనిరన్నో ఒ బలేన భూయాన్
– భాగ. – స్కం.11, అధ్యా. 11, శ్లో.6

పై వేదమంత్రము, భాగవత శ్లోకము జీవేశ్వరులకు గల పరస్పర భేదమును స్పష్టము చేయుచున్నవి. ఈ ఈశ జీవులకు గల భేదమే ద్వైతసిదాంతమునకు మూలతత్త్వము. ఇక ద్వైతసిద్ధాంతములో గల ప్రధానప్రమేయ భాగములను పేర్కొని, వానికి అనుగుణములైన ప్రమాణభాగములను పోతన రచించిన యాంధ్ర భాగవతము నుండి యుదాహరణములుగా చూపబడును.

**ద్వైతప్రమేయ నవరత్నములు[4] :**

1. శ్రీమన్నారాయణుడే సర్వోత్తముడు, 2. ప్రపంచము సత్యమైనది, 3. పారమార్థికముగా భేదము గలదు, 4. జీవులు విష్ణుసేవకులు, 5. జీవులలో తరతమ భావము గలదు, 6. స్వరూపానందానుభూతియే మోక్షము, 7. నిర్మలభక్తి ముక్తికి సాధనము, 8. ప్రత్యక్షాదులు ప్రమాణములు, 9. విష్ణువు సకల వేదవేద్యుడు.

1. శ్రీమన్నారాయణుడే సర్వోత్తముడు :

విశ్వమయతలేమి వినియు నూరకయుండి
రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డపడఁదలంచె

గజేంద్రుడు మొసలిచేత చిక్కి, తన శక్తిసామర్థ్యములు నమ్ముకాగా 'రావే ఈశ్వర ! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా !' అని భగవంతుని శరణు వేడగా విష్ణువు వచ్చి గజేంద్రుని రక్షించెను. కాని బ్రహ్మాది దేవతలు ఎవరును గజేంద్రుని మొరను ఆలకింపరైరి. కారణ మేమనగా 'విశ్వమయత' అను గుణము విష్ణువు నందు తప్ప బ్రహ్మాదుల యందు లేదు. ఇది వాసుదేవ తత్త్వార్థమై యున్నది. ఈ కారణముచే విష్ణువు సర్వోత్తముడని తేలినది. 'అగ్నిర్వై దేవానాం అవమః విష్ణుః పరమః' అని వేదము పలుకుచున్నది.

2. ప్రపంచము సత్యమైనది :

ఘన లీలాగుణచాతురిన్ భువనముల్ కల్పించి రక్షించి భే
దనముంజేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్ర వీ
ర్యునికిన్ నిత్య పవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా
త్మునికిన్ వందనమాచరించెదఁ గృపాముఖ్య ప్రసాదార్థినై
7–306

హిరణ్యకశిపు వధానంతరము బ్రహ్మ నరసింహుని స్తుతించు సమయమున అతని యొక్క జగత్సృష్ట్యాది మహాకార్యములను అభినందించు సందర్భము లోనిదీ పద్యము. ఈ జగత్తు సర్వానుభవసిద్ధమై, సత్యమై యుండగా దీనిని చెప్పనేల ? అని శంక రావచ్చును. కొందఱు 'జగన్మిథ్యా' అని చెప్పెదరు. అనగా ఈ జగత్తు అంతయు మిథ్య అని అర్థము. మిథ్య అనగా త్రికాలముల యందును లేనిదని అర్థము. తన్నిరాసారము జగత్తు సత్యమైనదని చెప్పబడినది. జగన్నిర్మాణ క్రమము ఇట్లున్నది—

కుమ్మరి మట్టితో కుండలు చేయును. కుండకు మట్టి ఉపాదాన కారణము. కుమ్మరి నిమిత్తకారణము. కుమ్మరి తాను తయారుచేసిన కుండ కంటె సర్వ ప్రకారముల సదా బిభిన్నుడుగానే యుండును. కాని ఘట నిర్మాణ రూపమగు కార్యమును మాత్రము కలిగియుండును. అట్లే భగవంతుడు కూడ. భగవంతుఁడు ప్రకృతి ద్వారా సమస్త ప్రపంచమును సృష్టించును. ప్రపంచసృష్టికి ఉపాదానకారణ మయిన ప్రకృతి నిత్యమైనది, సత్యమైనది. కావున భగవంతుడు నిమిత్తకారణము. అతనిచే సృష్టింపబడిన ఈ ప్రపంచము మిథ్య కాక సత్యమైనది. ప్రపంచసృష్టికి కారణముగా భగవంతుడు సక్రియుడాయెను. 'విశ్వం సత్యం' అని వేదవాక్యము. 'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్య నాదీ ఉభావపి' అని గీతావాక్యము.

3. పారమార్థికముగా భేదము గలదు :

వేదము లన్నియు విష్ణువును సర్వ చేతనాచేతనముల కంటె భిన్నుడని తెల్పుచున్నది.

'సర్వే వేదాః హరేః భేదం సర్వస్మాత్ జ్ఞాపయంతి హి'
— నారాయణశ్రుతి

పురుషుం డాఢ్యుఁడు ప్రకృతికిఁ
బరుఁ డవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా
సురుఁడును లోకనియంతయుఁ
బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ ! 1–149

ఇది కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించు పట్టున గలదు. శ్రీకృష్ణుడు అఖిల భూత బహిరంతర్భాసురుఁడై యుండియు ప్రకృతికంటె 'పరుఁడై' అనగా భిన్నుఁడై ఉత్తముఁడై యున్నాడు.

4. జీవులు శ్రీవిష్ణుని సేవకులు :

ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా
పతులు భృగుఁడు భూతపతులు శిరము
లందుఁదాల్తు మతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరికార్యమతుల మనుచు 9–111

దుర్వాసోమునికి అంబరీషచక్రవర్తి అపకృతిసేయ తలపెట్టగా, అపుడు విష్ణు చక్రము దుర్వాసుని వెన్నంటెను. దాని బారినుండి తప్పించుకొనదలచి దుర్వాసోముని బ్రహ్మను శరణువేడగా, అపుడు బ్రహ్మ తన యసమర్థతను వెల్ల డించు ఘట్టములోనిదీ పద్యము. బ్రహ్మ శివుడు ఇంద్రాదిదేవతలు జగద్ధిత దృష్టితో నారాయణుని యాజ్ఞను తలదాల్చుటచే బ్రహ్మాదిదేవతలు విష్ణు కింకరు లనుట స్పష్టము కాగా ఇక మానవుల సంగతి వేరుగా చెప్పనేల ? 'మన్మనా భవ మద్భక్తః మద్యాజీ మాం నమస్కురు' అని గీతావాక్యము.

5. జీవులలో తర తమ భేదము గలదు :

జీవులు సాత్త్విక రాజస తామస భేదములచే మూడువిధములు. సాత్త్వి కులు నిశ్చలమైన భగవద్భక్తి కలిగి యుందురు. తామసులు భగవద్ద్వేషులై యుందురు. దీనికి ప్రహ్లాదుఁడు, హిరణ్యకశిపుడు దృష్టాంతములు. ప్రహ్లాదుఁడు పుట్టుకతో హరి భక్తుడు. సర్వకాల సర్వావస్థల యందును అతనికి విష్ణుధ్యానమే.

పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీచింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా !
7–123